# వి ష య సూ చి క

# శైవమత ప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమునఁ బ్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక


| సంపుటము | దుర్ముఖినామ సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౧ | 15—5—1957 | ౧ |


## సంపాదకీయము

శైవమత ప్రకాశిక ప్రారంభింపబడి సక్రమముగ శైవధర్మ బీజముల పాఠక హృదయ క్షేత్రముల సకాలములో నాటుచున్నది. కొన్ని మొలకలెత్తినవి. మఱికొన్ని పల్లవించినవి. క్షేత్రములు మంచివిగాక కొన్నియు - వేసవిగాడ్పుల మఱికొన్నియు - మొలవ లేదు.

అంతా శైవమయము - శైవమతమే ప్రపంచము. షడక్షరీ మహామంత్రము - సంధ్యావందనము - శివతత్త్వ ప్రబోధము - జగద్గురు నీలకంఠారాధ్యులు - శైవకవుల చరిత్రము - శివోపాసనా రహస్యము - శివస్తోత్రములు - మహాపురుషుల ప్రశంస - శైవభేదములు- శక్తిపాతము - మున్నగు నమూల్య విషయముల - లోకమునకందిచ్చినది శైవమత ప్రకాశిక.

శైవమహాపీఠ వర్ధంతి సభ - హేవిళంబినామ సం||ర జ్యేష్ఠ శు ౨-3-౪ - 1957 జూన్ (14,15,16) తేదీలలో వరంగలులో జరుప వలసినదిగా ఆహ్వానము కార్యదర్శిగారికి పంపబడినది. ఆహ్వానకర్తలు

శ్రీ. లో. శివపురపు వీరభద్రయ్యగారు. 48 వ వర్ధంతికి-శైవులు పలు ప్రాంతముల నుండి విచ్చేసి ఐకమత్యముతో కర్తవ్య విషయముల సంఘాభివృద్ధికై నిర్ణయింతురుగాత 48 వ వత్సరము వచ్చినను సంపూర్ణమగు నిర్మాణాత్మక కార్యనిర్వాహణశక్తి సంఘమునకు లభింపలేదు. అందుకై తగిన కృషిని శైవమహాజనులెల్లరు విచ్చేసి నిర్వహింప నభిలషించుచున్నాము - కార్యదర్శిగారు త్వరలో తమ ఆమోదము తెలుపుదురని భావించుచున్నాము.

శ్రీ భ్రమరాంభా సమేత మల్లికార్జునస్వామి కృపయు-షట్స్థల పూజాపరాయణులగు మహేశ్వరుల ఆశీస్సంపత్తియు - జయప్రదముగ భవిష్యత్కార్యము జరిపింప గలదని విశ్వసించుచున్నాము.

శ్లో॥ కైవల్యాధార లింగే, ఘనవిమల సదాకార చిత్పూర్ణలింగే
సద్భక్త ప్రాణలింగే సతతకరతల ప్రోల్ల సద్భావలింగే
పంచబ్రహ్మాత్మ లింగే పరమపద - పరంజ్యోతిరోంకార లింగే
నిత్యం శ్రీ శైలలింగేని వసతు హృదయం మామకాం సిద్ధలింగే॥

---

# శైవమహాపీఠము

## విజయవాడ

### హనుమాన్‌పేట, సాంబమూర్తి రోడ్డు

20 వ శైవమహాసభ 3 వ తీర్మానము ప్రకారము విజయవాడలో శైవమహాపీఠ భవనము నిర్మింపబడినది. ప్రతివత్సరము - నవరాత్రములు - గణార్చనలు - సమావేశములు జరుపబడుచున్నవి. గత వత్సరము ఆశ్వీజ శు ౧ మొదలుకొని శతాహదీక్షగ ప్రారంభింప బడిన పంచాక్షరీ పురశ్చర్యా కార్యక్రమము, కోటి బిల్వార్చనా

కార్యక్రమము మాఘ శు ౧౫ తో మహావైభవముగ సమాప్తి చేయ బడినది.

సర్వశైవుల మానసభావ సమైక్యతకై పారమార్థికముగ ఒక్క కదళీఫలము గుప్పెడు గోధుమపిండితో 4 నెలల 15 రోజులు పర్యంతము తదేక దీక్షగా బిల్వార్చన జరిపించిన మన పీఠ ప్రధాన మంత్రి గారయిన శ్రీ రాజా కందుకూరి వటుక భైరవమూర్తిగారి సాహసమెంతయు ప్రశంసనీయము. ఆ కార్యక్రమములో పాల్గొనిన శ్రీపతి పండితారాధ్యుల పట్టైన లింగారాధ్యులు, ములుగు వీరమల్లి కార్జునారాధ్యులు, ఇవటూరి వీరభద్రారాధ్యులు, శివపురము బసవారాధ్యులు, కాశీనాథుని శరభారాధ్యులు మున్నగువారెంతయు ప్రశంసనీయులు.

ప్రత్యక్షముగావచ్చి తమ కుటుంబముతో మల్లికార్జునస్వామి వారి నర్చించిన అత్తలూరి సుబ్బారావుగారు, వారి అల్లుడు ఇవ టూరి కోటేశ్వరరావుగారు, కందుకూరి రాజారావుగారు వారి సతీ తిలకములు మనసార పూజలుచేసి తత్పూజాఫలంబు లనుభవించి యానందము నొందిరి. ఈడుపుగల్లు వాస్తవ్యులయిన కాశీనాథుని వీరేశలింగంగారు - ఇవటూరి కోటేశ్వరరావుగారు - శరభయ్యగారు న్యాయవాదులయిన బందా శ్రీరామచంద్రరావుగారు, B. A. B. L. మున్నగువారు మాఘ పున్నమినాడు పూర్ణాహుతి పూర్తియగు నంత వరకునుండి ఆనాడు జరిగిన గొప్ప అన్నదాన మహోత్సవమును కనులారగాంచి యచటభుజించి కార్యకర్తల కాశీర్వాదము లొసంగి వెళ్ళినందులకు మా సంతోషమును వెల్లడించుచున్నాము. కొందఱు మహిళా మణులు పూర్తిగా పై కార్య నిర్వహణములో పలువిధముల సాహాయ మొనర్చినందులకు మా ధన్యవాదములు. వివరములు - ఆదాయ వ్యయములు - ఇందు ప్రత్యేకముగా చివర పుటలలో ప్రకటించబడినవి. ఆదినుండియు ఏ తత్కార్య నిర్వహణలో

సలహా లొసంగిన పీఠాధిపతులకు - శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి మా ప్రత్యేక మనఃపూర్వక నమోవాకములు. ఇంకను మాకు సహాయముచేసిన సతీరత్నములకు, సత్పురుషులకు అభివందనములు. లోపములున్న క్షమించమని మాహేశ్వర గణమునకు - వినతి వితతులు—

— కార్యనిర్వాహక వర్గము.



## శ్రీ శైవ మహాపీఠ భవన నిబంధనలు

ఇంతవరకు భవన మాహేశ్వరులుగా నియమింపబడిన శ్రీ ములుగు వీరమల్లికార్జునంఅయ్యావారు, విజయవాడ కృష్ణలంకలో స్వస్థలము సంపాదించుకొని అందులోనికి కాపురము వెళ్లినందున సదరు పదవి నుండి ఆయనను విరమింపజేయడమైనది.

—∞—

## శైవమహాపీఠ సభ్యులకు మనవి

హేవిళంబి నామసంవత్సర చందాలు సభ్యులందరు వెంటనే కార్యస్థానము విజయవాడకు కార్యదర్శిగారి పేర పంపగోరెదము : నూతన సభ్యులుగూడా మహాజనసభా సమావేశ తేదీ యగు 1957 జూన్ 16 వ తేదీలోగా తమ చందాలు పంపినచో, మహాజన సభా సమావేశములలో పాల్గొనుటకు హక్కు కల్గును. చందాలు ఇవ్వని సభ్యులకు వోటింగుహక్కు మాత్రముండదు. సభ్యత్వ సంవత్సర చందా రు. 1-0-0 అని అందరకు తెలిసినదే.

కార్యదర్శి.

# జగద్గురు నీలకంఠ శివారాధ్యులు

## పీఠాధిపతి

మహా ప్రమథగణములు - రుద్రగణములు - యోగాచార్యులు మున్నగు భక్తులగు శివయోగుల స్మరణవచన చిరమనోరథములు సిద్ధించును. దుష్కర్మ దుస్స్వప్న అపమృత్యు దారిద్ర్యాది బాధలు తొలగును. ఈ గణస్తవపద్ధతులు రెండురకములు. శివపురాణములోని గణస్తవము లింగార్చనాపరులదిగను - చారిత్రలోని గణస్తవము శివలింగధారులైన శైవులపద్ధతిగను గన్పించుచున్నది. ఆగమ గ్రంథంబులందుగూడ శైవు లాచరించుపద్ధతిలోనేగలదు. శ్వేతుడు, బకులీశుడు గ్రంథద్వయమునందు వ్రాయబడినారు. నీలకంఠారాధ్యుల వారి గురువు (వీరివురుగాక) తగిన యాధారము లభించునంతవరకు మరి యొకరిగనే భావించవలసి యున్నది.

## జీవిత చరిత్ర

కైలాసపర్వతమున పార్వతీ పరమేశ్వరులు పేరోలగంబున సభతీర్చి కూర్చుండిరి. ఆసమయమున శ్రీ మహావిష్ణువులేచి చేతులు జోడించి "మహేశ్వర! శివభక్తి ప్రపంచమున ప్రతిక్షణము క్షీణించు చున్నది. వ్యాససూత్రములకు నిజమైన అర్థమును వచించుచున్నవారు కారు. ఏమికారణమని యడుగ విశ్వేశ్వరు డిట్లుపలికెను.

"నారాయణ! సర్వము నాకు తెలియును. విఘనసమర్షి యు— బాదరి మునీంద్రుడును నన్నుగూర్చి ఘోరతపస్సుచేసి, తమ తమ మత ప్రచారములు జరుగవలెనని వరంబులు గ్రహించిరి. వారి ప్రచారముల కాలము సమాప్తము కావచ్చినది. మాయామోహితులైన సమస్త ప్రపంచమునందు తిరిగి నాభక్తిని బోధించుటకు మదంశ సంభూతు డయిన నీల లోహితరుద్రుని భూలోకమున నీలకంఠారాధ్యుడను

పేరుతో జన్మింప నానతిచ్చితిని" అని వచింప దేవగణమంతయు సంత సించెను. అని బోధాయనుడు విశ్వేశ్వరారాధ్యులకు వచించెను. నీలలో హితరుద్రుని యంశతో నీలకంఠారాధ్యులు కాళేశ్వరమున జన్మించినాడు.

నీలకంఠారాధ్యులవారి మూలపురుషుడు ఆంగీరసమహర్షి. ఆతని పుత్రుడు బృహస్పతి. ఆతని కుమారుడు భరద్వాజమహర్షి. ఈతని వంశములో నీలకంఠారాధ్యులు జనకుడయిన విశ్వేశ్వరారాధ్యులు జన్మించెను. ఈతని సతీతిలకము గౌరీదేవి. విశ్వేశ్వరారాధ్యులు కాశీ యందు తపస్సుచేసి యీశ్వరానుగ్రహ పాత్రుడై యొకపుత్రుని బడ సెను. కాళేశ్వరవాసి యగు నీలకంఠారాధ్యులు బోధాయన మహర్షి సదుపదేశములనొంది వారాణసీ వాస్తవ్యుడైన శ్వేతాచార్యుల వద్ద సకల విద్యలు సాధించి తదాశీర్వాదమునొంది తిరిగి యింటికి వచ్చెను.

హారిత గోత్రోద్భవుడయిన వీరభద్రాచార్యుని కుమార్తెయగు సర్వమంగళను వివాహము చేసికొనెను. ఆ కాలమునందే కుబేరాంశతో జన్మించిన విక్రమాంక రాజువలన సువర్ణభూషణాంబ రాది బహుమతుల నొందెను.

గృహస్థాశ్రమ స్వీకారము చేసిన పిదప శిష్యవర్గ మధికముగా చేరెను. బోధాయన వృత్తి ననుసరించి తనపేరుతో ప్రస్థానత్రయము రచించెను. ఇంకను శైవమత గ్రంథము లనేకము రచించెను. ఈ మహా త్ముని శిష్యులలో దాక్షిణాత్యుడయిన హరదత్తుడు, ప్రాగ్దేశవాసి యైన భీమేశ్వరుడు, ఉదీచ్యుడయిన భవదేవుడు, పశ్చిమదేశవాసియైన సోమశేఖరుడు, సర్వదర్శనములభ్యసించి శైవమత ప్రచారము విరి విగా నొనర్చిరి.

నీలకంఠారాధ్యులవారికి సోమేశ్వరుడు, అఘోరనాథుడు, కాళే శ్వరుడు, శ్రీగిరీశ్వరుడు అను నలుగురు కుమారులు గలిగిరి.

బౌద్ధాది సర్వ మతముల జయించి నీలకంఠారాధ్యులవారు శైవమతమే ఆదిమతమని నిరూపించిరి.

ఒకానొకప్పుడు కాశీనగరమున గొప్ప పండిత మహాసభ జరిగెను. "శివ ఏవ కేవలః శివాదన్యంనకించన" అను శివాద్వైత సిద్ధాంతమును పరమతఖండన మొనర్చుచు నీలకంఠారాధ్యులు స్థాపించిరి. అంత తమ తమ భాష్యములే శ్రేష్ఠములని గర్వింప జొచ్చిరి. మన భాష్యములన్నియు అమ్మవారి ముందుంచి తలుపు వేయుదమనియు, ఏ భాష్యమును అమ్మవారు శిరస్సునందు ధరించునో అదియే నిగమాగమ సిద్ధాంత బోధక భాష్యమని అంగీకరించుదమని యందఱు తలంచిరి. భాష్యములన్ని దేవీ సన్నిధానమందుంచిరి. తలుపులుమూసి కొంచెపు సేపుంచి తెరచునప్పటికి నీలకంఠభాష్యమునే అమ్మవారు తన శిరస్సున ధరించి యుండెను. అది చూచి పండిత బృందమంతయు విస్మయముచెందెను. నీలకంఠారాధ్యులవారిచే నెలకొల్పబడిన శివాద్వైత సిద్ధాంతమే వైదిక సిద్ధాంతమని విద్వాంసులెల్లఱు నిశ్చయించి శివుడే ఆది దైవమని ప్రచారము చేయ దొడగిరి. ఎంతవరకు నీలకంఠారాధ్యులవారు పండిత సభలందు శైవసిద్ధాంతమైన శక్తి విశిష్ట శివాద్వైతమును పూర్వపక్షముల ఖండించుచు సిద్ధాంతీకరించుచుందురో, అంతవరకు శలాకరహితమైన ఘంటనుండి ప్రణవధ్వని మ్రోగుచుండునట. ఈ క్రింది శ్లోకద్వయమువలన పై విషయము బోధింపబడు చున్నది.

శ్లో॥ కాశీనగర్యాం కృత సత్సభాయాం ।
ఉద్ఘాటితోయా వడుమా కవాటః ।
యద్భాష్యమంబానిజ మూర్ధ్న్యధత్త ।
తం నీలకంఠం శిరసానమామి ॥

శ్లో॥ యస్య ప్రవృత్తాసు సభాసు నిత్య
మాద్యంతయోర్వాఙ్ముఖ సత్ప్రసంగే

ఘంటాహ్వానాదీద్రహితా శలాకయా
తంనీల కంఠం విబుధం నమామి॥

నీలకంఠారాధ్యులనేక గ్రంధముల రచించి శివాద్వైత సిద్ధాంతమును వ్యాపింపజేసి క్రమముగా వానప్రస్థ సన్యాసాశ్రమముల స్వీకరించి శివసాయుజ్యమునొందెను. విశేషాంశములు నీలకంఠ విజయకావ్యమునుండి తెలిసికొనవలెను.

*

## శైవదీక్ష

(౽వ సం - ౧౨ సంచిక తరువాయి)

ముడిగొండ రామలింగశాస్త్రిగారు - ఈమని

మను దీక్షకు సంబంధించిన యీ యేడు దీక్షలను గురువు శిష్యునికి బోధింపవలయును.

ఓ శిష్యుడా! ఇష్టలింగము కంటె నితరమగు వస్తువును చూడకుము. ఇది యేకాగ్ర చిత్తదీక్ష.

ఓ శిష్యుడా! శరీరముండు వఱకు వ్రతములను విడువకుము. ఇది దృఢవ్రతమను దీక్ష.

ఓ శిష్యుడా! నేను సతిని లింగము పతియని చిత్తమున నిశ్చయించి ఇష్ట ప్రాణభావములను మూడు లింగములకు తను మనోభావముల నర్పించుము. ఇది దేహత్ర యార్పణమను దీక్ష.

ఓ శిష్యుడా! సర్వభూతములను నిన్నుంబలె నెంచుచు వానిని బాధింపకుము. ఇది అహింసయను దీక్ష.

ఓ శిష్యుడా! ఆది మధ్యాంతరహితమై బ్రహ్మసంజ్ఞకమైన యేలింగము గలదో యందే నిష్ఠగలవాడ వగుము. ఇది లింగనిష్ఠ యను దీక్ష.

ఓ శిష్యుడా! లింగరూపమును ధ్యానము చేయుచు చిరకాలము అమనస్కుడవై యుండుము. ఇది లింగరూప మనెడియదీక్ష.

ఓ శిష్యుడా! నేను చెప్పిన యర్థమునందు దృఢనిశ్చయము కలిగి ప్రవర్తింపుము. ఇది సద్యోముక్తి దీక్ష.

ఈ విధముగా గురువు శిష్యునికి బోధించి తరువాత "ప్రాణేష్వాంతర్మనసో లింగమాహుః" అను మంత్రమును – "శివేన వచసాత్వా" అను మంత్రమును పఠించి శిష్యుని కుడిచెవి యందు షడక్షర మహామంత్రమును మెల్లగా ముమ్మారు ఉపదేశింప వలయును.

ఇట్లు గురువు మనుదీక్షచే భావింపబడిన శివకళను తన చిత్తమున ధ్యానించి ఆ కళను దృష్టియందు జేర్చి మూలమంత్రమును జపించుచు నాకళను శిష్యుని యెడమ చేతనున్న లింగమునందు ప్రవేశపెట్టవలయును.

కళ ననుసరించి భావంబును – భావము ననుసరించి మనంబును – మనస్సు ననుసరించి దృష్టియు – దృష్టి ననుసరించి స్థలంబు నుండును. తైలబిందువు జలకుంభమందుబడి వ్యాపించి యుండునట్లు శివకళయు దేహప్రాణ చిత్తముల యందు వ్యాపించి యుండును.

హృదయ కమలంబున ప్రజ్వలించు కాలాగ్నితుల్యమగు వహ్నిశిఖయొక్క మధ్యభాగంబున చిద్రూపమగు శివకళగలదు. సకల తత్త్వములను బోధించు పరమ సూక్ష్మమైన యా శివకళను లింగమునందు ప్రవేశపెట్టవలయును. అప్పుడు ప్రాణప్రతిష్ఠా మంత్రములతో గూడ మూలమంత్రమును పఠింపవలయును.

తరువాత గురువు సంస్కరింపబడిన యీ లింగమునందు స్థిరముగ నుండు మనియు - భక్తుడే శరీరముగా గల వాడవగుమనియు - పాంచభౌతికముల యందు ప్రాణము నుంచక లింగమునందే ప్రాణము నుంచిన వాడవగుమనియు శిష్యున కుపదేశించ వలయును.

తరువాత గురువు శిష్యు నుద్దేశించి ఓ శిష్యుడా! నీవు ప్రతి దినము మాహేశ్వరులను గురువును లింగమును బాగుగ పూజింపుము. అష్టావరణములయందు శ్రద్ధనుంచుము. పంచాచారముల యందు ప్రవర్తింపుము. అని యీ విధముగా బోధించి గురువు తిరిగి ప్రాణాయామముచేసి అంగలింగ ప్రతిష్ఠ యను దీక్ష నొసంగుదునని సంకల్పముచేసి యీ లింగమును పట్టు వస్త్రమునకుగట్టి "నమో బ్రహ్మణే ధారణంమే అస్తు" అను మంత్రమును పఠించుచు శిష్యుని కంఠమందు ధరింపజేయ వలయును. తరువాత గురుశిష్యులకు గప్పిన వస్త్రమును తీసివేయవలయును.

అనంతరము శిష్యుడు గురునకు ముమ్మారు నమస్కరించి గో భూ మ్యాది మహాదానములజేసి గురువుని సంతుష్టుని చేయ వలయును. గురువువద్ద తీర్థప్రసాదముల గ్రహించవలెను.

ముముక్షువులకిది ప్రధానదీక్ష. గురువు వలన నీ దీక్షను గ్రహించుటయేగాక భక్తితో శివపూజ నాచరించి యిహపర సౌఖ్యముల నొందుట శైవులగు వారలందరికి బ్రధాన కర్తవ్యము. ఈదీక్షా విధానమంతయు సక్రమముగా బైన వివరింపబడినది. ఇది కారణోత్త రాగమానుసారము వ్రాయబడినది. చిన్మయదీక్షా విధానముకంటె నిందు గొన్ని విశేషములు గన్పించుచున్నవి. దీక్ష నిచ్చు గురువును - దీక్షనుగ్రహించు శిష్యుడును ముఖ్యముగా దెలిసికొనదగిన ప్రధానాంశము లిందుగలవు. పరశివానుగ్రహము గల్గుట కింతకన్న ప్రధాన దీక్ష యెందునులేదు. బ్రహ్మవిష్ణ్వాది దేవతలు - గౌతమాది మునీంద్రులు

లింగమును శిరంబునదాల్చి శివారాధనచేసినటుల లింగపురాణాదుల యందు గలదు.

వేదాగమములయం దీ విషయము సుప్రసిద్ధమై యున్నది. కాన శైవులగు వారందఱీ విషయమును దెలిసి కొందురుగాత.

---

## నిర్వాణనిశ్రేణి

(గతసంచిక తరువాయి)

ముదిగొండ కొండయారాధ్య విరచితము

మానసముఁ మరుత్తులును, మంజులదృష్టియు మూడు నొక్కటై
లీలముఁజెందు నెందు నది, లింగము ధారణ నిష్టలింగ మా
దానను విద్యు దట్లు తోలు, తఁ గనవచ్చిన ఖండతేజ మా
దానినిఁ గాంచఁగల్గు టుచి, తంబగు లింగరహస్యమా శ్రుతిఁ. 85

జనుఁడు వివేకియై సకల, శాస్త్రములఁ నిగమాగమంబులం
దనుపమమైన జ్ఞానము స, మార్జనఁజేసి యెఱుంగ నెంచు నె
వ్వని తుదిమోక్షముఁ గనెడు, వాంఛఁ జరించున వెల్ల భక్తి నొ
నన శివభక్తికోటి హృద, యంబు లెఱింగిన ప్రాతమార్గముల్. 86

తను లింగంబటు లింగమే తనువుగాఁ, దాదాత్మ్యతావృత్తి నె
వ్వని భావంబున సుస్థిరత్వముగనుఁ, వాఁడీశ్వరుండయ్యె డా
తని దోషంబాక యింత యంటదు నసమ, స్తంబైన కార్యంబులఁ
తను లింగార్పణబుద్ధిఁ జెందుటను త, థ్యంబౌను దీక్షావిధిఁ. 87

సారూప్యాది చతుర్విధంబులగు మో, క్షంబుల్ శివుఁ దీక్షతో
నారాధించెడు లింగధారికిఁ దగుఁ, హస్తేష్టలింగంబు సం

సారచ్ఛేదకమౌచు లోహము నయ, స్కాంతంబటుల్ జీవు నా
చారాష్టావరణంబులన్ శివునిగా, సల్పున్ జిరస్పర్శచే. 88

శైవులు చెప్పనట్టి శివు, జాడలలో నడు వంగలేక దు
ర్భావముతోడ నన్యపద, వర్తనులై చరియింతు రేమనన్
గేవల మాత్మ పూర్వభవ, కిల్బిషమయ్యెడు కోడిరత్న మే
నావలఁజిమ్మి జొన్నలకు, నాసవహింపదె తుత్తుమాత్రకున్. 89

పాలను నీరునున్ గలిపి, వ్రాతమునందునఁబోయ హంస మా
పాలనె ద్రావినీరము ల, వంబును ముట్టదుగాదె ధాత్రి నా
లీలనె సర్వకర్మలను, లీనుఁడునయ్యును శైవుఁ డాత్మలో
శూలిఁదలంచు నన్యముల, చొప్పుగణింప మిసిద్ధమౌగదా! 90

ఆచారంబు సమస్తధర్మములు, ముఖ్యంబౌను కాదంచుఁ ద
ద్వాచాలత్వముఁజూపి చెప్పుట యసం, బద్ధంబగున్ శైవ పం
చాచారంబులు నుత్తమోత్తమము ల, ర్హంబుల్ ద్విజశ్రేణికిన్
నీచుండైనను నుత్తముండగును త, న్నిష్ఠాను సంధానతన్. 91

సకలాద్వైతగురుండు శంకరుఁడు సా, క్షాత్త్వాత్మరూపంబె గాఁ
బ్రకటించెన్ గద నీ మహత్వముఁ ద్వద, ర్చాసక్తివర్తించె వై
దికధర్మంబని చెప్పె శాంభవ మహా, దీక్షన్ ధరింపంగ లే
డక టాబౌద్ధుల భీతినందులకె స, న్యాసంబుఁ జేఁబట్టెఁగా. 92

ధరియింపం దగ దిష్టలింగమను చే, తథ్యం బౌకో వేంకటే
శ్వర హస్తంబున నున్న లింగవిషయం, బా సేతు కన్యాకరాం
తరలింగంబును జూచువారలకస, త్యం బెట్లు మర్త్యుల్ ధరన్
ధరియింపన్ బయి వారి యట్లగు, దు రం–దాధిక్యమే ముండినన్. 93

ఊష్మలతావిధంబున ప, డూర్ముల నెండగఁజేసి దేహమున్
భీష్మనిదాఘ సంసృతి న, భీష్టములన్ గన నీని యజ్ఞతా

ర్చి ష్మదనూనతాప మభి, షేకజలంబున మాన్చి మైహికా
ముష్మికసౌఖ్యముల్ గనఁగ, బూనుషుఁడాత్మఁ దలంపవర్ణ్మహా. 94

ఇరువదియేనులీలల వ, హించి శివుండిల శిష్టరక్షణం
బరి మథనంబుసల్పెనని, యందురు కొందఱు కొందఱున్ననో
యరువదినాల్గు లీలలను, నట్టులెసల్పె నటందురు ద్విలో
చరులగు వారలెల్లఱు ని, జంబుగ నీశ్వరలీలలేగదా. 95

తనుగుణముల్ గణించుచు హి, తంబని వాదులాడుచుర్
గనుఁగొనలేక యీశ్వరుని, కాయముగాచరులర్ భ్రమించి త
ద్ఘన కరుణాప్రసాదమునఁ, గాంచగ లేక శివత్వ మజ్ఞతర్
జనులుచరింతు రాగమ వ, చః ప్రతిపాదిత ధర్మమెంచకర్. 96



శ్రీ శివాయగురవేనమః
శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః
శ్రీ లక్ష్మీగణపతయేనమః

శ్రీ మదివటూరి వంశోద్భవులగు, సానందారాధ్యులవారిచే ప్రణీతమైన
నటరాజ శతకమునుండి గ్రహింపబడిన

## పద్యదశకము

సీ॥ శ్రీ రమాధవ దివ్య చిత్తాభ్రపథమున
నాట్యకేళినిసల్పు నటుడ, వీవ
పరమేష్ఠిగురుతర భావతారావీధి
జరియించుకేళికా పరుడవీవ
వాసవాదిసురౌఘ వరమానసాంబర
గురుతరనాట్యత త్పరుడ, వీవ

కమనీయ మునిమనో గగనమార్గంబున
పటు నృత్యఖేలనా స్పదుడ, వీవ 1

గీ॥ పరమ పురుషార్థదాయక భావరాగ
తాళములనొప్పునృత్యశా స్త్రమును దెల్పి
ధన్యునిం జేయవే నన్ను ధర్మభూజ
మాళిధృతరాజ, నటరాజ, మహితతేజ ॥

సీ॥ శర్వ! నీ సంకల్ప శక్తిచే జెలువొందు
బ్రహ్మాండరంగంబు రచనజేసి
రంగమందునజంద్ర రవితారకావళి
లలితవిద్యుద్దీప ములను నిలిపి
దీపికాతేజంబు దీపింప నెల్లెడ
బహుజంతుసంతాన పటలినెఱపి
యలజంతుసంతతి కన్యోన్యసంబంధ
బంధముల్ రచియించి పటిమమెఱయ 2

గీ॥ దేవమానవులాదిగా దెలియబడెడు
పాత్రములనిల్పి, నాటక పద్ధతులను
నేర్పువాడవునీవెగా, నిత్యమూర్తి
మాళిధృతరాజ, నటరాజ మహితతేజ ॥

సీ॥ చెలువొందుమామిడి చివురులభుజియించి
కో, యను పికపాళి కూతలందు
రమణీయతరులతా రమ్యశాఖలనుండు
ఘనశారికాశుక ధ్వనులయందు
పువ్వుపువ్వునదూరి పొలుపొందు మధువాను
రమణీయభృంగాళి రవములందు

లావణ్యపటిమచే రవళించికన్పట్టు
సారసాక్షులమృదు స్వనములందు 3

గీ॥ గానమాధుర్యరసమును గలయబోసి
గాయనీగాయనానంద ఘనత, గలుగ
రచనజేసితి వీసృష్టి రంగమెల్ల
మహాళిధృతరాజ, నటరాజ మహితతేజ



# శివతత్త్వామృతము

విద్యాప్రవీణ — ముదిగొండ శంకరశాస్త్రిగారు

తే॥ ఆది కమలజు స్పజియించి, యాతనికిచ్చె
వేదముల కూటమిని నెవ్వ, డాది మూర్తి
ఆత్మబుద్ధి ప్రకాశు, ననంతు నతని
మును శరణుబొందు దేనుము, ముక్తువగుచు.

తే॥ సరవినీశాన విష్ణు కం, జజ గుహోఽశు
శుక్షణిత్రయ ఖగవిధు, శూర్పకర్ణ
క్రౌంచ దేవేంద్ర కలశజ, కశ్యపాంఘ్రు
లెపుడు మ్రొక్కుదు పితృముక్తి, హేతువనుచు॥

తే॥ షట్స్థలజ్ఞాన సంపత్తి, సమ్ముఖుండు
కారణాత్యాగ మజ్ఞాన, గమ్యతనుడు
వేదవిహిత సదాచార, చోదకుండు
పశుపతియె పాశకృంతన, పాలకుండు.

తే॥ త్రిగుణరూపిణి ప్రకృతితో, తిరుగువాడు
ప్రకృతి తన చెప్పుచేతల, బరపువాడు
మూడు మూర్తుల కావలి, మూలమూర్తి
కాలమూర్తి జ్వాలన్మహో, కాలమూర్తి.

తే॥ ముజ్జగంబుల సృష్టించి, మురియువాడు
ముజ్జగంబుల పోషించు, మోజువాడు
ముజ్జగంబుల మలిపెడి, మోటువాడు
కుక్షి జగములు గలుగుపా, లాత్ముడతడు.

తే॥ వెలసియును వ్యాపకుండయి, విశ్వమందు
క్షేత్రముల తీర్థముల భక్త, గాత్రములను
వ్యంజకుండగు శర్వుండు, రంజకముగ
ఇహమునకు సామ్యవాదంబు, లెరుగరామి.

తే॥ జ్ఞానమున హెచ్చుతగ్గులు, న్యూనమగుట
ఐహికమె సామ్యవాదులటంచు దెలుప
పంచభూతాత్మకపు సృష్టి, బరగజేసి
యిరుతెగలవారికిని శివుం, డిష్టుడయ్యె.

తే॥ ఉపనిషత్తుల చెలమల, నూటలూరి
బ్రహ్మసూత్రంపు జాలుల, బలుపుమిగిలి
కృష్ణగీతావియద్గంగ, శ్రేణిగోర
శాంభవశిరో వృతోదధి, సంగమించు.

తే॥ నీల మేఘంబు జూచితా, నెమ్మియాడు
పుష్పరసమాని పాడును, పుష్పవిహము
పాము నాగస్వరంబున, పడగనెత్తు
పశుపతినిజూచి తవియును, భక్తిపరుడు

తే॥ కదనభూమికి జనియెడి, ఖడ్గధారి
శివ సమర్చన కేగెడు శిష్టజనుడు
బలముగల యరివర్గము, బట్టిచెనకి
ప్రభుని జయము గీర్తింతురు, ప్రౌఢభణితి.

తే॥ శిలను ప్రతిమగ శాణాన, శిల్పినిల్పు
చిత్తరువు కుంచెతో నిల్పు, చిత్రకృత్తు
కవి కలంబున రసమయ, కవితనిల్పు
శైవు డష్ట విధార్చన, శంభునిల్పు.

---

# వ్యాసమహర్షి

## పీఠాధిపతి

పూర్వకాలమున వ్యాసమహర్షి యొక దినమున కాశీనగరమున విశ్వనాథుని గుడికేగి చేతులురెండు పైకెత్తి "నదైవంకేశవాత్పరం" అని పరదుర్బోధచే పలికెనట. నందీశ్వరు డాతనికి బాహుస్తంభనమగుగాక"యని శపించెను.

విష్ణుమూర్తి వ్యాసమహర్షికి ప్రత్యక్షమై మునీంద్రా! నీవు నా రూపమే. నాకువైకుంఠపదవి లక్ష్మియైశ్వర్యము సర్వము శివానుగ్రహమున సంప్రాప్తించినది. నీవు కూడ శివుని పూజింపుమన్న అంతట శివధ్యానమొనర్చ ఆతడు శాపవిమోచన మనుగ్రహించెను. వ్యాసుడు తనపేరుతో వ్యాసేశ్వర లింగము స్థాపించెను. తదాది శివభక్తులలో నగ్రేసరు డయ్యెనని కాశీఖండములో 95 వ అధ్యాయమున నీక్రింది శ్లోకము లుదహరింపబడినవి.

శ్లో॥ ఏకఏవహివిశ్వేశో ద్వితీయోనాస్తి కంచన ॥49॥ తత్ప్రసాదా ద్ధరించక్రీలక్ష్మీశ స్తత్ప్ర భావతః॥ త్రైలోక్యరక్షాసామర్థ్యం దత్తం తేనైవశంభునా॥ – 50॥

తస్యభక్త్యాపరమైశ్వర్యం మయాలబ్ధం వరాత్తతః ఇదానీంస్తుహి మేశం భుం యద మేశుభమిచ్ఛసి ॥ అని విష్ణుమూర్తి పలికెను. (51)

పారాశర్యస్తదారభ్య శంభు భక్తి పరోభవత్
లింగం వ్యాసేశ్వరం స్థాప్య ఘంటా కర్ణహ్రదాగ్రతః (68)

విభూతి భూషణో నిత్యం నిత్యం రుద్రాక్ష భూషణః.
రుద్రసూక్తపరో నిత్యం నిత్యం లింగార్చకోఽభవత్ ॥ (69)

కాశీనగరే స్వభుజ స్తంభన సమయే
— వ్యాసమహర్షి ప్రణీత శివస్తుతిః -

శ్లో॥ ఏకోరుద్రోన ద్వితీయాయతస్థే
తద్బ్రహ్మైకం నేహనానాస్తికించిత్ ॥
యద్యప్యన్యః కోపివా కుత్రచిద్వా
వ్యాచష్టాంతద్యశ్య శక్తిర్మదగ్రే॥

శ్లో॥ యఃకిం రాద్ధే ర్మందరా ఘాతజాతో
జ్వాలామాలః కాలకూటోతిభీమః ।
తంసోఢుంవాకో పరోఽభూన్మహేశా
ద్యజ్వాలాభిః కృష్ణతామాప విష్ణుః ॥

శ్లో॥ యద్బాణో భూచ్ఛ్రీపతిర్యస్యయంతా
లోకేశోయత్స్యందనం భూస్సమస్తా
వాహావేదాయస్యవై దృష్టిపాతా
దగ్ధాగ్రామాస్త్రైపు రాస్తత్సమః కః॥

శ్లో॥ యఃకందర్పో్బీక్ష్య మాణస్సమానం
దేవైరన్యైర్భస్మజాత స్స్వయంహి।
పాపైర్బాహ్యై స్సర్వవిశ్వైకజేతా
కోవాస్తుత్యః కామజేతు స్తతోన్యః॥

---

# శ్రీ శైవ మహాపీఠ కార్యాలయ ప్రకటనలు

(కం. వ. భైరవమూర్తిగారు, బి. ఏ. కార్యదర్శి)

ది 9–5–57 తేదీ గురువారం సాయంత్రం 4 గంటలకు శ్రీ శైవ మహాపీఠభవనములో పాలక సమితి సమావేశము జరిగినది. ఈ దిగువ సభ్యులు హాజరైరి.

1. కందుకూరి వటుకభైరవమూర్తి, 2. ఇనటూరి వీరభద్రావు, 3. తాడికొండ కామేశ్వరరావుగార్లు

ప్రత్యేకాహ్వానముపై తాడికొండ సుబ్బారావుగారు, ఇపటూరి కోటేశ్వరరావుగారుకూడా హాజరైరి.

ఈ దిగువ తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదించబడినవి.

1. కోటిబిల్వార్చన సంఘమువారు సమర్పించిన రోజు బుక్కు, ఆవర్జా, రశీదు పుస్తకములు, ఓచర్లు, తీర్మానముల పుస్తకములు వగైరా రికార్డు పరిశీలించడమైనది. పీఠద్రవ్యమునుండి అవసరము వెంబడి ధఫాలు వారీగాచేయబడిన అడ్వాన్సు మొత్తం రు. 176–12–0 లున్ను, విరాళముల రూపేణావచ్చిన మొత్తము రు. 1541–14–0 లు, జుమలా రు. 1718–10–0 లకు, బాలన్సుషీటు దాఖలాఖర్చుల మొత్తము రు. 1718–10–0 లను ఆమోదించడ

మైనది. ఇంతటితో బిల్వార్చనకు సంబంధించిన కార్యక్రమమంతయు సమాప్తమైనందున సదరు సంఘ సభ్యులు చూపిన అభిమానమునకును, ఉత్సాహమునకును, ప్రోత్సాహ సహాయములకును, వారిని మిక్కిలి ప్రశంసించుచూ సదరు సంఘమును ఇంతటితో రద్దు పర్చడమైనది.

2. దుర్ముఖినామ సంవత్సరము తాలూకు, మాజీకార్యదర్శి శ్రీ శివలెంక బసవయ్యశాస్త్రిగారు చేసిన జమాఖర్చులనున్ను దర్శిలా ఈ రోజు హేవిళంబినామ సం॥ర వైశాఖ శుద్ధ దశమి (9–5–57) వరకు ఆదాయవ్యయములను ఆమోదించడమైనది.

3. రాబోవు పీఠవర్ధంతిని వరంగల్‌లో జరుపవలసినదిగా అర్థించుచూ వరంగల్ వాస్తవ్యులైన బ్ర॥ లో॥ శివపురపు వీరభద్రయ్య అయ్యవార్లుగారు పంపిన ఆహ్వాన పత్రమును చదవడమైనది. వారి ఆహ్వానములో తెలియపర్చిన ప్రకారము 1957 జూన్ 14, 15, 16 తేదీలు అనగా హేవిళంబినామ సం॥ర జ్యేష్ఠ బహుళ విదియ శుక్రవారం ప్రభృతి 3 దినములు వరంగల్‌లో పీఠవర్ధంతి జరుపుటకున్ను, ఆ సందర్భములోనే పీఠమహాజన సభాసమావేశము కూడ జరుపుటకున్ను తీర్మానించడమైనది.

4. రాబోవు కృష్ణాపుష్కర సందర్భములో ప్రధాన క్షేత్రమగు విజయవాడకు రాబోవు శైవమహాజనులకు తగు వసతి పీఠభవనములో కల్పించుట ఉచితము గావున తద్విషయములో చేయవలసిన ఏర్పాట్లను గురించియు, వసతి నిర్మాణములను గురించియు, నిర్ణయించి కార్యక్రమము జరుపుటకున్ను, అట్లు వచ్చు భక్త, మాహేశ్వరులవద్దనుండి తగిన సుంకములను వసూలు పర్చుటకున్ను దిగువ కమిటీని ఏర్పరచడమైనది. వసతి నిర్మాణమునకవసరమగు ప్రాథమిక వ్యయముక్రింద రు. 100/– లకు మించకుండా పీఠద్రవ్యమునుండి ఇచ్చుటకు పీఠకార్యదర్శిగారి కధికారమివ్వడమైనది. ఇందు విషయమై ఈ దిగువ వారిని పుష్కరకమిటీగా నిర్ణయించడమైనది.

1. బ్ర॥ లో॥ ఇవటూరి కోటేశ్వరరావుగారు. అధ్యక్షులు.
2. ఇవటూరి వీరభద్రరావుగారు } జాయింటు
3. తాడికొండ సుబ్బారావుగారు } కార్యదర్శులు
4. తాడికొండ కామేశ్వరరావుగారు
5. కందుకూరి వటుక భైరవమూర్తి పంతులుగారు (పీఠకార్యదర్శి)

పై విధముగా తమకువచ్చు జమల మొత్తమునుండి అవుసరమగు ఖర్చులు నిర్ణయించి ద్రవ్యమును ఖర్చుపెట్టి కార్యక్రమము తృప్తిగా జరిపించి సరియైన లెక్కలతో నివేదికను సమర్పించుటకు పై పుష్కర కమిటీవారి కధికార మివ్వడమైనది.

కం. వ. భైరవమూర్తి,
అధ్యక్షులు.

---

# శైవమహాజన సభ ఆహ్వానము

స్వస్తిశ్రీ చాంద్రమాన హేవిళంబి నామ సం॥ర జ్యేష్ఠ బహుళ విదియ శుక్రవారం ప్రభృతి 3 రోజులు అనగా 14–6–1957 నుండి 16–6–57 వరకు శైవమహాపీఠ 48 వ వర్ధంతి వరంగల్ లో జరుగు సందర్భములో ది. 16–6–1957 తేదీని శైవమహాజనసభా సమావేశము జరుగును. కావున పీఠసభ్యులెల్లరు తప్పక దయచేసి సమావేశ కార్యక్రమమందు పాల్గొని జయప్రద మొనర్చ ప్రార్థన.

ఎ జెం డా

1. దుర్ముఖి చైత్రశుద్ధ పాడ్యమీ అనగా 12–4–56 నుండి 9–5–57 వరకు జరిగిన ఆదాయవ్యయములను, కార్యదర్శి రిపోర్టును, ఆమోదించుట.
2. పీఠ నిబంధనల సవరణ.
3. మతప్రచారమును గూర్చి పీఠాభివృద్ధిని గూర్చి అవుసరమగు కార్యక్రమమును నిర్ణయించుట.
4. ఇతర విషయములు.

కందుకూరి వటుక భైరవమూర్తి, B. A.
కార్యదర్శి

# శ్రీ శైవమహాపీఠము (రిజిష్టర్డు) విజయవాడ

కందుకూరివటుక భైరవమూర్తి, అడ్వొకేటు కార్యదర్శి

శ్రీ దుర్ముఖినామ సం॥ర చైత్ర శుద్ధ పాడ్యమి లగాయితు హేవిళంబినామ సం॥ర వైశాఖ శుద్ధ దశమి 12-4-1956 నుండి 19-4-57 వరకు ఆదాయ వ్యయములకాతా.

## ఆ దా య ము

| | రు. అ. పై. |
|---|---|
| సభత్వము చందాలవల్ల | 36- 0-0 |
| విరాళములవల్ల | 32- 0-0 |
| ఆంధ్రాబ్యాంకు వడ్డీవల్ల | 38-11-0 |
| ఆదాయమునకు మించినవ్యయము | 307-11-0 |
| | 414- 6-0 |

## వ్య య ము

| | రు. అ. పై. |
|---|---|
| స్టేషనరీ | 2- 0-0 |
| పోస్టేజి | 10-13-0 |
| ప్రయాణపుఖర్చులు | 5- 0-0 |
| మిసిలేనియస్ ఖర్చులు | 13- 9-6 |
| భవన మరమ్మతులు | 103- 2-6 |
| ఎలెక్ట్రిక్ కరెంటు ఖర్చులు | 57- 1-6 |
| నీటిపంపు మరమ్మతులు | 21- 7-0 |
| భవనము పన్నులు | 9- 8-6 |
| ఆడిటు ఖర్చులు | 15- 0-0 |
| | 237-10-0 |

B. F. 237-10-0

## కోటి బిల్వార్చన ఖర్చులు

| | |
|---|---|
| ప్రయాణపు ఖర్చులు | 162- 5-6 |
| ప్రింటింగ్ అండ్ స్టేషనరీ | 28- 5-0 |
| మిసిలేనియస్ ఖర్చులు | 33- 0-0 |
| పోస్టేజి | 27- 0-9 |
| అన్నదానబుట్టలు | 4-11-6 |
| చిల్లర వెచ్చములు | 572-10-6 |
| కూరగాయలు | 98- 7-3 |
| వంటవాళ్లకు | 10- 0-0 |
| వంట చెరుకు | 75-11-0 |
| ఋత్విక్కులకు | 83- 0-6 |
| పందిరి, అలంకరణకు | 167-12-3 |
| ఎలెక్ట్రిక్ | 28- 8-6 |
| బిల్వము | 242- 8-3 |
| ఫోటోలు | 42- 4-0 |
| పాలు, పెరుగు | 97- 7-0 |
| పూజా ద్రవ్యములు | 24-14-6 |
| లింగధారణలు | 19-15-6 |
| | 1718-10-0 |

| | | |
|---|---|---|
| విరాళముల వల్ల వసూలు | | |
| తగ్గింపు | 1541-14-0 | 176-12-0 |
| | నెరశి | 414- 6-0 |

*Verified and found correct :*

(Sd.) N. Umamaheswara Rao.
AUDITOR : 10—5—57.

( *True copy* )

# శ్రీ శైవ మహాపీఠము (రిజిష్టర్డు)

శ్రీ హేవిళంబినామ సం॥ర వైశాఖశుద్ధ ౧౦ అనగా 9-5-57 తేదీగల

## ఆస్థి, అప్పుల పట్టిక

### అప్పులు అండ్ ఫండ్

ఫండ్ ఖాతా

| | |
|---|---|
| గతసంవత్సరం నిల్వ | రు. 11,892- 2-6 |
| ఈ సంవత్సరము ఆదాయమునకుమించిన ఖర్చు తగ్గింపు | 307-11-0 |
| వెరశి | రు. 11,584-7-6 |

ఆస్తులు

| | |
|---|---|
| ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారివల్ల రావలసినది | రు. 3- 0-0 |
| కొంపల్లి హనుమంతరావుగారివల్ల రావలసినది | 2- 0-0 |
| భవనము | 9000-10-9 |
| ఫర్నిచరు | 14- 8-0 |
| ఆంధ్రాబ్యాంకు విజయవాడలో నిల్వ | 2564- 2-9 |
| | 0- 2-0 |
| నిల్వారొఖ్ఖం | 11,584- 7-6 |

### ఆడిటు సర్టిఫికెట్టు

శ్రీశైవ మహాపీఠముయొక్క 12-4-1956 నుండి 9-5-57 తేదీవరకుగల ఆదాయవ్యయములను, ఆస్తి అప్పులను, వోచర్లతోను, రశీదులతోను, పరిశీలించితిని. లెఖ్ఖలు సక్రమమైన వోచర్లతో సరియైన పద్ధతులయందు వ్రాయబడినవి. ఇందు వ్రాయబడిన ఆస్తి అప్పులపట్టిక పీఠముయొక్క నిజస్థితిని తెలియజేయుచున్నది.

(Sd) N. Umamaheswararao,
Auditor 10-5-57.

( *True copy* )

# శైవగ్రంథమాల

| | | |
|---|---|---|
| 1. సంధ్యావందనము | ... | 0—8—0 |
| 2. ఆంజనేయ స్వరూపనిరూపణము | ... | 0—8—0 |
| 3. భగవద్గీత | ... | 6—0—0 |
| 4. శైవాహ్నికము | ... | 1—0—0 |

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు ఉత్తరము వ్రాయవలెను.

# శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అడ్రస్ :— 1

## ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వరంగల్

అడ్రస్:— 2

## ముదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) దుగ్గిరాల

[ గుంటూరు జిల్లా ]

సూచన :— వ్యాసములు - ఉత్తరములు - శ్లోకులు - చందాధనము ఈ పై అడ్రస్సులలో నొకదానికి పంపించవలెను.

ది ఓరియంట్ పవర్ ప్రెస్, తెనాలి.

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమునఁ బ్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక


| సంపుటము | హేవళంబి సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౮ | 15—6—1957 | ౨ |



సంపాదకులు :

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.

*Principal o . . & Superintendent of*

*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు :

ముదిగొండ రామలింగశాస్త్రి

భాషాప్రవీణ.


శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థతతిప్రభాసికా
సందేహసందోహమహానిరాసికా ।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా
జయత్యియం శైవమతప్రకాశికా ॥


శ్రీ శైవ మ హా పీ ఠ ము

సాంబమూర్తిరోడ్డు, హనుమాన్ పేట

విజయవాడ-2

# వి ష య సూ చి క

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమున ప్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక

సంపుటము ౮ | హేవిళంబినామ సంవత్సరము 15—6—1957 | సంచిక ౩

## సంపాదకీయము

మత మనగా నేమి? వేదశాస్త్రములను నాధారముగఁ దీసికొని శిష్యులగువారు నిర్ణయించిన యే పద్ధతి గలదో దాని నాధారముగఁ గ్రహించి యాచరించుటయే మత మనిపించుకొనును. ప్రత్యేక వ్యక్తియొక్క యభిప్రాయము మత మనిపించుకొనఁ జాలదు.

శైవమత మన నేమి? శివుఁడు ప్రధానదేవతగా నిర్ణయింపఁబడి పూజింపఁబడుట.

శైవమతాధిక్యత యెందువలన? మిగతా మతము లన్నియు వేదశాస్త్రముల నాధారముగఁ జేసికొని నిర్మింపఁబడినను – అవి యన్నియు నేదోయొక వేదము ననుసరించియో – యేదో యొక శాస్త్రము నాధారముగఁ జేసికొనియో యేర్పాటయిన మతములు. శైవమన్ననో సర్వవేద – సర్వశాస్త్ర సమన్వయముతో సిద్ధాంతీకరించఁబడిన మతము. ఈ విషయమంతయు సిద్ధాంత శిఖామణియందు వివరింపఁబడి యున్నది.

శివుని బూజింపవచ్చునా? శివలింగారాధన చేయవచ్చునా? అను ప్రశ్నలేల? కాశీలో నున్నది లింగమే - రామేశ్వరములో నున్నదీ లింగమే. కాశీ రామేశ్వర యాత్రలుచేయు ప్రతివారును - ఉత్తరాదినుండి దక్షిణాంతము వఱకును గల శివలింగముల నెన్నిటినిం బూజించుటలేదు? శివారాధన దోషమైనగాని - నిష్ప్రయోజనమైనం గాని యీ లింగముల నేల బూజించుదురు? అట్లొనర్చుట చేతనే శివలింగారాధన సర్వోత్కృష్టమైనదని తేట తెల్లమగుచున్నది.

శివలింగముల ధరింపనచ్చునా? అని ప్రశ్నించుదురు కొందఱు. అపవిత్రమైన దేహమున పవిత్రమైన లింగమును సర్వదాధరింప కూడదని వారి యాశయమా? ఇది యెంత సమంజసముగ నున్నదో యోజింపుడు. పూజింపదగిన వస్తువును ధరించి పూజించుట దోషం బగునా? మంత్రపూతముచే, పవిత్రమగు దేహమున, పవిత్రమగు లింగమును ధరించుట యోగ్యముకాదా? ఒకప్పు డపవిత్రమగు దేహమును మాత్రము పవిత్రమగు లింగము పావనము చేయంజాల కుండునా? ఏల యీ సందేహము? గ్రహబాధల నిమిత్తమై ఆంజ నేయాది యంత్రబిళ్లలే దేహమును పరిశుద్ధత గల్గించుచుండ సర్వ దేవతాధిపతియగు నమ్మహాదేవుండు సర్వవాంఛల సమకూర్పజాలండా?

మన భారతదేశమందు కాశ్మీరు మొదలుకొని కన్యాకుమారీ వఱకు శివారాధనచేయు శైవులు కోట్లకొలది గలరు. అంతా శైవ మయం అను వ్యాసమును జదివిన వారల కీ విషయం సుస్పష్టమే. కలకత్తా పట్టణములో బయలు వెడలు సుప్రసిద్ధ పత్రికలలో నొకటగు వంగవాసి యను హిందీ వారపత్రిక యందు 3 కోట్ల వీరశైవులు 22 కోట్ల శైవులు నీ దేశమందుం గలరని ప్రకటించిరి.

పూర్వము వర్ణాశ్రమాచార యుక్తంబగు శైవమునుద్వాదశా రాధ్యులుద్ధరించిరి. బసవేశ్వరుండు వర్ణాశ్రమాచారములు శివభక్తి

ప్రచారమునకు బాధాకరముగ నున్నట్లు తలంచి – వేదోక్తకర్మలను త్యజించి శివభక్తి నుద్ధరించెను. అన్ని వర్ణముల వారి కాశ్రయమిచ్చి యందఱికి లింగధారణ సామ్యము గలుగఁజేసి శివభక్తి బీజములవారి మనంబులనాటి గొప్ప మహిమాన్వితులుగ నొనర్చెను.

అదే సమయమున మల్లికార్జున పండితారాధ్యులు వేదోక్త కర్మల నావశ్యకత గన్పఱచి వర్ణాశ్రమాచార సహితము శైవమును సనాతనాచార పద్ధతులలో బ్రచారముచేసి లోకవిఖ్యాతి చెందెను.

భిన్నాభిప్రాయములతో నొకే సమయమున శైవమతము నుద్ధరింపఁ బ్రచారము సాగించిన బసవేశ్వర – మల్లికార్జున పండితులను జనులు లోకోద్ధరణార్థమై జన్మించిన మహాపురుషులుగ నానాడు తలంచిరి. వారిలో వారున్ను నొకరిపై నొకరు భక్తి భావములనే వెల్లడించుకొనిరిగాని యొకరినొకరు విమర్శించుకొని యుండలేదు.

శివారాధన చేయుటే ప్రధానముగాని – భిన్నమార్గావలంబకు లైన నేమి ? నదులెన్ని వంకలు తిర్గినను గమ్యస్థానము సముద్రమే గదా !

పాల్కురికి సోమ నారాధ్యులు బసవపురాణము రచించి బసవేశ్వరుని యందుఁ దన భక్తిభావమును గన్పఱచెను. మల్లికార్జున పండితారాధ్య చరిత్ర రచించి తన వర్ణాశ్రమ పద్ధతుల యందలి యాసక్తిని వెల్లడించెను.

పూర్వము ద్వాదశారాధ్యులు శైవమత ప్రవక్తలై యుండిరి. అందు రేవణారాధ్యులు – మరుళారాధ్యులు – ఏకోరామారాధ్యులు – పండితారాధ్యులు – విశ్వారాధ్యులు ననువారిని జంగములు గ్రహించి పంచాచార్యులుగ స్వీకరించి వారి పేర్లతో మఠముల స్థాపించి మత ప్రచారము చేసికొనుచున్నారు. ఈ పంచాచార్యులు యీద్వాదశా

చార్యులకుఁ జెందినవారు గాక వేరుగా నున్నారని వారు చెప్పుచో వచ్చిన లోటేమియు గన్పింపదు. శైవమత ప్రచారకులు పలువురుండుట శైవమతమునకు ఘనతయే గదా!

పూర్వము రాజాధి రాజులు భక్తితత్పరులై శివలింగముల ధరించి శైవమతమును విజృంభింపఁ జేసిరి. ఉద్భటారాధ్యులవద్ద భోజుఁడు లింగధారణ దీక్ష గ్రహించెను. గణపతి దేవుఁడు విశ్వేశ్వర శివదేశికుని వలన లింగధారణ దీక్షను, అనంతభూపాలుని గురువు శ్రీపతి పండితుఁడు. మైసూరురాజు-లింగధారియే చాతుర్వర్ణ్యము నందును లింగధారణ నేటికిని గన్పించుచున్నది. ప్రచారములోనున్న మతము ప్రకాశించును. కాన సంఘము తమతమ మతముల యందలి గుణవిశేషముల గ్రహించి యాచరించి ధన్యులగుదురుగాత!

*

## ఇష్టలింగస్తవము

శ్లో. సురాసురేంద్ర మౌళిజాల కీలితాంఘ్రి వారిజం
కరాళఫాలలోచనం కపాలమాలికాధరం
త్రిశూల కృంతమత్త హస్తిదైత్య కృత్తి వాసనం
నమామి పాణి పంకజస్థ మిష్టలింగ మీశ్వరం॥ 1

శ్లో. భుజంగరాజ కంకణాంక మంగజాంగ మర్దనం
కురంగపాణి మక్షయాంగ ముక్షరాజకేతనం
జలంధరాంధ కాంధకార భాస్కరం భయాపహం
నమామి పాణిపంకజస్థ మిష్టలింగమీశ్వరం॥ 2

శ్లో॥ సమస్తశస్త దేవతా వన ప్రభావ భాసురం
సుమేరుచాపజాప మాపగాపయోంక మస్తకం

కృపాంబురాశి మంబికాంబ కాంబుజ ప్రియంకరం
నమామి వాణిపంకజస్థ మిష్టలింగమీశ్వరం। 3

శ్లో॥ ప్రచండతాండవప్రచాలితాబ్జజాండ మండలం
మృకండుజాత దండనోగ్ర విగ్రహాంతకాంతకం
సురేంద్రపుత్ర పత్రిపం పవిత్రగోత్ర మన్వయం
నమామి వాణిపంక జస్థమిష్ట లింగమీశ్వరం। 4

శ్లో॥ విపక్షదక్షపావ పావక ప్రభోగ్రమార్గణం
పినాక చాపధారణం మహారుణా విదారణం
మృగాళిచారు చర్మ భృత్కటీ తటం మహానటం
నమామి వాణి పంకజస్థ మిష్టలింగ మీశ్వరం। 5

శ్లో॥ హిరణ్యగర్భ పద్మనాభ పాకశాస నార్చితం
క్వణత్ఫణీంద్ర నూపురాంఘ్రికంజ మంజులం మృడం
గణాదినాథ యూథసేవ్య దివ్యమిష్టదం స్థిరం
నమామి పాణి పంకజస్థ మిష్టలింగ మీశ్వరం॥ 6

శ్లో॥ ముకుందవాగ్వ రామరేంద్ర సద్వర ప్రదప్రభుం
త్రయీశిరస్త వస్తుతం శివం భవం భయాపహం
శరణ్యమిందు కందళాంక మస్తకం పురాంతకం
నమామి పాణిపంకజస్థ మిష్ట లింగమీశ్వరం॥ 7

శ్లో॥ ముఖాగతాది తేయదర్ప సర్పతార్క్ష్య మక్షయం
సుధా మయూఖ భాస్కరాగ్ని భాను రేక్షణత్రయం
తమాల నీలకంధరం ధరాధరేంద్ర మందిరం
నమామి పాణిపంకజస్థమిష్ట లింగమీశ్వరం॥ 8

శ్లో॥ పటీరహీరతార శారదాభ్ర శుభ్రశోచిషం
కుమారమారి తారిశీర్ష మాల్య సజ్జటాధరం
క్షమాజలా నలానిలాభ్ర కాబ్జ యజ్వవిగ్రహం
నమామి పాణిపంకజస్థమిష్ట లింగమీశ్వరం॥ 9

---

వ్యాసమహర్షి ప్రణీత

# శివస్తుతిః

(గతసంచిక తరువాయి)

శ్లో॥ యంవై వేదో వేదనో నైవవిష్ణుః
నోవావేధా నోమనో నైవవాణీ
తందేవేశం మాదృశః కోల్పమేధా
యాథాత్మ్యాద్వై వేత్యహో విశ్వనాథం॥ 5

శ్లో॥ యస్మిన్సర్వం యస్తుసర్వత్ర సర్వో
యోవైకర్తా యోవితా యోపహర్తా
నోయస్యాది ర్యస్సమస్తైది రేకో
నోయస్యాంతో యోఽంతకృత్తం నతోస్మి॥ 6

శ్లో॥ యస్యైకాఖ్యా వాజిమేధేనతుల్యా
యస్యానత్యా చైకయాచ్చేంద్ర లక్ష్మీః
యస్యస్తుత్యా లభ్యతే సత్యలోకో
తస్యార్చాతో మోక్షలక్ష్మీ రదూరా. 7

శ్లో॥ నాన్యందేవం వేద్మ్యహం శ్రీమహేశా
న్నాన్యం దేవం స్తౌమి శంభోఋతేహం

నాన్యం దేవంతానమామి త్రినేత్రాత్
సత్యం సత్యం సత్యమేతన్మృషాన॥ 8



# పారమార్థిక సూత్రావళి

పండిత మదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు

1. సర్వోహ్యేష రుద్రస్తస్మై రుద్రాయనమో అస్తు
2. ససన్నచా సచ్చివ ఏవ కేవలః
3. విశ్వాధికో రుద్రోమహర్షిః
4. చతుర్థం మన్యంతే శివ మద్వైతం
5. సవర్ణోరుద్రస్స భగవాన్ సమహేశ్వర స్సమహాదేవః
6. శివస్సాలీమహేశ్వరః
7. ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగళం ఊర్ధ్వకేతం విరూపాక్షం విశ్వరూపాయమైనమః
8. లింగం బ్రహ్మైవ కేవలం
9. లింగరూపోంబికా పతిః
10. శివశక్తి మయంలింగం
11. శివశక్తి రితిహ్యేకం తత్త్వమాహుః
12. లీయతే గమ్యతేయత్ర యేన సర్వంచరాచరం తల్లింగం
13. జగజ్జన్మాద్యస్యయతః
14. పీఠశ్శక్తిః శివోనాదః
15. పరాపరాబిందు నాదాచ
16. తస్యవాచకః ప్రణవః
17. విశ్వరూపో విరూపశ్చ
18. ద్వేబ్రహ్మణి రూపేవేదితవ్యేపరం చాపరంచేతి

19. నతస్యకార్యం కరణంభవిద్యతే
20. స్థూలసూక్ష్మ చిదచిచ్ఛక్తి విశిష్టనిమిత్తోపాదా నాభోయ కార్య కారణ సమస్త మంగళాధార భూతానంతకళ్యాణ గుణభూయిష్ట స్వేచ్ఛాకృగృహీతో మహా సహోయాదికా ప్రాకృతరూప భూషితః పశుపతిః
21. ఆశ్రిత పూజాధ్యాన యోగవినియోగ వ్యక్త వ్యక్తావ్యక్తావ్యక్త మహేశ్వర సదాశివ శివనామవైభవః పంచకృత్య పరాయణో విభుర్నిత్యః
22. జ్ఞానానందాది శక్తిమహిమాతిశయః
23. అనన్యదేవసాదృశ్య సర్వజ్ఞ సర్వకారణ సర్వేశ్వర షడధ్వవ్యాపక సర్వతత్త్వాలయ తత్త్వాతీతశ్చ
24. శక్తిస్స్వాభాన్మహాదేవి మహాదేవస్సశక్తిమాణ
25. శివేననవినాశక్తిః నశక్త్యాచవినాశివః
26. విగ్రహం దేవదేవస్యజగమే తచ్చరాచరం
27. పాశముక్తః
28. మాయాంతు ప్రకృతిం వింద్యాత్ మాయినంతు మహేశ్వరం
29. పరాస్యశక్తి ద్వివిధైవశ్రూయతే స్వాభావికే జ్ఞానబలక్రియాచ
30. శివేబ్రహ్మణ్యా పృధగ్విశేష రూపాశక్తిః పరాపరేణ రూపేణ శివాజ్ఞయా సకలంకరోతి (అపరామాయా)
31. శివశ్శక్తిసంకోచే నిర్గుణనిరంశశ్చవికాసే అనంతలీలా విభూషితశ్చ
32. ఈశత ఈశినేభిః పరమశక్తిభిః
33. ఏకాసామాహేశ్వరీశక్తిః ప్రకృతిమయీ విశ్వవికృతిమయీ నాద బిందుమయీ పరమేశ్వర గుణరూపపరా అపరాచ ప్రసవధర్మిణీ
34. సఈక్షత అహంబహుస్స్యాం ప్రజాయేయః
35. యధోర్ణనాభి సృజతే గృహ్యతేచ
36. శివస్సత్యం జగత్సత్యం జీవస్సత్యం మితిస్ఫుటం

37. ఆణవమాయిక కార్మికాఖ్యాః పాశాః
38. మాయాభేదేన శక్తిరేవపాశః
39. జీవో పాశబద్ధః
40. అనాద్యజ్ఞానకర్మ ఫలానుభవానేక జన్మసహిష్ణుత్వం జీవలక్షణం
41. దేహాన్యోనశ్వరోవ్యాపీ అణుజ్ఞానాత్మకోభిన్నో కర్తాభోక్తాశ్చ పశువాచ్యః
42. హృదయకుహరే శివేనసంయుక్తః
43. అపక్వకలుష పక్వకలుష భేదేన కేవల ప్రళయాకల సకల సంజ్ఞికాః జీవాః
44. ప్రారబ్ధం భోగతో నశ్యేత్
45. తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్
46. పునరావృత్తి రహిత శాశ్వత శివసారూప్య సాయుజ్యం ముక్తిః
47. శివజ్ఞానం ఉపాయం
48. తం ఈశం జ్ఞాత్వా అమృతా భవంతి
49. కర్మఫలార్జితో పాసనారూప జ్ఞానభక్తి ర్ముక్తిసాధనం
50. శివదీక్షేదం వ్రతం ధార్యం యావదాయుషం
51. వేదాగమను క్రియాత్మిక శైవ (మహాపాశుపతతన్నామక) దీక్షాయాం శివవ్రతం (శాంభవదీక్షా) శివభక్తిః (ఆవరణాచారాది ధర్మనిష్ఠా) శివార్చా (ఇష్టలింగపూజా) శైవీధ్యానం (ప్రాణలింగోపాసనా) శివజ్ఞాన (భావలింగోపాసనాసిద్ధ సర్వంశివనిశ్చయ పూర్వక శివోహం. భావనాపతే భూమికాః నిరతిశయసుఖదా శ్శివానుగ్రహమూలాః)
52. శివోహమితి భావనాప్రవాహేణ శిథిలితపాశతయా అవగతపశు భావ ఉపాసక శ్శివ ఏవభవతి
53. ముముక్షుర్న పునర్భవాయ సమాచరేత్ పాశుపతం వ్రతం
54. వర్ణాశ్రమాచార ప్రాప్త ధర్మం కర్మ సంజ్ఞాకం

55. వేదాంత ప్రతిపాదితోపాసనాజ్ఞానం శివజ్ఞానం
56. స్థూలసూక్ష్మకారణేషు శరీరేషు ఇష్టప్రాణ భావలింగధారణం దీక్షా కీలకం
57. అష్టావరణ పంచాచార వర్ణాశ్రమాది ధర్మబద్ధ కర్మజ్ఞాన సముచ్చయరూపా శైవదీక్షా
58. బాహ్యాభ్యంతర పూజాధ్యానభావనా సంపన్నసమృద్ధం ఇష్టప్రాణ భావలింగార్చనం శివభావనాభాసితంచ
59. ప్రతీకం మహాలింగం నిర్వాణపదం
60. సర్వాంగలింగ సామరస్యం పూజాసాహిత్యం
61. ఆచారాది షట్లింగసంబంధం సర్వార్పణానురూప ప్రబంధం
62. అర్చనార్పణ భావనానురూపవిషయ నిష్ఠత్వం ప్రమేయం
63. సర్వశివరూపధ్యానం ప్రాణలింగార్చనం
64. శివోహంభావనా తదేకతయా సంభవిత భావ శూన్యస్థితి విషయికానందలింగానుసంధానైకత్వం భావలింగార్చా
65. పూర్వాంగరూపా నార్పణా విషయప్రాప్త నిశ్చయ వ్యగ్రత్వం త్యాగం
66. నసపునరావర్తత ఇతి శ్రుత్యర్థం ఫలం.

---

# నిర్వాణనిశ్రేణి

( గత సంచిక తరువాయి )

(ముదిగొండ కొండయారాధ్య విరచితము)

ద్విజుఁడే నం త్యజుఁడేని శంభుపదభ, క్తిన్ ధాత్రి వర్తించుచున్
సుజనుండాతని మోక్షలక్ష్మీ హృదయా, త్సుక్యంబుతోఁగోరున
ద్విజయున్ శంకరుఁ డామహాత్మ్యపయికూ, ర్మిన్ గాంతురెవ్వేళ నా
త్మజుబోల్కెన్ ప్రమథాళి మెచ్చికొను మి,త్రత్వంబువాంఛించున్. 97

మందాత్ముల్ తమఁ జూచినష్టులను బ్రహ్మజ్ఞానమంచు న్దివా
నందో బ్రహ్మయటన్న వ్రా చదువుచున్, సంతక్షిత జ్ఞానవహా
నెందేనందుము లింగధారుల సదా స్వేష్టాత్మ లింగార్చనా
నందంబున్ గనియుండఁజాలమిని నెన్నంజన్ శివప్రాజ్ఞులై. 98

అద్వైతంబును ద్వైతమానను విశిష్టాద్వైతమానంచు ద్వై
తాద్వైతంబగుచున్ చతుర్మహిత పంథానంబులన్ స్వేష్టలిం
గాద్వైతానుభవైక భక్తిఁగన శక్యంబౌను నీ రూపు తా
హృద్వీధిన్ పసలెట్టులన్ దెలియువాచిచ్ఛాభి వాదంబులన్. 99

శివలింగంబు ధరించువారు ధరపై జీవించి కాలావధిన్
భవుతోఁ జేరి సమస్త సౌఖ్యకలనన్, సద్భక్తిఁ దేరిచ్ఛన్ పున
ర్భవసాహిత్యముఁ జెంది పుట్టునెడ శీర్షంబందు చంద్రుండు మూ
డవ నేత్రంబును మేనపాములును కంఠంబందు శ్రీయొప్పెడున్. 100

క్రమముగ దారు లోహమణి కల్పిత పీఠములందు నుత్తమో
త్తమములు బాహ్యపూజకు చితంబులు స్వాంతరపూజకున్ హృద
బ్జము తగు పీఠమై వెలయు, ప్రాణము భావము నందుఁగొల్చు హ
స్తమునను నిష్టలింగమును, సంతతమర్చన సల్పు నిష్ఠమై. 101

కరతల మొప్పు భక్తునకు కాయము గానగు సృష్టి జీవుఁడౌ
నిరతము రెంటి మధ్య సరణిన్ వెడమింతయు లేక యొప్పు వి
స్ఫురిత తదిష్టలింగము విశుద్ధమతిన్ సకలార్చలందు నే
ర్పరియగు లింగధారియట, ప్రాణము భావము తృప్తిచేసెడున్. 102

న్యాయము వ్రాయఁజాలిన మహాత్ముఁడు గౌతమమౌనిధారణా
ధ్యాయితచే నెఱుంగనగు, తత్త్వము శంకరుడంచు నెంచి ని
శ్రేయము మాట గూడనువచింపఁడు భౌతికవస్తు విజ్ఞతా
మేయ విభక్త లింగము సమీకరణించిన చిత్తవృత్తితో. 103

నైషపక్షోభవేదితి క,ణాదుఁడు మోక్షపథంబుఁ గూర్చి సం
భాషణచేసి వట్లతని, వ్రాతలలోఁ గనవచ్చు భౌతికా
న్వేషణ తత్పరుండయి ప,విత్రమతిన్ దనువందు సర్పరాట్
భూషణుదాల్చి మోక్షమును, బొందిన చిత్తనిగూఢ భావనా. 104

త్యాగము భోగమున్గని ప,తంజలి సర్వజనైక సాధ్యమౌ
యోగము చిత్తవృత్తినను, వొప్ప నిరోధము సల్పునంచు నే
భాగము వ్రాసె నిష్ఠమును ప్రాణము భావము నన్నలింగముల్
త్యాగము యోగభోగమును, నంగములన్ గనియుంట ధీయుతా. 105

కపిలమహర్షి సాంఖ్య మనఁ,గా నొకశాస్త్రము వ్రాసె దానిలో
నిపుణతలింగధారులై గ,ణింతురు లింగ సమర్చనారతిన్
వ్యపగతశోకులై విహిత, వాంఛిత మోక్షముఁ జెందఁగల్గుటన్
కపిల రహస్యమిట్టిదనఁ,గాఁ దమయాచరణంబుఁ జూపఁగన్. 106

రంసాగ్రేసర శిష్యజైమిని మహా,ప్రాజ్ఞుండునై పూర్వమీ
మాంసాశాస్త్రము వ్రాసె కర్మలయెడన్, మాహాత్మ్యమున్ జూపుచున్
ధ్వాంసంబై నిజ నేత్రదృష్టి శివుఁగో,ల్వన్ వేదపాదస్తుతిన్
సంసారభ్రమఁబాసి మోక్షమును గాం,చన్లేదెస దృష్టితో. 107

పరమంబైన రహస్యమౌననుచు శ్రీ, వ్యాసుండు యత్నించి యు
త్తరమీమాంసను వ్రాసి నాడుగద తొ,ల్తన్ బ్రహ్మజిజ్ఞాసయన్
గురుతుం జూపుచు బ్రహ్మమే శివుని గా,గుర్తింపనౌరీతి త
త్పరతన్ సర్వపురాణగాథలను సి,ద్ధాంతించె వాచాయతిన్. 108

శ్రీ మదివటూరి వంశోద్భవులగు, సానందారాధ్యులవారిచే ప్రణీతమైన
నటరాజ శతకమునుండి గ్రహింపబడిన

# పద్య దశకము

( గతసంచిక తరువాయి )

సీ॥ పవలు, జెలనకను పలుకష్టములకోర్చి
స్పష్టమా బ్రహ్మాండ సృష్టిజేసి
సృష్టజీవులకెల్ల దుష్టిగాబోషింప
ననుకూలభోజనం బమరజేసి
కాలచక్రంబును లీలగానమరించి
పటుజీవకర్మాను భవములొసగి
కర్మానుభవమెల్ల గడచినంతనె జీవ
సంహారకార్యంబు సలిపి, సలిపి

గీ॥ తీరికేలేని విశ్వ సంసారివగుచు
వఱలుచున్నను నొకసారి వచ్చినాకు
దర్శనంబీయుమా, యుమా ధవ, దయాత్మ
మాళిధృతరాజ, నటరాజ, మహిత తేజ.

4

సీ. సచరాచరాత్మక సకల బ్రహ్మాండముల్
కల్పించు తొలిసృష్టి కర్తవీవె
కల్పిత బ్రహ్మాండ ఘనపాలనంబున
ఘనుడైన సంరక్ష కర్తవీవె
రక్షిత బ్రహ్మాండ లయముగావింపంగ
నత్యుగ్రరూపసం హర్తవీవె
హర్తవై విలసిల్లి యవల, దిరోధాన
కనదనుగ్రహకార్య కర్తవీవె

గీ॥ పంచకృత్యపరాయణ బ్రహ్మవీవె
బ్రహ్మలకు మూలమౌ పర బ్రహ్మవీవె
పరమశివ నిన్ను దెలియగా నశమెనాకు
మౌళిధృతరాజ నటరాజ, మహితతేజ. 5

సీ॥ అన్నపూర్ణాదేవి కానందమునుగూర్చి
కాశికాపురి పేరు గాంచినావు
భ్రమరాంబకానంద భరమునుజేకూర్చి
శ్రీశైలమునవాసి జెందినావు
జ్ఞానప్రసూనాంబ కానందమునుగూర్చి
కాళహస్తిని కీర్తి గాంచినావు
శివకామసుందరీ చిత్తంబురంజించి
యల చిదంబరమందు నలరినావు

గీ॥ పల్లెపల్లెల బట్టణ పట్టణముల
శక్తిమంతుడవై భక్త సంఘమునకు
ముక్తిభాగ్యంబునొసగిన మూర్తివీవె
మౌళిధృతరాజ, నటరాజ, మహితతేజ. 6

సీ॥ నీ యాజ్ఞచేగదా! నిత్యసంచారియై
సూర్యుడే భూమిని చుట్టితిరుగు
నీ యాజ్ఞచేగదా! నిత్యసంచారియై
కలువలదొరవెల్గు గగనసీమ
నీ యాజ్ఞచేగదా! నిత్యసంచారియై
వీచు వాయువు జగ ద్వీధులందు
నీ యాజ్ఞచేగదా! నిత్యసంచారియై
యగ్గిదేవుడు విశ్వ మంత వెలుగు

గీ॥ విశ్వనాథుఁడ ! నినుగాంచి వివిధసురలు
భయ వినయ భక్తి భావవు వర్తిలఁగుచు
గ్రాలుచుందురు నిజకార్య కరణములను
మాళి ధృతరాజ, నటరాజ, మహితతేజ. 7

సీ॥ అమలమా ప్రమథాళి యనయంబు వసియించు
రజతాద్రి యే దేవు రమ్యవసతి
నిర్జర నిర్ఝరి నిత్యకల్యాణమా
మేరు వేధీసుని మేటివిల్లు
ఘనయోగి వరతపో ధనుల కాశ్రయమైన
వవిమలయే వేల్పు శ్వశురగృహము
నిజభక్త తతిచేత నిత్యసేవితమైన
శ్రీశైలమే పూజ్య ప్రియ తలంబు

గీ॥ అట్టిదేవుఁడ వీవౌచు ననవరతము
ప్రేతభూములపై నీకు బ్రీతితగునె ?
నిగమసంచార నీకిది తగదు, తగదు
మాళి ధృతరాజ, నటరాజ, మహితతేజ. 8

సీ॥ చానమోమునుజూచి చంద్రబింబభ్రాంతి
పెనుమోహమది చిత్తమున జనింప
వెలది కన్నులజూచి జలజాతవిభ్రాంతి
మదియందు దులివేని మరులువుట్ట
సతినాసికాదండ సౌందర్యవీక్షచే
భావవీధిని రాగ పటలిబెరుగ
మదవతీకరపాద మంజులత్వముజూచి
మతిలోన ననురాగ మతిశయిల్ల

గీ॥ బంతు లట్టులదగునురో భవములలర
మనుజ విజ్ఞానమెల్లను మంటగలుప
మించుబోడిని నెట్లు నిర్మించినావొ
మూాళి ధృతరాజ, నటరాజ, మహితతేజ. 9

సీ॥ విహరించుటకు నీకు వేడుకగలదేని
యందమౌ నందనోద్యానవనము
వేటలాడుటయందు వేడుకగలదేని
కమనీయమై యొప్పు గహనసీమ
వింతనృత్యముసల్ప వేడుకగలదేని
నవసుందరంబైన నాట్యశాల
విశ్రాంతిగొన నీకు వేడుకగలదేని
పరిపూరితమైనట్టి పడకటిల్లు

గీ॥ గాగనొప్పెడు మన్మనః కమలమందు
కామసంచార సత్కృపా కరుడవగుచు
నిత్య కల్యాణమూర్తివై నిల్వుమభవ
మూాళి ధృతరాజ, నటరాజ, మహితతేజ. 10

# తెనాలి రామలింగ కవి

(భాషాప్రవీణ - ముదిగొండ రామలింగశాస్త్రి - ఈమని)

ఈతఁడు శైవుఁడు. లింగధారి బ్రాహ్మణుఁడు. పాలగుమ్మి యేలేశ్వరారాధ్యుల శిష్యుఁడు. తండ్రి రామయ్య - తల్లి లక్ష్మమ్మ. బాల్యముననే గ్రంథరచనా నిపుణుండై 'కుమార భారతి' యను బిరుదము నొందినటుల నుద్భటారాధ్య చరిత్రవలనఁ దెలియుచున్నది.

నామలింగ కవి సోదరుఁడగు అన్నయ కవి, తన సుదక్షిణా పరిణయమందు గద్యలో నిట్లు వ్రాసినాఁడు.

గద్యము :- "ఇది శ్రీ మత్తెనాళి రామేశ్వరశాస్త్రిత కృపాకటాక్ష ప్రకల్పిత కవితాభిరామ రామయమండిత నిమాని సహజ శైవాచార సంపన్న క్షేమపన్నయ నామధేయ ప్రణీతంబైన సుదక్షిణాపరిణయ మందు" అని యున్నది.

దీనిని బట్టి అన్నయకవియు సహజశైవాచార సంపన్నుఁడని తెలియుచున్నది. మఱియు,

సీ. కాళిదాసాది సంస్కృత, కవులఁ దలఁచి
ఆంధ్రభాషా విశేష భాషాధిపతుల
నన్నపాద్యార్యులను బుద్ధి, సన్నుతించి
పాలగుమి క్షేమగురుని సద్భక్తిఁ గొలుతు.

అను పై పద్యమువలన అన్నయకవి పాలగుమి క్షేమారాధ్యుని శిష్యుఁడై నటుల తెలియుచున్నది. వీరేశ్వరారాధ్యులు - క్షేమారాధ్యులు నిరువురు సోదరులై యుండవచ్చు.

క్రీ. శ. 1336 సం॥లో పెదకోమటి మాచారెడ్డి శాసనమొకటి గలదు. అందీ శ్లోకమున్నది. "శ్లో॥ పాల్గుమి శ్రీకంఠగురోః పంచాక్షర మంత్ర పౌనరుక్తస్య! శిష్యాయశిష్య పరిమద్రతా దాక్షిణ్యాసత్కటాక్షస్య" ఈ పై శ్లోకమువలన పాల్గుమివారు శైవాచార్యులై శిష్యప్రశిష్యులతో విరాజిల్లుచుండినటులఁ దెలియుచున్నది.

పాలగుమివారు - పాలకుర్తి సోమనాథుని వంశములోని వారనియు - కోటిపల్యారాధ్య సంతతికి జెందినవారనియు - ఇవటూరివారి వంశీకులనియు - ఇవటూరి పాపయారాధ్యులవారు - పాలకుర్తి సోమనారాధ్యుని చరిత్రయందు నిరూపించి యున్నారు.

రామలింగ కవి యింటిపేరు గార్లపాటి వారనియు - తెనాలి నగర మగ్రహారముగ సంపాదించుకొన్న తరువాత తెనాలి యని యింటిపేరు వచ్చినదనియు తెనాలిలో రామలింగేశ్వరస్వామి యాల యమున నొక యుత్సవ విగ్రహము పీఠము మీఁద నున్న యీ క్రింది శ్లోకమువలనఁ దెలియుచున్నది.

శ్లో॥ శ్రీ తెనాలి నగరే వ్యరాజయ
ద్గార్లపాటి పుర రామపండితః
శుక్ల మాఘసిత పంచమీగురౌ
రామలింగము మహోత్సవాకృతిం॥

రామలింగ కవి తండ్రి రామయ్య శైవాచారపరుఁడు గాన తన ప్రథమ పుత్రునికి తెనాలి రామలింగేశ్వరస్వామి పేరనే రామలింగ మనపేరు పెట్టుకొని యుండెనని తెలియుచున్నది.

సరస్వతీ సోమయాజి విరచిత పృథుచరిత్రలోని యీ క్రింది పద్యమువలన రామలింగకవి లింగధారి యని స్పష్టముగాఁ దెలియు చున్నది.

క. శృంగార రసాలింగిత
రంగత్కవితా నదీతరంగము హృదయ
త్వంగ ద్భుజంగ మాంగద
లింగమ్ము తెనాలిరామ, లింగముఁ దలఁతుక్.

కవి పుంగవు లనేకులు రామలింగకవిని స్తుతించి యుండిరి. అందు రామలింగ నామమునే వాడి యుండిరి. చూడుఁడు.

"రంగనాథుని రామలింగ కవిని"

కూర్మపురాణము - రాజలింగకవి

"రామలింగ కవి రామభద్రుల లీలఁదలఁతు"

అధ్యాత్మ రామాయణము - శరభకవి

"భీమకవి రామలింగని"

చంద్రరేఖా విలాపము - జగ్గన

"సద్యశ్శోలింగుని రామలింగ శశిలింగకళానిధిశేఖ"

నాగ్నజితీ పరిణయము - సల్లారి నరసింహకవి

"ఉ॥ లింగనిషిద్ధు ... విధాతృనాలింగని రామలింగ కవిలింగని"

చాటుధార.

రామలింగ కవి శైవాచార్యుఁడగు ఉద్భటారాధ్య చరిత్ర రచించెను. దీనిని రచించుటకు గారణము తాను లింగధారియై యుండుటయే గాక తన్నుఁ బ్రోత్సాహ పఱచిన దేచమంత్రి ఉద్భటారాధ్య వంశస్థుఁడగు చంద్రశేఖరారాధ్యుల శిష్యుఁడు.

దేచమంత్రియు శైవాచార పరాయణుఁడగుటయేగాక శివ పంచస్తవికి వ్యాఖ్యాన మొనరించి పండితులలో విఖ్యాతి గడించెను. రాయలమంత్రి యగు సాళ్వతిమ్మరసు కొండవీటి పరిపాలనమును దన మేనల్లుడగు నాదెండ్ల గోపమంత్రి కప్పగించెను. ఆ గోపమంత్రి క్రీ. శ. 1517 సం॥లో దేచమంత్రి కొక యగ్రహారం బొసంగెను.

"యస్మాద స్త్రైశ మాదా దఖిలమను పతిం దేచయా మాత్య వర్య । సోఽయంశ్రీ చంద్రమౌళిర్జయతి గురువరః ప్రోలనారాధ్యవంశః" ఉద్భటారాధ్య వంశస్థులందఱు అఘోరాస్త్ర జపపరాయణులు. శిష్యులకు వారామంత్రోపదేశమే చేయుచుందురు. దేచమంత్రియు నా మంత్రమునే ఉద్భటవంశస్థుఁడగు చంద్రశేఖరారాధ్యుల వలనఁ బొంది - జగదేకారాధ్యుఁడైన ఉద్భటారాధ్యుని చరిత్ర రామలింగ కవిచే రచింపఁజేసెను.

రామలింగకవిలో శైవాచార పరాయణత్వము పూర్తిగా మూర్తీభవించిన దనుటకు క్రింది పద్యములు తార్కాణములు. లింగ ధారి యగుటకతన నాతని పద్యములలో వీరశైవ సాంప్రదాయములు తొణికిసలాడుచున్నవి. చూడుఁడు.

సీ॥ అచల సుతాభర్త, కర్పించి మఱికాని
 మృగములు లేఁబూరి, మేయ వచట
అసమలోచనునకు, నర్పించి మఱికాని
 యళులు క్రొవ్విరితేనె, లాన వచట
అంధకధ్వంసికి, నర్పించి మఱికాని
 కోయిల లిగురాకుఁ గొఱుక వచట
అంగజారాతికి, నర్పించి మఱికాని
 చిలుకలు పండ్లు భు,జింప వచట

గీ॥ తక్కుఁగల జంతువులు శంభుఁ, దలఁచికాని
యుచిత వర్తనములఁ గోరి, యుండవచట
వదనములు వేయుఁగల యంత, వానికైన
నా యరణ్యంబు గొనియాడ, నలవియగునె.

గీ॥ శైవులగువారు చెప్పిన, జాడయందు
నడువనేరదు మూఢుల, గడుసుబుద్ధి
వానపై వానగురిసిన, నాను నొక్కొ
సహజ కాఠిన్యముడిగి పా, షాణకులము.

సీ॥ శివ పదాంభోరుహ, ప్రవిమలోదక పాన
 సిద్ధి నాలుక చవిఁ జెలఁగ దేని
శంభు దాసాంఘ్రైక, సంస్పర్శనంబున
 నెమ్మేను పులకల, నిలుప దేని

త్రిపుర దానవవైరి, దివ్యలింగమూర్తి
కన్నులారంగఁ జూడఁ గలుగఁడేని
దర్పక ధ్వంసియా, దలనిడ్డపూవుల
తావిపై నాసిక, దవులదేని

గీ॥ కాలకంధరు సత్కథా, కర్ణనంబు
కర్ణపుటవీధి నంటంగ, కదియదేని
వాని జన్మంబు జన్మమే, వాని బ్రతుకు
బ్రతుకె హరపరాయుఁడగువాఁడు, పశువుదెలియ.

క॥ శివలింగ దర్శనంబును
శివపూజా వైభవంబు, శివసద్గుణ సం
శ్రవణంబును మానవులకు
భవనీరద పటలచటల, పవమానంబుల్.

క॥ శివదీక్ష లేక మోక్షము
దవులఁడు జనుఁ డెంతవాఁడుఁ, దనయంతనె యు
ట్లవుఁగాన భక్తి గలిగిన
భవమూరుఁడు లింగదీక్ష, భజియింపఁ దగున్.

సీ॥ హరుని కర్పింపని, యన్నంబుఁ గుడుచుట
కుచ్ఛితోచ్ఛిష్టంబుఁ, గుడిచినట్లు
భవుని కర్పింపని, పానీయమానుట
మానక యాసవం, బానినట్లు
శివున కర్పింపని, పువుదావిఁ గ్రోలుట
కుణప ధూపంబోలిఁ, గ్రోలినట్లు
శంభు భక్తుఁడుగాని, జడబుద్ధినంటుట
గెంటక చండాలు, నంటినట్లు

గీ॥ పశుపతికిఁగాని పుణ్యాంబు, పట్టుటయును
బాపములుసేయు యత్నంబు, పట్టినట్టు
లనుచుఁ బ్రాజ్ఞులు విజ్ఞాన, మతిశయిల్ల
నన్ని తెఱఁగులఁ బూజింతు, రష్టమూర్తి.

పాల్కురికి సోమనారాధ్యుఁడు రచించిన బసవపురాణమందలి సప్తమాశ్వాసమున నుద్భటారాధ్యుల చరిత్ర వర్ణింపఁ బడినది. దానినిఁబట్టిరామలింగకవి యుద్భటారాధ్య చరిత్రరచించెను. తానును వీరశైవాచార పరాయణుఁడు కావుననే సోమనారాధ్యుఁడు రచించిన చెన్నమల్లు సీసములలోని యీ క్రిందిపద్యమునందలి భావమువచ్చు నటుల "సీ॥ హరుని కర్పింపని, యన్నంబుగుడుచుట...నష్టమూర్తి" యను నీ పై పద్యములో వీరశైవాచార ధర్మములఁ దాను రచించిన గ్రంథమున వివరించెను.

సీ॥ ఆనందమలర లిం, గార్చనఁ జేయక
గుడుచుట పాపంబుఁ, గుడుచునట్లు
అర్చకుండయ్యు లిం, గానర్పితముఁ గోరి
ముట్టుట యన్యంబు, ముట్టినట్లు
లింగప్రసాదంబు, జంగమవిముఖుఁడై
కొనుటయే మేనియుఁ, గొనినయట్లు
జంగమహితుఁ డయ్యు, సరిపాకభేదంబు
సేయుట ద్రోహంబు, సేసినట్లు

ఆ॥ అను పురాతనోక్తి, కావంతయును దొట్రు
పడని శుద్ధ భక్తి, పదము ప్రాణ
పదముగాఁ జలించు, భక్తలింగంబులఁ
జేర్పవయ్య నన్నుఁ, జెన్నమల్లు.

చెన్నమల్లు సీసములు - పాల్కురికి సోమనారాధ్యుడు - రామలింగకవి తొలుత శైవుడై యుండియు రాజాశ్రయము - రాజసన్మానము వాంఛించి నా నాటి వైష్ణవమతావలంబకులగు రాజులకు ప్రీతి కొఱకై వైష్ణవ గురువులైన భట్టరు చిక్కాచార్యులవద్ద వైష్ణవమతమును స్వీకరించి వైష్ణవ గ్రంథములగు పాండురంగ మాహాత్మ్యము- ఘటికాచల మాహాత్మ్యము మున్నగు గ్రంథముల రచించెను. రామకృష్ణ నామము ధరించెను. "కుమార భారతి" యను బిరుదమునకు బదులు "శారద నీరూపము రామకృష్ణకవి చంద్రా!" యని గ్రంథములందు వ్రాసుకొనెను.

తాను వైష్ణవుఁడయిన తరువాత పూర్వము రచించిన ఉద్భటారాధ్య చరిత్ర నితర గ్రంథముల యందుఁ జెప్పుకొనకున్నను పాండురంగ మాహాత్మ్యమున "శైవవైష్ణవ పురాణావళీ నానార్థరచనాపటిష్ఠైకరమ్యమతివి" యని చెప్పుకొని యుండుటచేఁ దొలుత శైవ గ్రంథముగ నుద్భటారాధ్య చరిత్ర వ్రాసినట్లు స్పష్టపడుచున్నది.

ఇంతేగాక ఘటికాచల మాహాత్మ్యమున నుద్భటారాధ్య చరిత్రలోని పద్యములను కొద్ది మార్పులతో రచించి తన పూర్వగ్రంథమందభిమానమును జూపించినాడు.

ధనార్జన చింతకులోనై రాజాశ్రయమును గోరువాడు మతము మార్చుకొనుటలో నాశ్చర్యము చెంద నవసరముండదు. "శైవులగువారు చెప్పిన జాడలందు నడువ నేరదు మూఢుల గడుసుబుద్ధి" యని రామలింగకవి చెప్పి దాని యర్థమును తానే సార్థక పఱచినట్లు గన్పించినది.

శివభక్తుఁడగు ధూర్జటికవి స్తుతమతియై యతులిత మాధురీ మహిమతో నొప్పారు పల్కులతో కవితాస్రవంతినిఁ బ్రవహింపఁ

జేసియు రాజాశ్రయుడయ్యు రాజుల నిరంకుశాజ్ఞలకు లోబడక యుస్వ
మతావలంబకుడుగాక తన మనోభిప్రాయముల స్పష్టముగా బహిర్గ
తము చేసినాడు. చూడుడు.

శా॥ రాజుల్మత్తులు వారిసేవ నరక, ప్రాయంబు వా రిచ్చునా
భోజాకీ చతురంత యానతురగీ, భూసాదు లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్షచాలు...

అని యీ విధముగా రాజుల గూర్చి ధూర్జటికవి నిర్భయముగా
జెప్ప సాహసించినాడు. రామలింగకవి యున్నతో త్తలుత శైవాభి
మానియై యుండియుజివర దశలో వైష్ణవమతి స్వీకారముచేసి రాను
కృష్ణుడై - శైవ వైష్ణవ మతాను కూలములగు గ్రంథముల రచించి
కవి పుంగములలో బేరెన్నిక గాంచుట జగత్ప్రసిద్ధ విషయము.

---

మహత్కార్యముల సాధించిన వారందఱు శివభక్తులే.

## పీఠాధిపతి

### అగస్త్య మహర్షి

అగస్త్యమహర్షి శివభక్తాగ్రేసరుడు. జలరాశుల నన్నిటిని నన
చేతిలో ఔపాసన పట్టగల ప్రజ్ఞను సంపాదించెను. వాతాపిని సహి
తము జీర్ణము చేసికొను సమర్థత సముపార్జించెను.

### భగీరథుడు

ఈతడు శివుని గూర్చి తపంబొనర్చి శివుని జటాజూటమందలి
గంగను భూలోకంబునకు దెచ్చి తన పితరుల తరింపజేసెను,

### జైమిని - పులస్త్యులు

శివభక్తు లగుట వలననే వీరలు పిడుగును సహితము నివారించు
ప్రజ్ఞ సంపాదించి ప్రసిద్ధి వడసిరి.

(పండితారాధ్య చరిత్ర 102 వ పేజి) (సశేషము).

# శైవగ్రంథమాలి

| | | |
|---|---|---|
| 1. సంధ్యావందనము | ... | 0—8—0 |
| 2. ఆంజనేయ స్వరూపనిరూపణము | ... | 0—8—0 |
| 3. భగవద్గీత | ... | 6—0—0 |
| 4. శైవాహ్నికము | ... | 1—0—0 |

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు ఉత్తరము వ్రాయవలెను.

Saivamataprakasika Regd. No. A 272

## శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అడ్రస్ :— 1

ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వ ర ం గ ల్

అడ్రస్:— 2

ముదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) దుగ్గిరాల

[ గుంటూరు జిల్లా ]

సూచన :— వ్యాసములు - ఉత్తరములు - బ్లాకులు - చందాధనము ఈ పై అడ్రస్సులలో నొకదానికి పంపించవలెను.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పదమునఁ బ్రకటింపఁబడు

పవిత్ర మాసపత్రిక


సంపుటము — హేవళంబి సంవత్సరము — సంచిక

౧ — 15—7—1957 — ౩



సంపాదకులు:

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.

*Principal Ayurvedic college & Superintendent*

*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు:

ముదిగొండ రామలింగశాస్త్రి

భాషాప్రవీణ.


శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థతతిప్రభాసికా

సందేహసందోహమహానిరాసికా।

తత్త్వార్థబోధప్రదసిద్ధదేశికా

జయత్వియం శైవమతప్రకాశికా॥


శ్రీ శైవ మహాపీఠము

స్టేషనురోడ్డు, శ్రీ విశ్వేశ్వర దేవాలయము

వరంగల్

# విషయ సూచిక

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమునఁ బ్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవళంబినామ సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౮ | 15—7—1957 | ౩ |



## సంపాదకీయము

వరంగల్లు నగరమున 48 వ శైవమహాపీఠ వర్ధంతి మహా సభలు మహావైభవముగా జరిగినవి. ఈ సభలో గతసభలుకంటె నిర్మాణ కార్యక్రమము సాగించుటకు సభ్యులు ముందంజ వేసినారు.

శైవమహాపీఠ ప్రధానకార్యాలయము వరంగల్లునకు మార్చుట- వరంగల్ వాస్తవ్యులైన శివపురం రామలింగంగారిని కార్యదర్శిగ యెన్నుకొనుట - ధర్మాదాయ పరిశీలన - మూలధన సంపాదనచేయ తీర్మానించుట - అను మూడు తీర్మానములు ప్రధాన స్థాన మాక్రమించుకొన్నవి.

శ్రీ. లో. పీఠాధిపతులు - అత్తలూరి వేంకటసుబ్బారావు గారును, కందుకూరి వటుక భైరవమూర్తిగారును, కీ॥ శే॥ ఆకారపు నరసింగంగుప్తగారి ధర్మపత్నులయిన శ్రీమతి అనంత లక్ష్మీదేవి, సుశీలా దేవిగార్లను-శైవమహాపీఠ ప్రధానకార్యాలయ స్థాపనకై యొకగదిని యభ్యర్థించిన వెంటనే వారందుల కంగీకరించి యొకగది నొసంగుటయు - జ్యేష్ఠ బ ౫ సోమవారము కార్యవర్గమువారు గణపతి

పూజాపురస్సరముగ శైవమహాపీఠ ప్రధానకార్యాలయము విశ్వేశ్వర స్వామి దేవాలయ పురోభాగమునందున్న నొకగదిలో స్థాపించుటయు- ప్రథమపాలకవర్గ సమావేశ మందు జరుగుటయు, శైవమహాపీఠ పురోభి వృద్ధికి శుభసూచకములు.

శైవుల ధర్మసంస్థల ఆదాయము శైవులకే వినియోగపరచి నచో వారి యార్థికబాధ కొంతతగ్గవచ్చును. శైవమహాపీఠమునకును, శైవులార్జించిన ధర్మాదాయమునకును గల పరస్పర సంబంధములు విచారించుటకు శైవమహాపీఠ పక్షమున శ్రీ అత్తలూరి వేంకట సుబ్బారావుగారును, కందుకూరి వటుక భైరవమూర్తిగారును త్వరలో ధర్మసంస్థల పరిపాలకులతో సంప్రదించుటకు వచ్చుచున్నారు. ఆయా ధర్మసంస్థల కార్యకర్తలు వారితో సంప్రదింపులు జరిపి రిపోర్టు మా కార్యాలయమునకు పంపుదురుగాత.

ప్రతిశైవుడును పీఠపక్షమున ప్రతిరోజు 10 నిమిషములు సాంఘికసేవ చేయ బద్ధకంకణుడు కావలెను. ప్రతిశైవుని పత్రిక చందా దారుడుగనో, పీఠసభ్యుడుగనో చేర్చ శక్తికొలది ప్రయత్నించ వలెను.

పీఠవ్యవహార పరిజ్ఞానమునకు మేనేజర్, శైవమహాపీఠ ప్రధాన కార్యాలయము, స్టేషన్‌రోడ్డు - విశ్వేశ్వర దేవాలయము - వరంగల్- అను అడ్రసునకు రిప్లై వ్రాయవలెను.



# శ్రీ శైవమహాపీఠము

## మహాసభలు - వర్థంతి సభలు

శైవసభ జన్మించినది మొదలు 33 వర్థంతులు జరిగినవి. ఇక్కడ నుండి సభలు జరిగిన సంవత్సరములు గాక సభ ప్రారంభించిన సంవత్సరము ప్రకటింపబడుచున్నది. కావున సభ ప్రారంభించి యిది 48వ సంవత్సరము. ఏ యే గ్రామములయందే యే సంవత్సరములలో సభలు జరిగినది యీ క్రింద వివరించుచున్నాము.

ఆలోచన సభ బెజవాడ. ది 2-6-1909

1. ప్రథమ మహాసభ వరంగల్ ది 25-12-1909
2. పెడన 1911 వ సంవత్సరము
3. కొత్తపల్లి 1912 ,,
4. ఈమని 1913 ,,
5. విజయనగరం 1914 ,,
6. నర్సాపురం 1915 ,,
7. బెజవాడ 1916 ,,
8. మినిమించినపాడు 1917 ,,
9. దేవాది 1918 ,,
10. రాజమహేంద్రవరం 1919 ,,
11. సికింద్రాబాద్ 1920 ,,
12. మాదల 1921 ,,
13. యలకుఱ్ఱుఅగ్రహారం 1922 ,,
14. తెనాలి 1923 ,,
15. వరంగల్ 1927 ,,
16. మహీసా 1930 ,,
17. వరంగల్ 1931 ,,
18. బెజవాడ 1934 ,,
19. యలకుఱ్ఱుఅగ్రహారం 1936 ,,

| | | | |
|---|---|---|---|
| 20. | బెజవాడ | 1937 | ,, |
| 21. | రాజమహేంద్రవరం | 1938 | ,, |
| 22. | కొత్తపల్లి | 1939 | ,, |
| 23. | వరంగల్ | 1940 | ,, |
| 24. | గుంటూరు | 1941 | ,, |
| 25. | ఆకులల్లూరు | 1942 | ,, |
| 26. | ఈతముక్కల | 1943 | ,, |
| 27. | తెనాలి | 1944 | ,, |
| 28. | వేమవరం | 1945 | ,, |
| 29. | బెజవాడ | 1948 | ,, |
| 30. | ఈమని | 1951 | ,, |
| 31. | తెనాలి | 1952 | ,, |
| 32. | వేములవాడ | 1953 | ,, |
| 33. | బెజవాడ | 1954 | ,, |
| 46. | పీఠ వర్ధంతి తెనాలి | 1955 | ,, |
| 48. | ,, వరంగల్ | 1957 | ,, |



శ్రీ శివాయగురవేనమః

# శ్రీ రుద్రయాగ మహోత్సవములో జరిగిన

## శ్రీ శైవమహాపీఠ 48వ వర్ధంత్యుత్సవ సందర్భమున జదివిన

## ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము

శివారాధన తత్పరులారా!

చిరకాలమునుండి శైవమతాభ్యున్నతికై పాటుపడుచు నేటి 48 వ వర్ధంతి యుత్సవములకు మాయోరుగల్లున కరుదెంచుట ఎంతయు ముదావహము.

సుప్రసిద్ధ చారిత్రాత్మకమై విరాజిల్లిన నీ యోరుగల్లు పట్టణము అనాదినుండియు శైవవాఙ్మయము - శైవమతాచార్యు లొనరించిన మహాత్యాగము - మతప్రచారములకు ఉనికిపట్టు.

'శివఏకోధ్యేయ శ్శివంకరః సర్వ మన్య త్పరిత్యాజ్యః'

అను నార్యోక్తిని రాజులుకూడ ధృవపఱచిరి.

అట్టి మహోత్కృష్టమగు యోరుగల్లుపురము వీరమాహేశ్వరాచార్యులకు విహారభూమి. విద్యానాథుడేకాదు, శివదేవయ్య, శరభాంక సోమనాథాది అమూల్య కవితాస్రవంతిలో మంచి ముముక్షువులకు కొంగుబంగారమైనది.

శివయోగి పాదరాజీవంబులకు మ్రొక్క, శీఘ్రమెసిద్ధించు శివుని కరుణ! అను భావము నేటివఱకు, శైవమతాచార్య పారంపరులగు ఆరాధ్య శిఖామణులును అహరహము నారాధించుటయే అనన్య సౌఖ్యాస్పదంబను ఆర్యవైశ్యులకు ఆస్థానభూమి.

“శత్రువైనను లింగసహితుడై యున్న, మిత్రులుగా జూడుమి” యను పరశివోదిత వాక్కులమలుపఱచిన, మల్లికార్జున పండితారాధ్య వంశసాంప్రదాయులగు రాజయ, బసవ, మల్లనారాధ్యాది గురువరేణ్యులకు కాణాచి యోరుగల్లే.

“సాధ్యమాభక్త ప్రసాదేతరంబమేధ్యంబుగా జూడుము” యను నార్యోక్తి ననుసరించి, శివలింగధారుల పాదోదక ప్రసాదోదకము జీవన్ముక్తికి హేతువని జీవితమంతయు భక్తమాహేశ్వరులకే వ్రయ పఱచిన (శ్రీ) ముదిగొండ శంకరారాధ్యస్వామివారి నిలయము నేటి వఱకు పై మతాచార్యుల పవిత్ర చిహ్నములచే చిత్రింపఁబడినదై వర్ధిల్లుచున్నది.

మానవజీవితమునకు, జీవన్ముక్తికి ప్రధానము శివోపాసన. అందులో స్వేష్టలింగధారణ యుత్తమము. శైవము యోగజ్ఞానము

లకు ముఖ్యమగుమతము. ఇట్టి మహామహిమాస్పదంబగు మత సాంప్రదాయులమగు మన మందఱ మిచ్చోఁగూడితిమి. చేయవలసిన విధులెన్నియో కలవు. వర్తమానకాలంబున, సాంఘిక, నైతిక, వైజ్ఞానిక, సాంకేతిక విద్యలు కోరుచున్నవి. ఇందులో ముఖ్యముగ మన సాంప్రదాయముగ గుర్తెఱిగిన మనకే యగ్రగణ్యస్థానము లభించును.

శివభక్తశిఖామణులకు నాకరంబగు నప్పట్టణంబునగల వర్తకశిఖామణులచే నిర్వహింపఁబడని సంస్థలు లేవు. మహానుభావులెందఱో మతధర్మంబుల వెలిబుచ్చు అముద్రిత గ్రంథములు ముద్రించి పాఠశాలలు నెలకొల్పి, విద్యావసతు లేర్పరిచిరి. అట్టివాని నభివృద్ధికి దెచ్చుట మనకర్తవ్యము.

సంఘాభివృద్ధి కావలెనన్న, సాంప్రదాయసిద్ధమగు సదాచారము కాపాడవలెను. స్వీయధర్మోద్ధరణకై కృషిసల్పిన మహాశయులు దెలిసినంతవరకు శ్రీనాగలింగశాస్త్రి, శ్రీబుచ్చయ్యలింగశాస్త్రి, శ్రీరాజలింగారాధ్యులవారు ప్రశంసాపాత్రులు. శ్రీపతి పండితారాధ్యస్వామివారు సికింద్రాబాదులో నిర్మించిన మఠమువారు మతమునకు చేసిన సేవ మరువ దగినదికాదు.

మఱియు మనపీఠాధిపతులు చేసినసేవయే కూడ నిదర్శనము. ప్రస్థానత్రయమును, వర్తకప్రముఖులచే ముద్రింపించిరి. ప్రస్తుతము పీఠము తరఫున మన మతమున వెలువడు మాసపత్రికకు కనీసము చందాదారులమై యుండుట ప్రతివాని కర్తవ్యము. ధర్మసంస్థలు పెక్కులుగలవు. శిథిలమై పోవుచున్నవి. వాటిని మన ముద్ధరించినకాని సంఘమున కౌన్నత్యము కలుగదు. ప్రతి శైవుడును శైవధర్మప్రబోధకమగు కృషిచేయుట యవసరము. శంకరారాధ్యసత్రము శైవపీఠమున కగ్రస్థాన మొసర్చి బసవారాధ్యులవారి శూన్యసింహాసనాది ధర్మముల నుద్ధరించ బూనుకొనవలెను. పూర్వులొనర్చిన ధర్మంబు లుద్ధరించని పక్షమున మన కభివృద్ధికల్గుట కష్టము.

మండు వేసవిలో అతపక్లాంత దేహులై అలసి, యరుదెంచిన మీకందఱికి స్వాగతము - సుస్వాగతము. నేచేయు సుప్రయోగమును బురస్కరించుకొని (శ్రీ) శైవమహాపీఠ 48వ వర్ధంత్యుత్సవము యీ ప్రథమున జలిపుటచే నేను మీకు మనఃపూర్వక వందనంబు లర్పించుచున్నాను.

వరంగల్ 28—6—'57

శ్రీ శివపురం వీరభద్రయ్యగారి అనుమతి చాగంటి భాస్కరలింగశాస్త్రి చదివినది.



## 48-వ శైవమహాపీఠ వర్ధంతీ మహోత్సవము

స్వస్తిశ్రీ హేవళంబినామ సం॥ర జ్యేష్ఠ బ 3-8-11 (జూన్ 14, 15, 16) తేదీలలో వరంగల్‌లోని దుర్గేశ్వరాలయమున శివయోగి ముదిగొండ వీరేశలింగారాధ్యులవారి యధ్యక్షతక్రింద పీఠ వర్ధంతి సభలు జయప్రదముగ జరిగినవి. శైవమహాపీఠ వర్ధంతిని యాహ్వానించినది సంగీత విద్వాన్ శివపురము వీరభద్రారాధ్యులవారు. వీరు 36 లక్షలు షడక్షరీ మంత్ర పురశ్చర్య గావించి 36 గురు ఋత్విక్కులతో 11 రోజులు రుద్రస్వాహాకారము లాచరించిరి. హోమతర్పణ, అన్నదానములు ప్రతిరోజు పక్వాన్నములతో రాత్రింబవలు జరిపిరి. భాష్యప్రవచనములు, శివకథలు, శివభజనలు మహావైభవముగ జరిగినవి.

### ప్రథమ దినచర్య (14-6-'57)

ఉదయము 8 గంటలకు ఆహ్వానసంఘాధ్యక్షులయిన శివపురం భద్రయ్యగారు మహేశ్వరులతో - బ్యాండు వాయిద్యముతో శంకరారాధ్యులవారి సత్రమునకు వచ్చి ఆరాధ్యులవారికి నీరాజన

మంత్రపుష్పము లొసంగి పీఠాధిపతులను - నిర్మల శంకరశాస్త్రిగారిని రథాధిరూఢులుగ జేసి మహోత్సవముగ ఊరేగింపుతో సభాభవనము ప్రవేశించిరి. కందుకూరి వటుకభైరవమూర్తిగారు - అత్తలూరి వేంకటసుబ్బారావుగారు - భండారు వీరరాజుగారు - కొడిమేల భోగ సోమలింగమూర్తిగారు - యం. యస్. రాజలింగంగారు - భండారు చంద్రమౌళీశ్వరరావుగారు- ముదిగొండ చినవీరభద్రయ్యగారు, ముదిగొండ శంకరశాస్త్రిగారు - ముదిగొండ బ్రహ్మయ్యలింగంగారు - శివదేవుని వీరభద్రశాస్త్రిగారు- శివపురం రామలింగగారు - ములుగు వీరమల్లయ్యగారు - చాగంటి భాస్కరలింగశాస్త్రి-ముదిగొండ నందయ్యగారు- బుచ్చిమల్లయ్యగారు- తాడికొండ వీరభద్రంగారు - తాడికొండ పూర్ణానందంగారు - తాడికొండ లింగమూర్తిగారు - ముదిగొండ రాజవీరయ్యగారు - శివలెంక పిచ్చయ్యగారు - శివశంకరరావుగారు- ముదిగొండ రామలింగశాస్త్రిగారు మున్నగు మాహేశ్వరులు, భక్తులును సభలో పాల్గొనిరి.

గణప్రదక్షిణ మాచరించి వేదపారాయణముతో - ద్వాదశారాధ్యస్తోత్రముల పఠించి సభ యారంభింపబడెను. ఆహ్వానసంఘము తరపున చాగంటి భాస్కరలింగశాస్త్రిగారు స్వాగతోపన్యాసము చదివిరి. అధ్యక్షు లుపన్యసించిరి.

సాయంత్రము 5 గం లకు సభ ప్రారంభమయినది. పీఠాధిపతు లుపన్యసించిన పిదప నిర్మల శంకరశాస్త్రిగారు నీలకంఠభాష్యమునకు తాము వ్రాసిన తెలుగు అనువాదమును చదివి సభ్యుల నానందింప జేసిరి. ము॥ శంకరశాస్త్రిగారి భాష్యప్రవచనముతో సభ ముగింపు చేయబడెను.

ద్వితీయ దినచర్య

9 గంటలకు సభ కూడినది. కందుకూరి వటుకభైరవమూర్తిగారు పీఠవృత్తాంతము నివేదించిరి. చామర్తి అప్పారావుగారు

అష్టావరణములగూర్చియు భాషాప్రవీణ ముదిగొండ రామలింగశాస్త్రి గారు శైవకవులనుగూర్చియు - అత్తలూరి వేంకటసుబ్బారావుగారు మూలధనము శైవమహాపీఠమునకు సంపాదించవలయునని ఉపన్యసించుచు ప్రతిశైవుడును తాను సంపాదించు సంవత్సర ఆదాయములో 11 రోజుల ఆదాయము పీఠమునకు సమర్పింపవలయు ననియు-వారట్లు ఇచ్చుటకు సిద్ధముఁగనున్నామనియు వచించిరి. సభలో నటులే వాగ్దానము కొంద రొనర్చిరి. ముదిగొండ శంకరశాస్త్రిగారు షట్కాల శివపూజనుగూర్చి యుపన్యసించిరి.

సాయంత్రము 5 గంటలకు సభకూడినది. చామర్తి అప్పారావు గారు తాము రచించిన శరభవిజయములోని కొన్ని ఘట్టములను చదివి సభ్యులకు కర్ణ రసాయనము గావించిరి. పిదప సభను గూర్చి తాము వ్రాసిన పద్యముల చదివిరి. చామర్తి రామలింగంగారు కూడ సభాప్రశంసాపూర్వకముగ కొన్ని పద్యముల చదివిరి. శంకరశాస్త్రి గారి భాష్యప్రవచనముతో సభ ముగిసినది.

## తృతీయ దినచర్య (16-6-'57)

ఉదయము 8 గంటలకు శైవమహాసభ సమావేశమయినది. కార్యదర్శిగారి రిపోర్టు అంగీకరించబడినది. కారణాంతరములచే వా రొసంగిన రాజీనామాను అంగీకరించి శ్రీ శివపురం రామలింగంగారిని కార్యదర్శిగను - భండారు చంద్రమౌళీశ్వరరావుగారిని లీగల్ ఎడ్వైజరుగను నేర్పాటు చేయబడినది. కార్యదర్శిగారిచే నవీన పాలక వర్గ మెన్నుకొనబడినది. శ్రీ. లో. ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ గారు శైవమహాపీఠమునకు పత్రికా భిక్ష నొసంగి చేయుచున్న వారి యమూల్య సేవను కొనియాడి నూతన పాలకవర్గములోకూడ మున్ముందుగా వారెన్నుకొనబడిరి. వారి కుటుంబమున కాయురా రోగ్యైశ్వర్య భాగ్యములు సదా సర్వేశ్వరు డొసంగుగాతయని

పీఠాధిపతు లాశీర్వదించిరి. పీఠ కార్యస్థానము వరంగల్లునకు మార్చ బడినది.

శివపురము వీరభద్రయ్యగారు – శైవమత ప్రకాశికకు రూ. 25–0–0 లు విరాళ మొసంగిరి. తీర్మానము లాచరించబడినవి. సభ ముగిసినది.

సాయంత్రము 5 గం॥లకు సభసమావేశమయినది. ముదిగొండ కోటేశ్వరరావుగారు ఆబాలగోపాలము శైవమతము వ్యాపించక పోవుటకు కారణము కవులు పాఠ్యగ్రంథములలో శైవకథలు వ్రాయకపోవుటయే యని యుక్తియుక్తముగ నుపన్యసించిరి. వీరిని పీఠ కార్యస్థానము మేనేజరుగ నియమించిరి. విజయవాడలోని శైవ మహాపీఠ భవన పరిపాలనాధికారులుగ శ్రీ ఇవటూరి కోటీశ్వరరావు గారు నియుక్తులైరి.

తరువాత భాషాప్రవీణ – విద్యాప్రవీణ కొండపల్లి ఆంజనేయ శాస్త్రిగారు శైవ సారస్వత పరీక్షలగూర్చి యుపన్యసించిరి. పులిపాక కేదారలింగంగారు శివభక్తునిగూర్చి సుబోధకమగునటుల రమణీయ ముగ నుపన్యసించిరి.

శైవమతప్రకాశిక – తత్త్వప్రకాశిక రెండు పత్రికల కలిపి ఒకే పత్రికగా నడిపింపరాదా ? అని సభ్యులలో నొకరు ప్రశ్నించిరి. అల్లూరి వేంకటసుబ్బారావుగారు వెంటనే శైవమతప్రకాశిక ప్రారంభింపకపూర్వము–ప్రారంభించిన తర్వాత తత్త్వప్రకాశికా సంపాద కునితో మాటలాడినామనియు వారు నెల 1కి రు. 80–0–0 లిచ్చి తన పత్రిక పేరుతో నడుపమంటే నడుపుతా మన్నారనియు – వారి కిచ్చు టకు మూలధనముగాని, పేరుమార్చుట కిష్టముగాని పీఠమువారికి లేనందున వేరొకపత్రికలు వారే నడుపుకొనుటకు కమిటీవారేర్పాటు చేసినారనియు చెప్పిరి. తత్త్వప్రకాశికతో శివలెంక లింగయ్యగారు

వ్రాసిన విషయము లసత్యములు - అనుపాదేయము లనియు - వచించిరి.

పిదప శివదేవుని వీరభద్రశాస్త్రిగారు శివపూజకు మారేడు పత్రి-పుష్పములు - మొదలగునవి లభించనపుడు ఎట్టివి ఉపయోగించవలెనో వాటిని - పూజాఫలమును చక్కగా వివరించిరి. ప్రభాత భజన సంఘము, శివభజన సంఘమువారు భజన లొనర్చిరి. అధ్యక్షుని అంత్యోపన్యాసముతో; ఆహ్వానసంఘాధ్యక్షుల యభినందనములతో; శైవమహాపీఠమునకు జై అను జయజయ ధ్వానులతో సభ ముగింపు చేయబడినది.

17—6—'57

రుద్రయాగము, పూర్ణాహుతి మహోత్సవము గావింపబడినది. శ్రీ. యం. యస్. రాజలింగంగారును, అత్తలూరి వేంకటసుబ్బారావు గారు, ప్రధానమంత్రిగారు శంకరశాస్త్రిగారుపన్యసించిరి. ఛాయాపటములు తీయబడినవి. మేళతాళములతో ఆకారపు రాజ చెన్న విశ్వేశ్వర రావుగారి తోటలోని తటాకమునకు అవభృదోత్సవమునకు వెళ్లిరి. ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు; వంగల గురుమూర్తిశాస్త్రిగారు ప్రభృతులు తిరిగి దుర్గేశ్వరాలయమునకువచ్చి నీరాజన మంత్ర పుష్పము లిచ్చి ఉద్వాసన గావించిరి. త్రిమతస్థులకు అన్నదానము మహోన్నతముగా జరిగినది. శైవమహాపీఠకార్యాలయము సాయంకాలము 5 గం॥లకు స్థాపింపబడినది.

18—6—'57

సాయంత్రము 8 గంటలకు దుర్గేశ్వర వీరభద్రేశ్వర లీలా కల్యాణ మహోత్సవములు జరుపబడినవి. మహదాశీర్వచనము, ఋత్విక్కులకు దీక్షావస్త్రములుగాక సత్కారములు శివపురపు వీరభద్రయ్యగారిచే గావింపబడినవి. రుద్రయాగము మహావైభవముగా జరిగినందులకు పరశివుని కనేక ధన్యవాదములు.

# 48-వ సంవత్సర శైవమహాపీఠ వర్ధంతి

## శైవమహాసభ తీర్మానములు

### ది 16—6—'57

1. దుర్ముఖినామ సంవత్సరము తాలూకు (అనగా 12-4-56 నుండి హేవళంబినామ సంవత్సర వైశాఖ శుద్ధ దశమి 9-5-57వరకు) జరిగిన శ్రీ శైవమహాపీఠము తాలూకు ఆదాయవ్యయములను, ఆడిటరు రిపోర్టును తమ నివేదికతోసహా కార్యదర్శి శ్రీ కం. వ. భైరవ మూర్తి పంతులుగారు చదివి వినిపించి, సమర్పించగా పరిశీలించి ఆమోదించడమైనది.

2. ఆంధ్రప్రదేశ్ రాజ్యములో నానాప్రాంతములందు శైవుల యుపయోగార్థం స్థాపితములైయున్న సత్రములు, మఠములు, గ్రంథాలయములు, విద్యాలయములు మొదలగు ధర్మసంస్థలగూర్చి విచారించి అవకాశ మున్నంతవఱకు వాటిని పీఠ యాజమాన్యముక్రిందకు తీసికొని, వాటి నిర్వాహణమునకు, పోషణకు నేర్పడియున్న మాన్యములు, భవనములు మొదలగు యావదాస్తిని స్వాధీనపఱచుకొని వ్యవహారించుటకు కార్యదర్శిగారి కధికార మివ్వడమైనది. కార్యదర్శిగారి కవసరమని తోచినప్పుడు పై విషయములను గురించి వ్యవహారించు విషయము తమకు తోచిన, ఇతరుల నెవరినైనా తమతో Co-opt. చేసికొనుట కధికార మివ్వడమైనది.

3. పీఠముయొక్క ప్రధానకార్యములగు విద్యావ్యాప్తి, మత ప్రబోధ, ప్రచారములు, తద్విషయక గ్రంథ ముద్రణ ప్రచురణ ములు మున్నగు కార్యములకు మూలధన మవసరము గనుక శైవ మహాజనులెల్లరు తమ నికరాదాయమునుండి ముప్పదియారవవంతుకు తగ్గకుండా యిచ్చి తోడ్పడగలందులకు అభ్యర్థించడమైనది. ఈ విష

యమై వెంటనే యములుజరుపుటకు సెక్రటరీగారి కధికార మివ్వఁడ మైనది.

4. పీఠ నిబంధనావళిలో 8 వ నిబంధనలో రెండవవాక్యములో సభ్యుడు "చెల్లింపవలసిన" అను పదములకు నడుమ "ప్రతి సంవత్సరము"యను పదము చేర్చవలెను. "సభ్యుడు" యావన్మొత్తము...... నుండి నిబంధనాంతము వఱకు నున్న భాగము తీసివేయవలెను. ఇందును గురించి 18-8-'56 వ తేదీన పాలకసమితి జేసిన 1 వ తీర్మానమును ఆమోదించడమైనది.

5. విజయవాడలోని పీఠభవన నిర్వాహణకు భవనాధికారిగా విజయవాడ వాస్తవ్యులగు శ్రీ ఇవటూరి కోటేశ్వరరావు, ( B. Sc. ) గారిని నియమించి, అధికారమివ్వడమైనది. సదరు కార్య నిర్వాహణములో వీలువెంబడి వారికిష్టమగువారిని సహాయముగా నొకరిని నియమించుకొని పని జరుపుటకు అధికారమివ్వడమైనది.

6. పీఠ కార్యదర్శి శ్రీ కందుకూరి వటుక భైరవమూర్తిగారు కారణాంతరములచే, పీఠ కార్యదర్శి పదవికి రాజీనామా పత్రమును మఠాధిపతి కందజేసియున్నారు. అందుపై పీఠాధిపతిగారు ఆ రాజీనామా నంగీకరించి వరంగల్ వాస్తవ్యులైన శ్రీ శివపురం రామలింగం గారిని, పీఠ కార్యదర్శిగా నియమించినందున ఆమోదించడమైనది.

7. ది. 3-6-'56 నుండి నేటివఱకు పీఠకార్యదర్శిగా అతిసమర్థతతో నిర్వహించి కోటిబిల్వార్చన, కార్తికమాస గణార్చన మున్నగు చిరస్మరణీయములగు కార్యక్రమములను జరిపి శైవమతమునకు పీఠమునకును అపారసేవ జేసినందులకు శ్రీ కందుకూరి వటుకభైరవమూర్తి గారిని వారికి తోడ్పడిన సభ్యులను అభినందించడమైనది.

8. శ్రీ మల్లికార్జున పండితారాధ్యులు, నిర్మలశంకరశాస్త్రిగారు రచించిన నీలకంఠభాష్యాంధ్రీకరణ గ్రంథమును వారు స్వయముగా

సభాముఖమున పీఠాధిపతులు, పాలకసమితి సభ్యులు, పండితులు మున్నగు భక్తమాహేశ్వరగణ సమక్షములో స్వయముగా చదివి వినిపించినందున సభ్యులెల్లరు సవిమర్శముగా దాని నాకర్ణించి ఆమోదించడమైనది.

దాని ముద్రణము త్వరలోనే జరిపించుటకు వారు కోరినందున వారిప్పటివరకు రచించిన భాష్యభాగమును ముద్రింపించుటకగు వ్యయమును గూర్చి విచారించి పాలకసమితి అభిప్రాయముతోసహా మహాజన సభకు నివేదించుటకు అధికార మివ్వడమైనది.



# మహాత్కార్యముల సాధించినవారిలో చాలావంది శివభక్తులే

## పీఠాధిపతి

(గతసంచిక తరువాయి)

### దూర్వాస మహర్షి

కృష్ణమూర్తికి తాను ప్రసాదమొసగి యా ప్రసాదలేపనమున ఆతని శరీరమందెచ్చట బాణములు తగిలినను మరణింపకుండు నటుల గావించిన ప్రజ్ఞావిశేషములు గలవాడు.

### మార్కండేయుడు

మృత్యువును జయించెడి తపశ్శక్తి నార్జించెను.

### శుక్రాచార్యులు

శివోపాసనవలన మృత్యుసంజీవనీవిద్య నేర్చికొనెను.

## దధీచి

దక్షయజ్ఞము ధ్వంసమగునటుల శాపముపెట్టు సామర్థ్యము గలవాడు.

## శ్రీపతి పండితుడు

అగ్నిహోత్రమును వస్త్రమున మూటగట్టుశక్తి సాధించిన వాడు.

## ఉద్భటారాధ్యులు

యోగాగ్నిచే తన శరీరము దహించి తద్ధూమముచేత యేడు వందల పిశాచములకు విముక్తి కలిగించిన మహానుభావుడు.

## వేమనారాధ్యులు

సర్వద్రష్టుల జీవింపజేయు శక్తి గలవాడు. ఆగతానాగత పరిజ్ఞాత.

## మంచన పండితారాధ్యులు

విష్ణువిగ్రహమును కాశీవిశ్వేశ్వరాలయము వరకు నడిపించిన వారు.

## భరద్వాజ మహర్షి

పర్వతాకారమున నున్న వేదరాశినుండి మూడు గుప్పెడులు తీసి మూడు కుప్పలుగ పెట్టిన మహాత్ముడు. అవియే ఋగ్వేద, యజుర్వేద, సామవేదములు.

## రేవణారాధ్యులు

కంచి వరదరాజస్వామిశిరఃకంపనము వారించినవారు. మృతులను బ్రతికించు ప్రజ్ఞగలవాడు.

## మరుతారాధ్యులు

వీరభూపాలుడను రాజు శివలింగధారులకు 10 వేల మందికి కూలి యివ్వకుండ తన చెరువుకట్టకు మట్టితట్టలు మోయించు

చుండగా కనికరమున వారందరిని వెళ్ళిపొమ్మని చెప్పి తన బంగారు చేతికఱ్ఱతో ఆ తట్టలన్ని మోయించి తన మహిమను వెల్లడించిన మహాత్ముడు.

## నిర్వాణనిశ్రేణి

( గతసంచిక తరువాయి )

ముదిగొండ కొంతయారాధ్య విరచితము

శైవాచార్యవరేణ్యులెల్లఁ బును, త, చ్ఛాస్త్రంబులా మూలముల్
భావంబందు నెఱింగి మౌనివర స,ద్భావంబులన్ గాంచి వి
ద్యా వైదుష్యముతోడ ధర్మమును స,త్యంబైన సిద్ధాంతమే
శైవంబంచును లింగధారణము మో,క్షంబిచ్చునం చెంచిరా. 109

అనుమానింపక దాచనెంచక రహ,స్యంబంచు నెవ్వారికిన్
మనమొప్పంగను చెప్పకుండ నెటులో,మాయన్ ప్రవర్తింప కా
త్మను కన్నంతను శిష్యకోటికిని ని,త్యంబున్ ప్రసాదించి వా
రిని మోక్షార్హులు చేసినట్టి ఘనులర్చింపన్ ఫలంబిచ్చెడున్. 110

సన్యాసంబును లింగపూజనము మో,క్షంబివ్వ నర్హంబులౌ
అన్యంబింకొకటేదిలేదు శ్రుతిస,త్యంబన్న భావంబునన్
సన్యాసంబును లింగపూజనము దీ,క్షన్ సల్పెగాదే జగ
న్మాన్యుండై తగు నాదిశంకరులు న,మ్మన్ సాక్ష్యమిం కేటికిన్. 111

పరమాద్వైత శివానుభావ మహిమా,స్వాయత్తలింగార్చనా
పరతన్ నిచ్చలు ముక్తజీవుఁడయి జీ,వన్ముక్తుఁడై యాదిశం
కరు లాత్మీయ మనఃప్రసాదిత శివా,ద్వైత ప్రచారంబు ని
ర్ధరఁగావించె మరుంగు బడ్డదది స,త్యాన్వేషణాభావతన్. 112

శివునిఁ జీవులయందుఁ జేస్పుటకష్టుఁ, చిత్రంబు చింతింప వై
ష్ణవు లేరీతి ముకుంద సత్కృపను గాంచఁ జాలిరఁ గాని వి
ష్ణువు సాన్నిధ్యమునందు ముక్తదశతోఁ, నున్నప్పు డవ్వారికిఁ
శివునిఁగూర్చి ముకుందుఁడే మెఱుఁగగాఁ, జేయుఁ దదాధిక్యముఁ.

నేను శివస్వరూపమును, నిక్కముగా గనినట్లు చెప్పఁగా
లేను కనంగ లేమినన, లేను మదీయ మనోనురాగ సం
ధాన మొనర్చి కన్నటుల తన్మయతఁ జరియింతు ధాత్రిలో
నూనిన భక్తిశంభు హృద, యోత్సుఖ మెట్లగునట్టి రీతిగఁ. 114

తెలియనివార లెవ్వరిని, దేవుఁడటంచును గొల్చిరఁ మనం
బలరఁగ శంకరుం డొసఁగు, నాతని కాత్మ సమానరూపముఁ
దెలిసినవారు తన్విడచి, దేవుఁడటంచును గొల్వ నన్యుతా
నలరుచు భక్తభక్తుఁడని, యాతనికిచ్చు సమానలోకముఁ. 115

వేదంబుల్ తలక్రిందుగాఁ జదువనీ, విజ్ఞానమార్జింప నీ
వాదంబుల్ కడుసేయ నీ యుపనిష, ద్భావంబు గుర్తింప నీ
మోదంబందఁగఁ జేసి శంకరుని తా, మోక్షంబుఁ జెందంగ లే
డేదేనొక్క సుమంబొ పత్రమొ జలం, బే భక్తి నర్చింపకఁ. 116

నాలుగు బ్రహ్మసూత్రములు, నాలుగు వేదవచస్సు లేవియో
నాలుగు పెద్దశ్లోకములు, నాలుగుమాటలు చెప్పిరఁ సభఁ
శూలిమనంబు మెచ్చునె వి, శుద్ధమతిఁ గురుసత్కృపాప్తి ష
ట్కాల శివార్చనారతిని, గాక నికేటికి బూటకంబులఁ. 117

తాతలు తండ్రులుఁ హితులు, తత్కులపండితవర్యు లెవ్వడో
నీతిశుభంబు ధర్మము గ, ణించి పరంపరగాక తత్కుల
వ్రాతము మోక్షమందఁగల, పద్ధతిఁజూపిరి కాదటంచనఁ
చేతము విశ్వసించునొకొ, శతమయూఖ శిరస్కుఁడొప్పునే. 118

శాదన పెద్దవారినుడి, గౌరవమామజి విజ్ఞలక్షణం
బందురమందు గెల్చుటయు, భక్తిని తన్మహనీయ బోధ మ
ర్యాదను విశ్వసించి శివునర్చను చేసి సుఖంబుగాంచి ని
ర్వాదసుఖప్రదానుభవ, బ్రహ్మపథంబునఁ బోవ నెంచుడీ. 119

పలుకఁగ లేడొకో యున్నదున్నటుల మధ్వాచార్యుఁడే భీతి లో
పలవేధించెనొగాని భక్తునకు నెప్పట్టం దపాయంబెటుల్
గలుగంబోదని నమ్మి భక్తిసలుపంగా ధర్మమెందైన పై
గలదానిన్ హరి చెప్పడాయెను ధృతిన్ గావించెబో భాష్యముల్. 120

---

శ్రీపార్వతీ రాజరాజేశ్వరాభ్యాన్నమః

# శివస్తుతి

మల్లికార్జున పండితారాధ్యుల నిర్మల శంకరశాస్త్రిగారు

శ్లో॥ సేవే శ్రీ సురదానవాంతక మహా హాలాహలాఖ్యం విషం
భుక్త్వా భూషణ మద్భుతం పటుతరం కృత్వా స్వకంఠస్యతత్
రక్షన్ యః సకలాండకోటి జనతాం ప్రఖ్యాతనామాఽభవ
త్తంశంభుం నిఖిలామరార్చితపదం వందేఽహ మిష్టాప్తయే॥ ౧

శ్లో॥ గంగాప్రాప్త్యై సుకృతతపసం సాగరం రాజవర్యం
దృష్ట్వా సాక్షాత్కరుణితదృశా దత్తగంగం మహేశం ।
మిథ్యాదోషస్య దూరీకరణపరము నేర్గౌతమస్యాశు తుష్ట్వా
స్వీయాం గంగాం దదానం పరశివ మనిశం ప్రార్థయేభక్తకల్పమ్॥

శ్లో॥ రుద్రం పురాణం పరమేశమాద్యం
కైలాసవాసం గణనాథపుత్రమ్ ।

శ్రీ కార్తికే యాత్మజ మచ్యుతాద్యం
ముక్త్యైసదాశంభు మహం సమీడే॥ 3

శ్లో॥ ఆకాశమధ్యే సువిరాజమానం
చిదంబరే భావనయా ప్రసన్నమ్।
తమఃపరం చిన్మయమాత్మరూపం
సంప్రార్థయే పాపవిశోధనార్థమ్॥ ४

శ్లో॥ పంచాక్షరీవాచ్య మమేయభావ
మోంకారరూపం పరశక్తిపీఠే
లింగస్వరూపేహి సమర్చ్యమానం
మహేశ్వరారాధ్యపదం సమీడే॥ ౫

శ్లో॥ క్షీరం మాతులసన్నిధౌ విధివశాత్పీత్వా స్వగేహేచతత్
పృష్ట్వా మాతర మాదరా న్నహి తతో లబ్ధ్వావిభిన్నాత్మనే।
ఘోరం తప్తవతే శివాఖ్యమనునా క్షీరోదధిం దత్తవా
నార్తత్రాణచణఃశివో భవతు మేఽభీష్టార్థసంధాయకః॥ ౬

శ్లో॥ దక్షం భాగముఖం విధాయ గిరిజా మాజ్ఞాప్య దాక్షాయణీం
రక్షాం సాధుజనస్య దక్షిణముఖా ద్వ్యోధస్వరూపాం దదర్శ।
శిక్షాంచాపి విధాయకోఽసురతతేః కారుణ్యసింధుః ప్రమా
నార్తత్రాణచణః శివో భవతు మేఽభీష్టార్థసంధాయకః॥ ౭

శ్లో॥ అర్థకామధర్మ మోక్షదాయినే నమశ్శివాయ
వ్యర్థభావ శాపనోదనాయతే నమశ్శివాయ।
పుత్రపౌత్ర వంశవృద్ధికారిణే నమశ్శివాయ
సత్రయజ్ఞపూర్ణతానిదాన! తే నమశ్శివాయ॥ ౮



# శ్రీ నీలకంఠ భాష్యము

ఆంధ్రీకరణకర్త : శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల

నిర్మల శంకరశాస్త్రిగారు - నిర్మల (విద్యాభూషణ - సాహిత్యరత్న)

విజ్ఞాపన !

శ్రీ లోకారాధ్యులైన మహోపాధ్యాయ శివయోగి ముదిగొండ నాగలింగశాస్త్రిగారి "శివచింతామణిప్రభ" అను సంస్కృత వ్యాఖ్యానము ననుసరించి భాష్యార్థమును తెలుగునవ్రాసి శైవుల కందజేయ నుద్దేశించితిని. అందువలన శ్రీ శైవమహాపీఠాధిపతులు నలుబదియెనిమిదవ శైవపీఠవర్ధంతికి నన్నాహ్వానించి యీ శైవమత ప్రకాశికయందు వరుసగా ప్రచురింప ననుగ్రహించినవారు.

ఈ నా యుద్యమమునకు శైవులు సంతృప్తిపడి చదువుదురని విశ్వసించి పరమేశ్వరప్రీతి పూర్వక శైవకల్యాణపరంపర యేర్పడుటకై భాష్యాంధ్రలేఖనము ఉపయోగించుగాత యని ప్రార్థించుచున్నాను.

మఱియు శైవమహాపీఠమువారు సమగ్రముగ నిద్దాని నామోదించినట్లు ఈ పత్రికయందే తీర్మానమును చూడగలుగుదురని మనవి.

ఇట్లు భాష్యాంధ్రీకర్త

శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్యులవారి కృతియందు శారీరిక బ్రహ్మమీమాంస మొదటి అధ్యాయమున ప్రథమపాదముం దగు ఆంధ్రీకరణము.

మంగళాచరణ శ్లోకము

ఓన్నమోఽహంపదార్థాయ – లోకానాం సిద్ధిహేతవే
సచ్చిదానందరూపాయ – శివాయ పరమాత్మనే॥

శ్రీ నీలకంఠ శివాచార్యులవారు వేదములను, వేదాంగముల నభ్యసించి శ్వేతాచార్యులవలన బ్రహ్మోపదేశముఁ బడసియు తా నుద్దేశించిన బ్రహ్మసూత్రభాష్యము నిర్విఘ్నపరిసమాప్తిఁ జెందుటకు శిష్టాచారము ననుసరించి, అహంపదముతో చెప్పఁబడువాఁడు, మహేశ్వరుల ఉపాసనను సిద్ధింపఁజేయువాఁడు, సత్యము, జ్ఞానము, ఆనంద మున్ను స్వరూపములుగా కలవాఁడు పరమాత్మయు ప్రణవవాచ్యుఁడు నగు శివునకు నమస్కారము. అని మంగళము నాచరించియున్నవారు.

ఆస్తికులందఱికిని ప్రమాణమగు వేదరాశియందలి పూర్వభాగము- ఇహలోకఫలములను, పరలోకఫలములను నిరూపించునట్టిది; ఉత్తరభాగము- పరమపురుషార్థమైన మోక్షము నుపదేశించునట్టిది; ఉత్తరభాగ మనఁదగు ఉపనిషత్తుల సమన్వయార్థమును తెలుపఁదలచిన శ్రీ వేదవ్యాసభగవానులు రచించిన బ్రహ్మసూత్రములకు బోధాయన మహర్షి వృత్తిని వ్రాసియుండెను. బోధాయనుని తరువాత ననేకులు తమతమ యిష్టార్థములను కల్పించుటచే సూత్రములు కలుషితములైనందున కలిగిన వేదవ్యాసుని ఆవేదనఁ గుర్తెఱిఁగి పరమేశ్వరుఁడు శ్రీ నీలకంఠశివాచార్యరూపమైన అంశావతారమును పొందవలసివచ్చెను.

అహం పదార్థముతో ప్రియతమమగు ఇష్టలింగమును; "ఓన్నమః" "శివాయ" అను పదముల యర్థముతో శివషడక్షరీ మంత్ర - స్వరూపమగు ప్రాణలింగమును; పరమాత్మపదార్థముతో సర్వాంతరమగు భావలింగమును భావించవలెనని నిరూపించినట్టి శ్రీ నీలకంఠాచార్యులు పాశుపతవ్రతనిష్ఠులని తెలియుచున్నది.

జీవునియం దుపయోగింపఁబడు అహంపదము జీవాంతరాత్మయగు పరమాత్మయందు పర్యవసానముఁ జెందుచున్నయది. మఱియు అహంపదము శక్తిశివుల కూడికయగు పరబ్రహ్మను బోధించును. ఇట్టి అహంపదార్థమగునట్టిదే అన్నమయమగు స్థూలశరీరముఁ జెందియుండు

ఇష్టలింగ మనఁబఱగుచున్నయది. ఇష్టప్రాణభావలింగాను సంధానముఁ జేయువారికి నభిమతలోకము లందలి సుఖములఁ గలుగఁజేయువాఁడని "లోకానాం సిద్ధిహేతవే" అను పదము తేటపఱచుచున్నది.

లోకులనగా - లింగాంగసామరస్యము కలవారు. సిద్ధి యనగా ముక్తి; అద్దానిఁ బ్రసాదించువాఁడనియు చెప్పనచ్చును.

సర్వోత్కృష్టమగు ఆనందము లభించుట ముక్తిస్వరూప మనియు, పరమేశ్వరుఁడు నట్టి యానందము కలవాఁడై సద్రూపము నందును చిద్రూపమునందును వ్యాపించియుండుననియు 'సచ్చిదానంద రూపాయ' అను పదము విశదపఱచుచున్నయది.

"ఓమ్" అను బ్రహ్మవాచిశబ్దమువలన జగత్కారణము బ్రహ్మ యని తెలియుచుండుటవలన అశ్వాదికారణవాదంబును; "అహం పదార్థాయ" అనుటచే శివుఁడు శక్తివిశిష్టుఁడని విదితమగుటఁజేసి నిర్విశేషవాదంబును; "లోకానాం సిద్ధిహేతవే" అనుటవలన కర్మ జ్ఞానముల ఫలము నిరూపితమగుచున్నది. కావున కేవల కర్మవాదం బును; "సచ్చిదానంద రూపాయ" అను పదమువలన శూన్యవాదం బును; "శివాయ" అనుపదముతో ప్రాంచరాత్రాది వాదంబులును త్రోసివేయఁబడుచున్నవి.

సకల విద్యలందు నుత్కృష్టమగు శ్రుతిలో నుత్తమమగు రుద్రా ధ్యాయమున మధ్య విరాజమానంబగు పంచాక్షరియం దమరియుండు శివ శబ్దమునకు పాప పరిహారమునందు ఎంత శక్తి కలదో అన్ని పాప ములను చేయుటకు కలియుగమున శక్యముకాదు గావున నిట్టి మహో త్తమమైన శివ శబ్దమును ఈ శ్లోకమున చేర్చుటచే - భాష్యార్థ శ్రోత లకు వివిధ ప్రతిబంధములను తొలగించు శివనామశ్రవణము (ఇట) విహితమగుచున్నయది.

"శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వమన్య త్పరిత్యజ్య" అను శ్రుతి ననుసరించి "శివునికన్న నితరులైన దేవతలను (మానవాదులను ప్రకృతిని) విడనాడి మంగళకరుడైన శివు నొకనినే పూజించవలెను ప్రార్థింపవలెను ధ్యానింపవలె" నను నంశము బోధపడుచున్నది.

ఈ భాష్యములోని మొదటి యధ్యాయమందలి సర్వ వేదాంత సమన్వయము "ఓమ్" అనుటచే శివునియందే కలదనియు; రెండవ యధ్యాయమందలి శ్రుతివిరోధ పరిహారము "అహంపదార్థాయ" అనుటచే అహంపదముతో తెలుపఁబడు చిదచిత్తులందు వ్యాపించు పరమాత్మ - ద్వైతాద్వైత శ్రుతుల విరోధమును పోనాడుటకై సమస్త ప్రపంచ రూపముగల శక్తితో కూడియుండువాడని తెలుపఁబడుచున్న దనియు; మూడవ యధ్యాయమందలి సాధననిరూపణము "లోకానాం సిద్ధిహేతవే" అనుటఁజేసి ముక్తికి సాధనము శివానుసంధానమని గావింపఁబడినదనియు; "నాల్గవ యధ్యాయ మందలి ముక్తిఫల ప్రతిపాదనము "సచ్చిదానందరూపాయ" అను పదముతో సచ్చిదానందమే ముక్తి ఫలమని సూచింపఁబడిన దనియు గ్రహింపనగును.

పరమేశ్వరునికి సద్వితీయత్వము నంగీకరించునెడ ద్వైత శ్రుతులకు విరోధము వచ్చును. నద్వితీయత్వముఁ గ్రహించునెడ అద్వైత శ్రుతులు సార్థకములు కాకుండును. ఇట్టియెడ శివాద్వైత సిద్ధాంతము పై శ్రుతుల నన్నిటిని సమన్వయించునదై సమరసమగుచున్నయది.

(సశేషము)



# శివాలయ ప్రతిష్ఠ

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా సైదేపూడి అగ్రహారంలోని శ్రీ గంగాపార్వతీ మల్లేశ్వరస్వామివారి ప్రతిష్ఠలు ది 9–2–57 తేదీన జయప్రదముగ జరుపబడినవి. ఇందులకుగాను శ్రీతాడికొండ వీరభద్రయ్య అనే అరవింద పాదసేవానందంగారు – నేను మాత్రమే కలిసి వసూలుచేసిన చందామొత్తం రు 1941–2–0, బియ్యం రెండు బస్తాలు. అయిన ఖర్చు బియ్యంగాక రు 3018–1–6. ఇవి గాక దేవుని పంటలోనివి నాలుగుబస్తాల ధాన్యంగూడ వినియోగింపబడినవి. గాన రు 1076–15–6 అప్పుచేయబడినది. చందావేసిన భక్తులు దయచేసి త్వరలో తమ పైకం నాపేర పంపప్రార్థన.

ఇట్లు

కొంపల్లి హనుమంతరావు

రిటైర్డు ఇంజనీరు - సత్యనారాయణపురం

గుడివాడ



# శైవగ్రంథమాల

| | | | |
|---|---|---|---|
| 1. | సంధ్యావందనము | ... | 0—8—0 |
| 2. | ఆంజనేయ స్వరూపనిరూపణము | ... | 0—8—0 |
| 3. | భగవద్గీత | ... | 6—0—0 |
| 4. | శైవాహ్నికము | ... | 1—0—0 |

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు ఉత్తరము వ్రాయవలెను.

# శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అడ్రస్ :— 1

## ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వ రం గ ల్

అడ్రస్:— 2

## ముదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) దుగ్గిరాల

[ గుంటూరు జిల్లా ]

సూచన :— వ్యాసములు - ఉత్తరములు - బ్లాకులు - చందాధనము ఈ పై అడ్రస్సులలో నొకదానికి పంపింపవలెను.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ శాసనముచే ప్రచురింపబడు

సచిత్ర మాసపత్రిక


| సంపుటము | హేవళంబి సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౧ | 15—3—1957 | ౪ |



సంపాదకులు :

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.

*Principal Ayurvedic college & Superintendent*

*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు :

ముదిగొండ రామలింగశాస్త్రి

భాషాప్రవీణ.


శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థతతిప్రభాసికా
సందేహసందోహమహానిరాసికా ।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా
జయత్వియం శైవమతప్రకాశికా ॥


శ్రీ శైవ మ హా పీ ఠ ము

స్టేషను రోడ్డు, శ్రీ విశ్వేశ్వర దేవాలయము

వరంగల్

## విషయసూచిక

# శైవమత ప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమునఁ బ్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవళంబినామ సంవత్సరము | సంచిక |
| --- | --- | --- |
| ౧ | 15—8—1957 | ౪ |

## సంపాదకీయము

ఆరాధ్యులలోఁ బ్రాచీనులెల్లరు సంస్కృత భాషా పాండిత్య దురంధరులే. వీరికి గురుత్వము ప్రధాన ధర్మము. శిష్యులకు మంత్రోపదేశ మొసగి శివలింగ దీక్షితుల నొనర్చి శైవాచారముల బోధించుటయే ప్రధానకృత్యము. ఆంధ్రదేశమందంతటను శిష్యవర్గము గలిగి పాశుపతదీక్షా దీక్షితులజేయు ద్వాదశారాధ్యగోత్ర సంతతివారే ఆరాధ్యులని వ్యవహరింపబడుచున్నారు.

సప్తర్షి గోత్ర సంజాతులయి శివదీక్షనొంది యిష్టలింగ - ప్రాణలింగ - భావలింగముల మూడింటిని పూజించు బ్రాహ్మణ సమూహామునకే ఆరాధ్యనామమును వర్తించుచున్నది.

ఈ 20 వ శతాబ్దమున శైవసంస్థానాధిపతులయి శివలింగపూజ - స్వేష్టలింగమున నిరంతర మాచరించుచు తమ యశశ్చంద్రికల దిగంత వ్యాప్తముగా నొనర్చిన వారిలో కీ॥ శే॥ కందుకూరి బసవరాజుగారు అగ్రతాంబూలమందుకొన్నారు. శ్రావణీవిద్వత్సభను గంజాంమండలమునందుగల ఉర్లాం సంస్థానమున జరుపుచుండువారు. బసవరాజుగారి కాలమునను - వారి యనంతరము వారి సతీమణి

మహాలక్ష్మమ్మగారి కాలమందును - తదనంతరము రాజా లక్ష్మి ప్రసాదరావుగారి యాజమాన్యముక్రిందను బసవరాజుగారి స్వగ్రామమైన ఉద్గాం సంస్థానము పండితుల వేదశాస్త్ర ఘోషలతో, ప్రతిధ్వనించుచుండెడిది. ప్రతివత్సరము శ్రావణికి 10 వేలు కవిపండిత సన్మానముక్రింద ఖర్చు చేయబడుచుండెడిది. 2 వేలమందికి ఆశ్వీజ నవరాత్రులలో కార్తికములో అన్నదానము జరిపి వస్త్రదానము చేయబడెడిది. చాగంటి నందికేశ్వరశాస్త్రిగారు ఇవటూరి నందికేశ్వరశాస్త్రిగారు శాస్త్రపరీక్షకులుగను, చాగంటి వీరభద్రావధానులుగారు వేదపరీక్షాధికారులుగ నుండెడివారు. నానాదేశాగత పండితులకు 500 మందికి సన్మానము జరిగెడిది. రాజా లక్ష్మి ప్రసాదరావు జమీందారు శైవమహాసభకు రు. 1000-0-0లు, విద్యార్థులకు రు. 150-0-0, గ్రంథభాండాగారమునకు రు. 250-0-0 లు యిచ్చియున్నారు.

మన సంఘములో శ్రీమంతులు - ఉదారులు - నేడు కూడ పలువురు గలరు. అట్టివారందఱు గత శైవసభాచరిత్రను - సింహావలోకనముచేసి ప్రస్తుతస్థితిగతుల విచారించుకొని శైవపీఠ మూల ధనార్జనకై బద్ధకంకణులుకండని మా ప్రార్థన. సలహాలొసంగుడని మా విజ్ఞాపన - ఏలయన:-

సంఘే శక్తిః కలౌ యుగే -

---

# శ్రీ శైవమహాసభ పాలకవర్గ తీర్మానములు

శ్రీ శైవమహాపీఠమునకు ది 16-6-1957 నాడు సమావేశమైన సభలో నన్ను కార్యదర్శిగా యెన్నుకొనినందున - ఈ క్రిందివారిని నేను పాలకవర్గముగ నియమించుచున్నాను.

1. శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు

2. శ్రీ అత్తలూరి వెంకటసుబ్బారావుగారు
3. శ్రీ కందుకూరి వటుకభైరవమూర్తిగారు
4. శ్రీ ముదిగొండ శంకరశాస్త్రిగారు
5. శ్రీ చాగంటి భాస్కరలింగశాస్త్రిగారు

ముదిగొండ కోటీశ్వరరావుగారిని పీఠమునకు సహాయ కార్య దర్శిగా నియమించడమైనది.

గత సంవత్సరమువలెనే శైవశాస్త్రపరీక్షలు 1957 నందు జరుపుటకుగాను శ్రీ ముదిగొండ రామలింగశాస్త్రిగారిని, శ్రీ కొంపల్లి ఆంజనేయశాస్త్రిగారిని నిర్వాహకులుగ నియమించడమైనది.

శ్రీ శైవమహాపీఠ కార్యస్థానం -
వరంగల్
ది 16-6-1957

ఇట్లు
కార్యదర్శి
శివపురపు రామలింగం

---

# శైవాచార్యులు శైవులగోత్రాములు

(శ్రీ ముదిగొండ రామలింగశాస్త్రిగారు-ఈమని)

## రేవణాచార్యాదిస్తుతి

శ్లో. రేణుకేశమఖిలార్థసిద్ధిదం
లింగజంగమ గురు స్వరూపిణం
చిత్తవాణి సుతనోభజస్వమే
చింతనేన నుతినానుపూజయా॥

శ్లో. షట్స్థలజ్ఞానసంపన్నం । షడ్లింగాంగ వివేకినం
రేవణాసిద్ధయోగీంద్రం । గురుం వందే యతీశ్వరం॥

శ్లో. శివయోగరతం సిద్ధం । శైవశాస్త్రవిచక్షణం
వానప్రస్థంచ యోగీంద్రం । వందేహం మరుల ప్రభుం॥

శ్లో. ఏకమేవపరం బ్రహ్మ । వదంతం బ్రహ్మచారిణం
ఏకోరామ మహం వందే । శివలింగాంగతత్పరం॥

శ్లో. శ్రౌత స్మార్త సమాచారం । పండితారాధ్య దేశికం
గృహిణం సర్వ ధర్మజ్ఞం । వందే ప్రత్యక్షశంకరం॥

శ్లో. కాశీవిశ్వేశనికట । మటయిత్వాహతాద్ధరిం
బభంజ విష్ణు భక్తాంస్తం । మన్యే మంచన పండితం॥

శ్లో. గౌతమీతీరవిభ్రాజ । ద్దక్షవాటీ పురే స్థితం
శ్రీపారాధ్యాత్మజం వందే । మల్లికార్జున పండితం॥

శ్లో. గంధర్వభూత శత సప్తక శాపమోక్ష
దానప్రభావ జగ దద్భుతకీర్తి భాజం
విశ్వేశ లింగ నిజ గర్భ జనిం మహాంతం
వందేహమీశ నిభ ముద్భట దేశికాఖ్యం॥

శ్లో. శ్రీమతేదేశి కేంద్రాయ । స్వాత్మానంద ప్రకాశినే
వేమనారాధ్య గురవే । నమస్తేస్తు మహాత్మనే॥

శ్లో. శ్రీమత్కోటి ఫలీ పురీ వర శివప్రాసాద సంవాసినం
లింగాంగైక్య విమర్శ దర్శన విదం వేదార్థ సంవేదినం
శశ్వత్స్థాపిత శైవ ధర్మ సమయం శిష్య ప్రశిష్యాన్వితం
విశ్వారాధ్యగురుం నమామి సతతం విశ్వాభి వంద్యం విభుం.

(శైవ పంచకమునుండి)

## ద్వాదశారాధ్యులు

| | |
|---|---|
| ఉద్భటారాధ్యులు<br>కోటిపల్యారాధ్యులు<br>వేమారాధ్యులు | ఆరాధ్య త్రయము |
| మంచన పండితులు<br>శ్రీపతి పండితులు<br>మల్లికార్జున పండితులు | పండిత త్రయము |
| రేవణసిద్ధులు<br>మరుళసిద్ధులు<br>ఏకోరామసిద్ధులు | సిద్ధత్రయము |
| నీలకంఠాచార్యులు<br>భట్ట భాస్కరాచార్యులు<br>హారదత్తాచార్యులు | ఆచార్య త్రయము |

శ్లో. ఉద్భటః కోటిపల్లిశ్చ వేమారాధ్య ప్రకీర్తితః
మంచనశ్శ్రీపతిశ్చైవ మల్లికార్జునపండితః॥

ఉద్భటారాధ్యులు – తద్వంశీకులు – ముదిగొండవారు
కోటిపల్యారాధ్యులు (విశ్వారాధ్యులు) ఇవటూరివారు
పాల్కురికివారు
పాలకుర్తివారు
పాల్గుమివారు

| | | |
|---|---|---|
| వేమారాధ్యులు | ,, | ములుగువారు |
| మంచన పండితారాధ్యులు | ,, | శివలెంకవారు |
| శ్రీపతి పండితారాధ్యులు | ,, | శ్రీపతి పండితారాధ్యులవారు |
| | ,, | (పులివర్తి) కాశీనాథునివారు |
| మల్లికార్జునపండితారాధ్యులు | ,, | కాచాపురం వారి మొదలు – |
| | ,, | మూటకోడూరువారి వఱకు |

| | | |
|---|---|---|
| | ,, | గల యింటిపేర్లు గల వారు |
| రేవణసిద్ధులు | ,, | (యలకుర్తి) కాశీనాథునివారు |
| | ,, | చాగంటివారు |
| మరుళసిద్ధులు | ,, | తాటికొండవారు |
| ఏకోరామసిద్ధులు | ,, | మల్లంపల్లివారు |

శైవులు (లింగధారి బ్రాహ్మణులు) యే యే గృహనామములతో తెలియుచుండిరో - ఆ యా ఇంటి పేర్లను - ఆ యా గోత్రములను నీ క్రింద వ్రాయుచున్నాడ.

| ఇంటిపేరు | గోత్రము | |
|---|---|---|
| 1. ముదిగొండవారు | భారద్వాజ | సగోత్రము |
| 2. తాటికొండవారు | ,, | ,, |
| 3. కొమర్రాజువారు | ,, | ,, |
| 4. బుద్ధిరాజువారు | ,, | ,, |
| 5. కామరాజుగడ్డవారు | ,, | ,, |
| 6. వీరవెల్లివారు | ,, | ,, |
| 7. ఓగిరాలవారు | ,, | ,, |
| 8. ఆరికరేవులవారు | ,, | ,, |
| 9. రాయనపాటివారు | ,, | ,, |
| 10. వడ్లమన్నాటివారు | ,, | ,, |
| 11. అండలూరివారు | ,, | ,, |
| 12. ఇవటూరివారు | కాశ్యప | సగోత్రము |
| 13. పాల్కురికివారు | ,, | ,, |
| 14. పాలకుర్తివారు | ,, | ,, |
| 15. పాల్గుమివారు | ,, | ,, |
| 16. రెంటాలవారు | ,, | ,, |

| ఇంటిపేరు | గోత్రము |
|---|---|
| 17. బెండపూడివారు | కాశ్యప సగోత్రము |
| 18. తాళ్ళూరివారు | ,, ,, |
| 19. కంచివారు | ,, ,, |
| 20. కనపర్తివారు | ,, ,, |
| 21. ములుగువారు | కౌండిన్య సగోత్రము |
| 22. తాడిగడపవారు | ,, ,, |
| 23. శివపురపువారు | ,, ,, |
| 24. కొంపల్లివారు | ,, ,, |
| 25. నందిగామవారు | ,, ,, |
| 26. కొండపాటూరివారు | ,, ,, |
| 27. ధూపగుంటవారు | ,, ,, |
| 28. సింగరాజువారు | ,, ,, |
| 29. మాదలవారు | ,, ,, |
| 30. కానూరివారు | ,, ,, |
| 31. అయ్యగారివారు | ,, ,, |
| 32. శ్రీపతి పండితారాధ్యులవారు | కౌశిక సగోత్రము |
| 33. కాశీనాథునివారు (పులివర్తివారు) | ,, ,, |
| 34. అత్తలూరివారు | ,, ,, |
| 35. శివలెంకవారు | సాలంకాయన సగోత్రము |
| 36. మల్లికార్జున పండితారాధ్యులవారు - | గౌతమ సగోత్రము |
| 37. కాచాపురంవారు | ,, ,, |
| 38. నిర్మలవారు | ,, ,, |
| 39. జగిత్యాలవారు | ,, ,, |
| 40. కొండాపురంవారు | ,, ,, |
| 41. చప్పివారు | ,, ,, |

| ఇంటిపేరు | గోత్రము | |
|---|---|---|
| 42. ఇంకొల్లువారు | గౌతమస | గోత్రము |
| 43. తోటచెర్లవారు | ,, | ,, |
| 44. కారంపూడివారు | ,, | ,, |
| 45. మడిపల్లివారు | ,, | ,, |
| 46. గుడిపాటివారు | ,, | ,, |
| 47. పత్తిపాటివారు | ,, | ,, |
| 48. వెలుగోటివారు | ,, | ,, |
| 49. గిద్దవారు | ,, | ,, |
| 50. విద్యానగరంవారు | ,, | ,, |
| 51. కాళేశ్వరంవారు | ,, | ,, |
| 52. గుండివారు | ,, | ,, |
| 53. వెలగడపవారు | ,, | ,, |
| 54. రామగిరివారు | ,, | ,, |
| 55. ఘట్టెపల్లివారు | ,, | ,, |
| 56. అంబారుపేటవారు | ,, | ,, |
| 57. కొడిమేలవారు | ,, | ,, |
| 58. ముత్యంపేటవారు | ,, | ,, |
| 59. కోడూరువారు | ,, | ,, |
| 60. మానకొండూరువారు | ,, | ,, |
| 61. విశ్వపతివారు | ,, | ,, |
| 62. ముక్తికోడూరువారు | ,, | ,, |
| 63. మూటకోడూరువారు | ,, | ,, |
| 64. శిరిపురపువారు | ,, | ,, |
| 65. పతానేనివారు | ,, | ,, |
| 66. విశ్వాత్ములవారు | ,, | ,, |

| ఇంటిపేరు | గోత్రము |
|---|---|
| 67. కాశీనాథునివారు (యలకుచ్చు) | అత్రేయ సగోత్రము |
| 68. చాగంటివారు | ,, ,, |
| 69. ముక్కువారు | ,, ,, |
| 70. ఉప్పులూరివారు | ,, ,, |
| 71. యథావాక్కులవారు | ,, ,, |
| 72. సోమరాజువారు | ,, ,, |
| 73. జోస్యులవారు | ,, ,, |
| 74. మల్లంపల్లివారు | హరిత సగోత్రము |
| 75. పాల్కురికివారు | ,, ,, |
| 76. పులిపాకవారు | ,, ,, |
| 77. తుమ్మలపల్లివారు | ,, ,, |
| 78. సోమవరపువారు | ,, ,, |
| 79. శివదేవునివారు | శ్రీవత్స సగోత్రము |
| 80. తుళ్లూరివారు | ,, ,, |
| 81. కొమిరిపూడివారు | ,, ,, |
| 82. అన్నదేవరవారు | ,, ,, |
| 83. ఆదిరాజువారు | ,, ,, |
| 84. మూలంపల్లివారు | ,, ,, |
| 85. ఛేతపూడివారు | ,, ,, |
| 86. దామరాజువారు | ,, ,, |
| 87. బీపేటవారు | ,, ,, |
| 88. యద్దన్నపూడివారు | ,, ,, |
| 89. తుర్లపాటివారు | కణ్వ సగోత్రము |
| 90. చామర్తివారు | ,, ,, |
| 91. భండారువారు | పరాశర సగోత్రము |

| ఇంటిపేరు | గోత్రము |
| --- | --- |
| 92. బొమ్మకంటివారు | పరాశర సగోత్రము |
| 93. కొత్తలవారు | 〃 〃 |
| 94. గూడూరువారు | వసిష్ఠ సగోత్రము |
| 95. కామన్నవారు | 〃 〃 |
| 96. కంచికూరివారు | లోహిత సగోత్రము |
| 97. గాదెవారు | విష్ణువర్ధన సగోత్రము |
| 98. బండావారు | అగ్నివైశ్య సగోత్రము |
| 99. కొలువలివారు [illegible] | 〃 |
| 100. గుడిమెళ్ళవారు | 〃 〃 |
| 101. తక్కెళ్ళపాటివారు | 〃 〃 |
| 102. కుమ్మనపల్లివారు | 〃 〃 |
| 103. కాశీనాథంవారు | 〃 〃 |
| 104. పీతాంబరంవారు | 〃 〃 |
| 105. కొండపాటూరివారు | 〃 〃 |
| 106. పాంకోళ్ళవారు | 〃 〃 |
| 107. పెరిసేపల్లివారు | 〃 〃 |
| 108. కోడిమల్లివారు | 〃 〃 |
| 109. నిడమర్తివారు | 〃 〃 |
| 110. మొలకుర్తివారు | 〃 〃 |
| 111. గండ్రంవారు | 〃 〃 |
| 112. చెన్నాప్రగడవారు | 〃 〃 |
| 113. నాగలూరివారు | 〃 〃 |
| 114. పిడుపర్తివారు | 〃 〃 |
| 115. ఈమూరివారు | 〃 〃 |
| 116. కొండగుడివారు | 〃 〃 |

కాశీనాథునివారిలో రెండు తెగలు గలవు. పెదపులివఱ్ఱు గ్రామమందునున్న కాశీనాథునివారు శ్రీపతి పండితారాధ్యుల సంతతివారు. వీరిది కౌశికసగోత్రము. యలకుఱ్ఱులోనుండు కాశీనాథునివారు రేవణాసిద్ధులసంతతివారు. వీరిది ఆత్రేయసగోత్రము.

పాల్కురికివారిలో నొకరు సోమనారాధ్యులు. కోటిపల్లారాధ్యుల సంతతివారు. ఇవటూరివారి వంశీకులు వీరిది కాశ్యపసగోత్రము. మల్లికార్జున పండితారాధ్య కృతి శ్రోతయు - పాల్కురికి సోమనారాధ్యునిబావయునగు పాల్కురికి సూరనామాత్యుడు హారితసగోత్రోద్భవుడు.

మల్లికార్జున పండితారాధ్యుల కాలవంశీకులైన - కాచాపురం వారు మొదలు మూలకోడూరువారి వఱకుగల యింటిపేర్లు గలవారందఱును జోస్యులవారును - గాదెవారును - ఋగ్వేదశాఖీయులు. మిగతా వారందఱు యజుశ్శాఖీయులు.

శివదేవునివారు - గణపతిదేవునిగురువగు విశ్వేశ్వర శివదేశికుని సంతతివారు.

తుళ్లూరివారు - కొమిరిపూడివారు గణపతిదేవుని మంత్రి పుంగవుండును - విశ్వేశ్వర శివదేశికుని సోదరుడునైన శివదేవయ్య సంతతివారు.

అత్తలూరివారు ప్రతాపరుద్రుని మంత్రి శిఖామణి యగు శరభాంకుని సంతతివారు.

ములుగువారిలో ఇభంది ములుగువారనియు - మంచి ములుగువారనియు రెండు భేదములు గలవు. ఇరువురి గోత్రము కౌండిన్యసగోత్రమే. ఇభంది ములుగువారు మాత్రము భారద్వాజ గోత్రీకులతో సంబంధములు చేయరు.

ఏయే గోత్రములకు యే యే ప్రవరగలదో యద్దానిని నీ క్రింద వివరించుచున్నాడ.

| గోత్రము | | ఋషులు |
|---|---|---|
| భారద్వాజసగోత్రము | – | అంగీరస – బార్హస్పత్య – భారద్వాజ |
| కాశ్యపసగోత్రము | – | కాశ్యప – ఆవత్సార – నైధ్రువ |
| కౌండిన్యసగోత్రము | – | వాసిష్ఠ – మైత్రావరణ – కౌండిన్య |
| కౌశికసగోత్రము | – | విశ్వామిత్ర – అఘమర్షణ – కౌశిక |
| సాలంకాయనసగోత్రము | – | విశ్వామిత్ర – అఘమర్షణ – సాలంకాయన |
| గౌతమసగోత్రము | – | ఆంగీరస – ఆయాస్య – గౌతమ |
| ఆత్రేయసగోత్రము | – | ఆత్రేయస – అర్చ్యనానస – శ్యావాస్య |
| హారితసగోత్రము | – | హారిత – అంబరీష – యవనాశ్వ |
| శ్రీవత్ససగోత్రము | – | భార్గవ – చ్యవన – ఔర్వ – ఔప్లవాన – జామదగ్ని |
| కణ్వసగోత్రము | – | అంగీరస – అజామేళ – కణ్వ |
| పరాశరసగోత్రము | – | వాసిష్ఠ – శక్తి – పరాశర |
| వసిష్ఠసగోత్రము | – | వసిష్ఠ – వాసిష్ఠేంద్రియ – శక్తిమన్య – పరాభవ – సంకృతి – పూలిమాష – గౌరీహిత |
| లోహితసగోత్రము | – | విశ్వామిత్ర – దేవరాత – చికిత |
| అగ్నివైశ్యసగోత్రము | – | ఆంగీరస – బార్హస్పత్య – భారద్వాజ కుక్కువ – అగ్నివైశ్యస |
| విష్ణువర్ధనసగోత్రము | – | ఆంగీరస – పవరకుత్స – త్రాసతస్య |

పరాశరసగోత్రమువారిలో ద్వాదశాష్షేయము వారున్నారు. బొమ్మకంటివారు ద్వాదశాష్షేయులే.

★

# శైవకవిచరిత్ర

## ముదిగొండ కొండయారాధ్యులు

ముదిగొండ రామలింగశాస్త్రిగారు (ఈమని)

కొండయారాధ్యులు ఉద్భటారాధ్య సంతతికిఁ జెందినవారు. తండ్రి వీరభద్రారాధ్యులు – తల్లి అంబమ్మ. ఆరాధ్య బ్రాహ్మణులు – భారద్వాజసగోత్రీకులు. స్వగ్రామము తెనాలి తాలూకా – ఈమని.

వీరభద్రారాధ్యుల ప్రథమ భార్య సుబ్బమ్మ. చిన్న తనమందే యామె చనిపోవుటచే వారు ద్వితీయ వివాహము చేసికొనిరి. ఆమెయే అంబమ్మ. ఆమెకు నొక కుమారుడుఁగల్గెను. వారే కొండయారాధ్యుల వారు. అంబమ్మయు దీర్ఘకాలము జీవించలేదు. అందువలన వీరభద్రారాధ్యులవారు తృతీయ వివాహము చేసికొనిరి. ఆమె పేరు జాలమ్మ. ఆమెకు కోటయ్యశాస్త్రి – మల్లికార్జునరావు – బసవయ్య అను మువ్వురు కుమారులును – బసవమ్మ – అన్నపూర్ణయను నిద్దరు కుమార్తెలును గల్గిరి.

వీరభద్రారాధ్యులవారిది పండిత వంశము. ప్రథమ పుత్రుఁడగు కొండయారాధ్యులవారు నిర్వాణ నిశ్రేణియను నొక గ్రంథమును రచించెను. అందు 132 పద్యములుగలవు. అది యొక భక్తిరస ప్రధానమగు మత గ్రంథముగ నొప్పారుచున్నది. పద్యములు హృదయంగమములై వెలయుచున్నవి. శైవులు ముఖ్యముగ చదివి తెలిసికొనఁదగిన మత విషయము లెన్నియో యందుఁగలవు. ముముక్షువులకు నిది మార్గోపదేశిని యనుటలో సందేహములేదు.

రెండవకుమారుఁడగు కోటయ్యశాస్త్రిగారు – శైవసర్వస్వము మున్నగు మత గ్రంథములను రచించి పండిత మాన్యులై వెలయుచున్నారు. మూఁడవకుమారుఁడగు మల్లికార్జునరావుగారు ప్రస్తుతం

హైదరాబాదునందు ఆయుర్వేద కాలేజీలో ప్రిన్సిపాలుగారు - ఆయు ర్వేద హాస్పిటల్లో సూపరింటెండెంటుగాను పనిచేయుచు ఆంధ్ర ప్రదేశ్‌లో విఖ్యాతి గడించి యున్నారు. నాల్గవ కుమారుడు బసవయ్యా గారు స్కూలు టీచరుగానుండి యున్నారు.

కొండయారాధ్యులవారి భార్య లింగాంబ. వారికి జ్వాలాపతి లింగశాస్త్రి - విశ్వనాథశాస్త్రియను నిరువురు కుమారులును - సుబ్బమ్మయను కుమార్తెయు జన్మించిరి.

పండితవంశ సాంప్రదాయకులగుట కతన జ్వాలాపతిలింగశాస్త్రి పండితుడును కవియునై - విఘ్నేశ్వర కళ్యాణం మున్నగు పద్య గ్రంథముల నాంధ్రమునందును - భక్తకర్ణామృతం మున్నగు గ్రంథ ముల సంస్కృతమునందును మొత్తం 40 గ్రంథములు రచించి పేరంది యున్నారు. వీరిటీవల కాళిదాసునిగూర్చి వ్రాసిన శ్లోకముల చూచి అఖిల భారత సాహిత్య యకాడమీవారు వీరిని బహూక రించిరి. శతావధానము చేయుటచే శతావధాని యను బిరుదము గల్గెను. శైవసభవారు కవిభూషణ బిరుదు నిచ్చిరి. జ్యోతిర్విద్యా విశారదులై జ్యోతిష్యమునందును వీరు ప్రజ్ఞగలవారై వెలయు చున్నారు.

ఇక రెండవవారు విశ్వనాథశాస్త్రిగారు సంస్కృతాంధ్రాంగ్ల హిందీభాషలయందనర్గళ పాండిత్యమును స్వతస్సిద్ధముగ సంపాదించు కొని మేధావియై వాసి గాంచి యున్నారు.

కొండయారాధ్యులవారు జీవించినది 33 సంవత్సరములు మాత్రమే వారు నిర్వాణ నిశ్రేణిని మాత్రము భక్తవర్యుల కిచ్చి విరోధికృత్సంవత్సర ఆశ్వీజ శు ౫ లు శివసాయుజ్యమునందిరి.

## నిర్వాణనిశ్రేణి

(గతసంచిక తరువాయి)

ముదిగొండ కొండమారాధ్య విరచితము

మానసమందు సోదసస,మాట పయింగల కోపమిట్లు తా
మానజ్వరాయఁజేసె కలయర్థ మెఱుంగఁడె యెట్లొ వైష్ణవుల్
మేనునుపిసి విష్ణులయి,మిన్నక కొల్చుచు నుండఁ జెప్పఁగాఁ
గానఁడె శైవఁగల్గు ననుకంపను విష్ణువలంచు నెంచెనో, 121

మానవులందఱున్ జననమాత్రము చేత సమానులైన వి
ద్యానయశీల ధర్మములయందలి భేదము కల్మివాసు ని
ర్వాణపథంబులందు నవపద్ధతి ద్రొక్కుట యుక్తమయ్యె నె
ట్లైన చతుర్థతత్త్వ శివునందున భేదముచూప నేర్తురే. 122

శివసాన్నిధ్యమునందు ముక్తపశులై,శీతాంశుమౌళిన్ సదా
స్తవమున్ సల్పుచు ప్రోలనుండః వృషభేశస్వామికిన్ గల్గు త
త్త్వవయేమో హరిముఖ్యులౌ సురల మ్రొక్కులన్ గాంచుచున్ ప్రేమ ని
త్య విలాసంబుల నుండుగా నిగమసిద్ధాంతం బిదే పాటిదో. 123

పరమంబైన రహస్యమౌనిది నిజప్రారబ్ధమెల్లన్ జనన్
హరుఁడయ్యున్ నిజరూపధారియయి భక్తాగ్రేసరుం డెప్పుడున్
హరుసేవింపఁ దలంచుఁగాని తను బ్రహ్మాస్మీతి వాక్యంబు ని
ద్దురలోఁగూడఁ దలంపఁడయ్యది ప్రమాదోద్భూతిపై యుండుటన్.

సరిలేనట్టి చతుర్థతత్త్వమగు నీశానున్ భవానీ పతిన్
గురుకారుణ్యముచే నెఱింగి మది సంకోచంబు లేకుండ త
త్కరమందున్ గను చిష్టలింగమును నేకాలంబు పూజింప దు
ష్కర మేమున్నది తాను భక్తులకు మోక్షంబివ్వఁగాఁ జాలెడిన్. 125

కలలో జాగ్రతలో వినోదములలో, గ్రంథంబులో నాగమం
బులలోనం బ్రసిద్ధులైన భక్తకథలన్, పూర్వాపర వ్యత్యయం
బులు మాన్పించినవాని సత్యపథముం, బోధింపఁగా నెంచు భ
క్తుల సన్మార్గము దీని నమ్మిచన నెగ్గుల్ గల్గవే నాకునున్. 126

శివభక్తాగ్రణి వంకదేవుఁడిసిరి చర్చింపఁగఁ దద్దీతులన్
భవకోటుల్ గడిపోవ్రవారి యెడ లోపంబుల్ విచారించుచో
భవ్యస్త్రైవారు ప్రసక్తింబునకుఁ ద్రోవన్ గానఁగా లేక యీ
జనులన్ బుట్టుచుఁ జచ్చుచుందురు జగద్వ్యాపార సంబద్ధులై. 127

శివుఁడే బిడ్డకుఁ దాతయై కొలుచుటన్, జేకూరె మీ కద్ది యం
చవనిన్ హాస్యము పల్కువారికిఁ దదర్థ శ్రీమహాసౌఖ్య వై
భవమే తాదృశమే యెఱుంగ పృథివీపాలుండు భోగించు వై
భవమున్ గానఁగఁ జేయునే ప్రజకు నెవ్వండెంచు లేదంచిలన్. 128

నాపను నిర్వాదిన్నిది కనుంగవ కింపగు నిందు మెట్టులన్
ధీరత నెక్కి యొక్కొకటి, దివ్యసుఖానుభవంబు నందుచున్
నేవపుతో శివున్ గొలిచి నిల్చిన సత్కృపఁ జూచి యాతఁడే
దీసుచు నిందునందును మధించెడు సంశయమేల భీతిలన్. 129

ననుఁగనినట్టి తల్లి చిననాటనె అంబమ మోక్షమందె నన్
తనతలితండ్రి యిర్వాసను, తానయి పెంచిన తండ్రి పుణ్యులన్
దనఘుఁడు వీరభద్రయ మహాత్ముఁడు తత్పద యుగ్మమందునన్
మనమలరంగ నీకృతి సమర్పణఁ జేసితి భక్తి తృప్తితోన్. 130

అనుపమభక్తి భక్త చరణాబ్జముల న్మదిలోన నమ్మి త
ద్ఘన కరుణాప్రసాదమునఁ, గల్గినభావము లెల్ల పద్యరూ
పానరఁగ జేసినాడ తన,యోక్తులు తండ్రులకెట్లు సంతసం
బొనరఁగ నిచ్చునట్టులె మదుక్తులు శైవులఁ దృప్తిఁ జేయుతన్. 131

ఆరోహించుచో నొక్కమెట్టు పదిలోనాహ్లాదముల్ జెందుచున్
దూరంబందున సంస్కృతి స్థితమహాదుఃఖంబులన్ వీడుచున్
పారంబౌ తుదిమెట్టునెక్కి గిరిజాప్రాణేశుఁజేపట్టి క
న్నీరున్ దుస్సచు ధాత్రినిల్చితి నిటుల్, నిర్వాణ సిద్ధేశికన్. 132

# శివస్తుతి వృత్తాష్టక స్తోత్రము

నిర్వేద ప్రకాశస్థ పండిత, నిర్మల శంకరశాస్త్రి

శ్లో. పుణ్యాస్య పాపస్యచ భోగకాలే
శంభోస్థిరశ్శస్యా ద్వరభక్తిభావః
శ్రీ రాజరాజేశమహాప్రసాదా
జ్జనుః కృతార్థం నిజరూపదర్శి ॥ ౧

శ్లో. గణేశ్వరే నందిని కార్తికేయే
శ్రీ వీరభద్రేచ మృకండుసూనౌ
రాజేశ్వరే దాశరథౌ చతుర్ముఖే
ప్రదర్శితం ప్రేమభరం సుకాంక్షే ॥ ౨

శ్లో. ప్రారబ్ధతో మేంఽగవిమోచనాత్పరం
స్వర్గాది లోకేషు నివాససంభవః
తత్రాఽపి నిర్నిద్రమహోగృహోత్సరం
వస్యాన్నివృత్తో దయయా మహేశః ॥ 3

శ్లో. సందేశపత్రై రధిగమ్యవార్తః
ప్రవక్తృనతీశ్చ శృణోమి సమ్యక్
హారాత్పరిత్యక్త శివార్చనోఽహాం
దూయే సమాధానవియుక్తచేతాః ॥ ౪

శ్లో. దైవాత్ప్రమాసీతవిధింతు శశ్వత్
ప్రమాస్త్ర మిహాహే శివచేష్టితాజ్ఞః
సర్వం శివాధీనమితీశ! భావం
గోప్త్రుంచయోగ్యో నభవామి దైవాత్ ॥ ౫

శ్లో. భోగ్యస్య భోక్తుః పరియోజితుః రైవ
శివస్య లీలా మవిజానతో మే
కథంచిదారాధ్యపదం స్వలోకే
భవేచ్ఛయా సంభవతీతి మన్యే ॥ ౬

శ్లో. కదాచిదార్త ప్రణమామి శంభుం
కదాచిదాత్మేష్టఫలస్య హేతోః ।
యాగం కదాచిద్వితనోమి భక్త్యా
పూజాం కదాచి త్పరికల్పయామి ॥ ౭

శ్లో. ధ్యానం కదాచిచ్చ చికీర్షు రస్మి
జపం కదాచి ద్విదధే సుమత్యా
తథాపి పూర్వైః సుకృతస్య త్యాగా
న్నిరస్త సందేహమనో నలిందే ॥ ౮

శ్లో. భక్త్యై కరోమి మహతం శివపూజనం హి
ముక్త్యైగృహీత పరబోధిత శూన్యవాదః
యుక్త్యైపరాచరితడాంబిక మార్గగామీ
రక్తోవదామి వ్యానృతం పరవంచనారమ్ ॥ ౯

శ్లో. శివపూజానిమిత్తేన – భోగలాలసబుద్ధిమాన్
శిష్యాన్ హిపీడయన్నిత్యం – ధనం గృహ్ణామి కాంక్షయా ॥ ౧౦

శ్లో. వ్యసనైః పరిభూతశ్చ – తృప్తిం లిందామినాత్మనః
రుణదారిద్ర్య సంఛన్నః – జీవికాం దుర్భరాం వహే ॥ ౧౧

శ్లో. దైవాద్గృహీతజన్మాఽహం – శివదీక్షాధృతవ్రతః
కదంచిత్స్వే కర్మణి రతః – భిన్నః స్యాం హై పునః పునః । ౧౭



## మహోపాధ్యాయ శివయోగి

ముదిగొండ నాగలింగశాస్త్రి గారి స్వాగతపద్యములు

శివదేవుని వీరభద్రశాస్త్రిగారు

ఉ. భూతి ధరించి లింగమొదఁబూని శివాక్షులు మేనదాల్చి వి
ఖ్యాత షడక్షరీ జప వికాసము దోఁపగ బ్రహ్మసూత్ర సం
స్థిత శరీరివై మనుజవేష ధరాపరశంభుకై వడిన్
మాతలపుల్ ఘటించితి వమానుష సత్కృతి నుద్భటాగ్రణీ. ౧

ఉ. పుట్టిననాటినుండి తమపూర్వుల మార్గమె మార్గదర్శిగా
బట్టుచు శేముషీకల నపారముగాంచి యనాది శైవ సం
ఘట్టిత శాస్త్రమర్మములకారణ మీశ్వరతత్త్వమొండె యం
చిట్టుల నీలకంఠ రచితేశ్వరభాష్యము నుద్ధరించితే. ౨

ఉ. బ్రహ్మపథాఖ్య గ్రంథమిలబారి జయధ్వని మీర దుష్కథా
జిహ్మగులన్ విదల్చి సువిశిష్ట బృహన్మత బోధనార్భటిన్
బ్రహ్మపదార్థమున్ దెలుపబాపురె పండితులెల్ల మిమ్మువే
బ్రహ్మరథంబు బట్టుగతి బాసితివయ్య విమానయానతన్. ౩

గీ. పెరిగితివి యాదినలద్భటపీఠమందు
విఱిగితివి తుది ఘనశైవపీఠమందు
పరపరిగ్రాహ్యమే భవద్భాగ్యరేఖ
మహదుపాధ్యాయ పట్ట సామ్రాజ్య నిలయ. ౪

సీ. నిరతంబు శివగోష్ఠి నెరపుచుండు వాయి
మూలమంత్రములోన వ్రాలియుండె

గండర గండఁడై గండుమీరిన చేతి
కంటంబు శివశూల మంటియుండె
ఉత్తరోత్తర వృద్ధి హత్తిల్లు గ్రంథముల్
హరశిరశ్చంద్రికా యశముగాంచె
శైవదీక్షా దగ్ధ । శాకీరధర్మముల్
పరశివసాయుజ్య పటము గొనియె

గీ. ఇటుల భవదీయ వస్తువుల్ నిశ్చలతను
పరవశంబున బంధింప బడుటజూడ
మొదట దలచిన విధమున తుదిని జరిగె
శైవపీఠమహాత్మ్యత । శాంతిగొనుమ. ౫

గీ. భావి చారిత్రకారులు భవదమోఘ
దివ్యకృషి నెంచి భవదీయ భవ్యభూరి
నామధేయాక్షరంబు లనారతంబు
గురుపరంపర మాలలో గ్రుచ్చగలరు. ౬

గీ. అధికశతగ్రంథ నిర్మాత యప్పదీక్షి
తాగ్రణికి యగ్రజుఁడవు శతాతిరిక్త
శైవపుస్తక నిర్మాణ ధీవరుఁడవు
త్రిజగ దభినుత శాంభవ దీక్షితుఁడవు. ౭

సీ. కవిబుధ తార్కిక గజయూధ మధ్యలో
పండిత సత్కార ప్రతిభగాంచి
శైవమహాజన సనకాది చయమున
దక్షిణామూర్తి తత్త్వము వహించి
అనవద్య హృద్యపద్యాను బంధములందు
పుష్పదంతున కోడిపోక నిలిచి

నిర్మల శివతత్త్వ నిష్ఠాగరిష్ఠత
ద్వాదశాచార్యుల పాదమొనరి.

గీ. అలరి నాడవు పేర్గన్న యాంధ్రభూమి
నుద్భటారాధ్య వంశాబ్ధి నుద్భవించి
నాగలింగాఖ్య చంద్రుఁడు నాఁగ బఱఁగి
కీర్తిచంద్రికలవని విస్ఫూర్తిజేసి. ౮

గీ. పుట్టుపీఠస్థుడంద్రు పై పెట్టుపేరు
సుస్థిరము మహాశైవ పీఠస్థుఁడంద్రు
రెంటగూర్చొను యోగ్యతగంటిమయ్య
పూజ్య శివయోగినామ సాయుజ్యకామ. ౯

గీ. చరమగిరి రవివలె నీవ యరిగినంత
యుదయగిరినెక్కి వికసించె యుష్మదీయ
మతమహోత్కృష్ట సేవాభిమాన కలిత
దివ్య కిరణాంకురంబులు దెసలు గ్రమ్మి. ౧౦

(శేషము.



# సైదేపూడి అగ్రహారం శివాలయ ప్రతిష్ఠ

ది 15-7-1957 శైవమత ప్రకాశిక పత్రికలో ప్రతిష్ఠ జర్పించితిమని మనవి చేసికొంటిని. ఈ శివాలయం తాడికొండ బుచ్చి వీరభద్రయ్య అయ్యవార్లంగారు కట్టించి 30 సంవత్సరాలై పాడుపడి ఉన్నప్పటికి దాతలు నిర్మలహృదయంతో యిచ్చిన చందాలవల్ల తాత్కాలిక ధ్వజంతో 9-2-1957 న ప్రతిష్ఠ జరిగి నందులకు వారి పేర్లను ఇచ్చట ఉదాహరించుచు మా హృదయ పూర్వక కృతజ్ఞతను తెల్పుకొనుచున్నాము.

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వేలమూరి నాగభూషణంగారు హనుమకొండ | రు. 116 |
| 2. | శ్రీ మునికొండ సుబ్రహ్మణ్యశర్మగారు తెనాలి | 111 |
| 3. | శ్రీమతి శింగరాజు సరస్వతమ్మగారు బందరు | 100 |
| 4. | శ్రీ వల్లభనేని నాగయ్యగారు గుడ్లవల్లేరు | 50 |
| 5. | శ్రీ ఆలపాటి రామమూర్తిశ్రేష్ఠిగారు బెజవాడ బస్తాబియ్యం | |
| 6. | శ్రీ ఉపద్రష్ట పాపన్నశాస్త్రిగారు గుడివాడ బస్తాబియ్యం | |
| 7. | శ్రీమతి శింగరాజు లక్ష్మీకాంతరావుగారిభార్య సత్యవతమ్మగారు బందరు | 50 |
| 8. | శ్రీ తెలగపుష్పల్ల పైదేవూడి అగ్రహారం | 50 |
| 9. | శ్రీ గద్దమణుగు వెంకటఅప్పారావుగారు గుడివాడ | 25 |
| 10. | శ్రీ చాపరాల సత్యనారాయణ హెడ్మాష్టరుగారు వగైరా గుడ్లవల్లేరు | 25 |
| 11. | శ్రీ మెండూరు రామలింగయ్యగారు బ్రదర్సు ఆకునూరు | 25 |
| 12. | శ్రీ మునికొండ నాగవిశ్వనాథంగారు బెజవాడ | 25 |
| 13. | శ్రీ పెయ్యేటి వెంకట్రావుగారు గుడివాడ | 25 |
| 14. | శ్రీ తాడికొండ వీరభద్రప్రసాదుగారు జంపెద్దపురం | 25 |
| 15. | శ్రీ కొండూరు రామలింగంగారు వరంగల్లు | 21 |
| 16. | శ్రీ కొండూరు బుచ్చిరామలింగంగారు వరంగల్లు | 21 |
| 17. | శ్రీ పద విద్యా ఆశ్రమంవారు గుడివాడ | 20 |
| 18. | శ్రీ కూరాళ్ళ మాధవరావుగారు గుడివాడ | 20 |
| 19. | శ్రీ శివలెంక మల్లికార్జునరావుగారు పెసరమిల్లి | 20 |
| 20. | శ్రీ లక్కరాజు గోకర్ణేశ్వరరావుగారు గుడివాడ | 15 |
| 21. | శ్రీ చెరువు శ్రీరాములుగారు గుడివాడ | 15 |
| 22. | శ్రీ మల్లంపల్లి భైరవప్రసాదరావుగారు బందరు | 15 |
| 23. | శ్రీ మల్లంపల్లి కుమారబ్రహ్మానందంగారు యలకుర్రు | 15 |
| 24. | శ్రీ కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడుగారు బందరు | 15 |

25. శ్రీ తాడికొండ వెంకటసుబ్బారావుగారు తోటవల్లూరు 15
26. శ్రీ ఇవటూరి సానందారాధ్యులుగారు బందరు 15
27. శ్రీ శివలెంక సదాశివరావుగారు గుడ్లవల్లేరు 15
28. శ్రీ ఆర్. రామకృష్ణారెడ్డిగారు కమ్మంమెట్టు 15
29. శ్రీ కలవగుంట వెంకటసూర్యారావుగారు లంకలకల్వగుంట 15
30. శ్రీ శివలెంక పిచ్చయ్యగారు గుడివాడ 15
31. శ్రీ పి. కృష్ణమూర్తిగారు గుడివాడబ్యాంకు 10
32. శ్రీ త్రిపురనేని శివప్రసాదరావుగారు గుడివాడ 10
33. శ్రీ మల్లంపల్లి రామలింగశాస్త్రిగారు గుడివాడ 10
34. శ్రీ వేములపల్లి కోదండరామయ్యగారు నందివాడ 10
35. శ్రీ వి. సుబ్రహ్మణ్యంగారు గుడివాడబ్యాంకు 10
36. శ్రీ తుర్లపాటి శేషాచలంగారు గుడివాడ 10
37. శ్రీ కావూరి కామేశ్వరరావుగారు గుడివాడ 10
38. శ్రీ ఉప్పలూరు కనకసత్యనారాయణమూర్తిగారు గుడివాడ 10
39. శ్రీ ముదిగొండ మల్లిఖార్జునరావుగారు ఈమని 10
40. శ్రీ వేముగుంటి వ్యాసులుగారు నెప్పల్లె 10
41. శ్రీ కనకమేడల సీతారామయ్యగారు నెప్పల్లె 10
42. శ్రీ విస్సంశెట్టి వెంకయ్యగారు గుడివాడ 10
43. శ్రీ విస్సంశెట్టి కుటుంబరావుగారు గుడివాడ 10
44. శ్రీ తడవర్తి నాగపోతరావుగారి కుమార్లు బందరు 10
45. శ్రీ దేవిరెడ్డి రామరెడ్డిగారు చలివేంద్రపాలెం 10
46. శ్రీ దేవిరెడ్డి వెంకట్రామరెడ్డిగారు చలివేంద్రపాలెం 10
47. శ్రీ ఘాతు మల్లారెడ్డిగారు చలివేంద్రపాలెం 10
48. శ్రీ ముదిగొండ మల్లికార్జునరావుగారు తెనాలి 10
49. శ్రీ చింతా వెంకటసత్యనారాయణగారు తోటవల్లూరు 10
50. శ్రీ శివలెంక వీరేశలింగంగారు తోటవల్లూరు 10

51. శ్రీ తాడికొండ నాగేశ్వరరావుగారు బెజవాడ 10
52. శ్రీ చిలుకూరి బ్రహ్మానందంగారు తోటవల్లూరు 10
53. శ్రీ కరెడ్ల నర్సింహంగారు గుడివాడ 10
54. శ్రీ కలవగుంట శ్రీరామారావుగారు బందరు 10
55. శ్రీ శివలెంక పున్నయ్యగారు గుడివాడ 10
56. శ్రీ అడివం మృత్యుంజయరావుగారు తోటవల్లూరు 10
57. శ్రీ ఆకారపు రాజా చెన్న విశ్వేశ్వరరావుగారు వరంగల్లు 10
58. శ్రీమతి కాశీనాథుని సరస్వతమ్మగారు బెజవాడ 10
59. శ్రీ చలసాని బ్రహ్మయ్యగారు నెప్పల్లె 10
60. శ్రీమతి కాశీనాథుని త్రిపురాంబమ్మ అనే వరలక్ష్మమ్మగారు గుడివాడ 10
61. శ్రీ పి. రాఘవరెడ్డిగారు హనుమకొండ 10
62. శ్రీ నూరి శీతారామశాస్త్రిగారు హనుమకొండ 10
63. శ్రీ టి. శేషగిరిరావుగారు వరంగల్లు 10
64. శ్రీ యర్ర కృష్ణగారు వరంగల్లుబ్యాంకు 10
65. శ్రీ రవ్వ రామనాథంగారు సన్సు వరంగల్లు 10
66. శ్రీ హీరాఛన్దు పూనచ్ఛన్దుగారు వరంగల్లు 10
67. శ్రీ పి. కృష్ణమూర్తిగారు వరంగల్లు 10
68. శ్రీ కె. లక్ష్మణరావుగారు కమ్మంమెట్టు 10
69. శ్రీ పెన్నా సీతారాంరావుగారుసన్సు వరంగల్లు 10
70. శ్రీ సయ్యాదు హయాతుగారు కరీంనగరం 10
71. శ్రీ గుడివాడ సబుకోర్టుగుమాస్తాలు 10
72. శ్రీ శింగరాజు సుబ్రహ్మణ్యంగారు బందరు 10

తతిమ్మావారంతా పదిరూపాయలలోపువారు

ఇట్లు
కొంపల్లి హనుమంతరావు,
రిటైర్డు ఇంజనీరు గుడివాడ

# శైవగ్రంథమాల

1. సంధ్యావందనము ... 0—8—0
2. ఆంజనేయ స్వరూపనిరూపణము ... 0—8—0
3. భగవద్గీత ... 6—0—0
4. శైవాహ్నికము ... 1—0—0

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు

ఉత్తరము వ్రాయవలెను.

## శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అడ్రస్ :— 1

ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వరంగల్

అడ్రస్:— 2

ముదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) దుగ్గిరాల

[ గుంటూరు జిల్లా ]

సూచన :— వ్యాసములు - ఉత్తరములు - బ్లాకులు - చందాధనము ఈ పై అడ్రస్సులలో నొకదానికి పంపించవలెను.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# శైవమతప్రకాశిక

సంపుటము | హేవళంబి సంవత్సరము | సంచిక
౮ | 15—9—1957 | ౫

సంపాదకులు :

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.

*Principal Ayurvedic college & Superintendent*
*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు :

ముదిగొండ రామలింగశాస్త్రి

మాసపత్రిక.

శ్లో॥ శ్రీ వేదశాస్త్రోక్తతత్త్వప్రభాసికా
సందేహసందోహమహానిరాసికా ।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా
జయత్యియం శైవమతప్రకాశికా ॥

శ్రీ శైవ మహా పీఠము
స్టేషనురోడ్డు, శ్రీ విశ్వేశ్వర దేవాలయము
వరంగల్

# విషయ సూచిక

# శైవమత ప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమున ప్రచురింపబడు

పవిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవిళంబినామ సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౧ | 15—?—1957 | ౫ |


## సంపాదకీయము

ఆరాధ్యులననేమి ? ఆరాధ్యులన సర్వజనులచేత పూజింప బడదగినవారని అర్థము. అనాది నుండియు నీ పదము లింగధారి బ్రాహ్మణులకు వర్తించుచు వచ్చినది. మన పూర్వులు, అఖండ శివ పూజాధురంధరులుగను, శివదీక్షామంత్రోపదేశికులుగను, తపోనిష్ఠా మహిమా సమన్వితులుగను, పంచాక్షరీమంత్రోపాసకులుగను, శైవమత ప్రచారకులుగను, అశేషశిష్యజనపరివృతులుగను, శివతత్త్వ రహస్య ప్రతిపాదకులుగను, విశిష్ట శేముషీధురంధరులుగను నయి యీ ఆరాధ్య పదమును సార్థకనామధేయముగా నొనరించి యుండిరి. వీరలు లోక కళ్యాణమునకై, మానవ విజ్ఞాన ప్రతిపత్తికై, సర్వమతోత్కృష్ట శైవమత ప్రచారమునకై ఆసేతు హిమాచల పర్యంతము సంచ రించుచు స్వార్థరహితబుద్ధితో; శివమతోత్కృష్టతను నుపదేశించుచు, ప్రస్తుతము విదేశములనుండివచ్చి క్రైస్తవమతమును బోధించు మిషనరీలవలె, లోక శ్రేయస్సే పరమావధిగ గైకొని పంచాక్షరీ మంత్రము నుపదేశించుచు చతుర్వర్ణములయందును అనంత శిష్య కోటి గణమును సంపాదించి, వారలచేత మన్ననలందుచు, శివో

వారసులై అపరశివావతారములవలె ప్రకాశించుచుండిరి. నాటినుండి నేటి వఱకును ఆచార్యులనబడువారు సంచారము నొనరించుచునే యుండిరి. కాని దుర్భాగ్యవశమున నేడు యీ వృత్తి కేవలము ఉదర పోషణ మాత్రముగనే పరిణమించుట కడుంగడు విచారకరము. మన పూర్వులు వారి సంచార కార్యక్రమమునందు శిష్యగణములను కేవల శివదీక్షాప్రదానముచేత నేగాక, జ్యోతిర్విద్యా విశారదులుగను, వైద్య శ్రేష్ఠులుగను, విద్యాబోధకులుగనుండి సమాజసేవ చేసియుండిరి. సకల విద్యా పరిపూర్ణుడగు యీ వ్యక్తి ఒక చలన విద్యా సంస్థవలె సమాజ ఔన్నత్యమునకై సర్వ విధముల తోడ్పడుచుండెడువాడు. వైజ్ఞాన సంపత్తి యీ కాలమునందు ఏ కొద్ది మందియందో ద్యోతకమగు చున్నది. శైవమతము తన పూర్వపు ఔన్నత్యమును బొందవలెనన్న ఆ మతమునందలి ప్రతివ్యక్తియు తన కనీసధర్మము నయినను నిర్వ హింపవలెను. ప్రతివ్యక్తియు మొదట తన్ను దాను సంస్కరించుకొని సమాజమును పునః సంస్కరింప మొదలిడవలెను. శైవమత రహస్య ములు తెలుసుకొనుటకును తత్ప్రతిపాదకములయిన గ్రంథములను పఠించవలెను. కాలానుగుణ్యమున ఆంగ్లవిద్య నభ్యసించు విద్యార్థులు గాని, ఉద్యోగులుగాని యిట్టి పఠన ప్రతిబంధకముగా తలంచకూడదు. ప్రతియొక్క వ్యక్తియు సంస్కృతభాషాపఠనము నొనరించవలయును. ఆ భాషయందే భారతదేశముయొక్క వైజ్ఞానిక లౌకిక, పారలౌకిక, ఆర్థిక, సంపత్తిని ప్రతిపాదించు ఉద్గ్రంథములుండియున్నవి. ఈ గ్రంథ ములను మన దేశమునుండి తస్కరించి, యితర దేశీయులు - యిందలి మహాంశములే మనకు బోధించుటకు సాహసించుట మనము చూచు చునే యున్నాము. ప్రస్తుత కాలమునందు భారతవర్షమునందు కొన్ని ప్రదేశములలో సంస్కృతభాషపై విరుద్ధ ప్రచారము చేయుట చాల సంతాపకరము. ఇట్టి ప్రచారమువలన వైజ్ఞానిక పతనము తప్పక సంభవించగలదు. శైవసమాజమునందు ప్రతివ్యక్తియు, లింగ

ధారణచే పునీతులై - పంచాక్షరీ మంత్రోపాసనచే తేజోవంతులై, భస్మధారణచే పరిశుద్ధులై, మాహేశ్వర సేవచే వినమ్రులయి, శైవ సాహిత్యపఠనచే విద్యావంతులై, శివప్రసాదసేవచే, ఆరోగ్యవంతులై, భాష్య ప్రవచనములచే పరిష్కృతులై, దీక్షావలంబనముచే మనో సంయమనముగలవారై. మోక్షగాములై చరించవలయును. పై శక్తు లన్నియు లభించుటకు విశిష్టమగు పూర్వ జన్మ సుకృతము నుండక దప్పదు. అయినను సామాన్యవ్యక్తిగూడ "కృషితో నాస్తి దుర్భిక్షమ్" మను సూక్తి ననుసరించి నిరంతర కృషి సల్పినచో తప్పక సాఫల్య మును బొందుననుటకు యెంత మాత్రమును సందియము లేదు. ఇట్టి కర్మ పదాభ్యాసమునకై శైవమత ప్రకాశిక యందు సులభమైన అనేక విషయములు ప్రకటించుచుండుట విదితమే. పాఠకులు ఏతదవ కాశము పురస్కరించుకొని శైవమత రహస్యములను దెలిసికొని, సాధ్యమగునంతవఱకు వాటి నాచరించి శివానుగ్రహపాత్రు లగుదురు గాక.



# కైలాసము

శివారాధన మొనర్చినవారు కైలాసమునకు వెళ్ళుదురనుమాట చిరకాలమునుండి సంప్రదాయసిద్ధమై వచ్చుచున్నది.

అట్టి కైలాసములు రెండున్నవని కొందఱు-ఒకటియని మఱి కొందఱు. దీనినిగూర్చి స్కాందమహాపురాణమున యిట్లుగలదు.

ఆధునిక యుగమున యేది కైలాసమని చెప్పఁబడుచున్నదో అది కైలాసముకాదు. భూకైలాసము - 2 మహాకైలాసము అని కైలా సము రెండు విధములు. శివగణము-శివభక్తులు తప్ప తదితరు లెవ్వ రచ్చటికి పోజాలరు.

అనంతకోటి బ్రహ్మాండముల కాధారభూతమైన యీమహా లోకమునందు లక్షయోజన విస్తీర్ణతగలికిన సారవంతమైన భూమిగలదు. దానికి 'స్వర్ణభూమి'యని పేరు.

దీనికి లక్షయోజనముల యెత్తున శంకరధామము గలదు. దీనినే 'మహాకైలాస'మని వేదవిదులు చెప్పుచున్నారు.

ఈ మహాకైలాసమునకు నాలుగు వైపుల 50 వేల యోజనముల వెడల్పును, 20 వేల యోజనముల పొడవుగలిగి రజతమయమైన మందిరము గలదు. దానికి అష్టదిక్కుల యెనిమిది ద్వారములుగలవు.

పూర్వద్వారమున విఘ్నేశ్వరుడు - ఆగ్నేయమున భృంగిరిటి- దక్షిణమున మహాకాలుడు-నైఋతియందు వీరభద్రుడు -పశ్చిమద్వారమున వీరభద్రుడు - ఉత్తరద్వారమున సుబ్రహ్మణ్యుడు-ఈశాన్యమున నందికేశ్వరుడు కలరు.అచ్చట గల శంకరపరివారమునకు లెక్కయే లేదు.

సశేషము

# విశ్వేదేవతలు

యజ్ఞాదులయందు శైవులుచెప్పుకొను విశ్వేదేవతలు

శ్లో. బ్రహ్మాచ ఈశ్వరౌ యజ్ఞే । తీర్థేతేచ సదాశివౌ
ఆర్చికేనందికాళౌచ । నందీశానౌ మహాలయే ॥
ద్వాదశాహే వృషస్కందౌ । దేవచండౌచనాందికే
షణ్ణవత్యాపరాగేషుః । కూర్చే । భృంగి వినాయకౌ ॥

| | | |
|---|---|---|
| యాగములందు | - | బ్రహ్మ, ఈశ్వరుడు |
| తీర్థములందు | - | బ్రహ్మేశ సదాశివులు |
| ఆరాధనకాలమున | - | నందిమహాకాళులు |
| మహాలయములో | - | నందీశానులు |
| ద్వాదశాహాస్సున | - | వృషస్కందులు |

నాందిఆరాధనలో - దేవతలు

కార్యావిధానమందు - శ్రీ వినాయకులు

ఈ విధముగ కర్మపరాయణులు స్మరింతురు గాత.

[illegible]



# మలయాచల ఖండము

(శివతత్త్వ సుధానిధి)

మలయాచలఖండమను మహాగ్రంథము స్కాంద పురాణాంతర్గతమైనది. ఇది సంస్కృతములో నున్నది. దీని నిదివరకెవరును తెలిగించి యుండలేదు. షుమారు నూరుసంవత్సరముల క్రితము దేవీభాగవతాది శతగ్రంథకర్తయగు మహాకవి, ములుగు పాపయారాధ్యులవారి తమ్ముడగు బసవారాధ్యులవారి పుత్రుడు మృత్యుంజయారాధ్యులవారిచే మృదుమధుర శైలితో సర్వజన హృదయానందకరమగునట్లు కరతలామలకముగా తెలుగులో నిది పద్యకావ్యముగా రచింపబడినది. ఈ కవిచే కుమారసంభవమను సంస్కృతకావ్యము గౌరీపరిణయమను పేరుతో తెలుగులో పద్యకావ్యముగా రచింపబడియుండి యది (60 సం॥) క్రితము యచ్చుపడి పండితపామరు లందరిచే నాదరింపబడి యున్న విషయమే గదా!

ఈ మలయాచలఖండములో 2 భాగములు 5 అశ్వాసములు గలవు. 1 వ భాగమందు 2 అశ్వాసములు గలవు. 1 అశ్వాసమందు విద్యావిద్య స్వరూపనిర్ణయము- 2 అశ్వాసములో జీవన్ముక్తి విషయమున్న- వేదాంతులకు, పండితులకు, పామరుల కందఱకును సుబోధకమగునట్లు చక్కగా మనోరంజకముగా ద్రాక్షాపాకముతో పారాయణమునకు యోగ్యముగ వర్ణింపబడి యున్నది.

౩ భాగము తృతీయాశ్వాసములో జీవుడు, గురూపదేశమున సర్వాంతర్యామియైన పరమేశ్వరుని ధ్యానసమాధులతోను, ప్రణవ పంచాక్షర్యాది మహామంత్రముతో నెట్లు తెలుసుకొనునో- యా విషయము వర్ణించబడినది.

౪ చతుర్థాశ్వాసములో దారుకావనవిహారలీల బహు శృంగారముతో వర్ణింపబడినది-

౫) పంచమాశ్వాసములో ఉరులింగోద్భవము, విభూతి,రుద్రాక్ష, లింగధారణ, లింగార్చన మహామంత్రాది పునశ్చరణా విధానములును; వర్ణాశ్రమాచారములకు తగునట్లు యథావిధిగా వర్ణింపబడినవి.

ఇట్టి ధర్మార్థకామమోక్ష సాధనమూలమైన మహాగ్రంథరాజమును, నచ్చొత్తించి వెలువడజేయుట చాలా ముఖ్యావసరము. దాతలైనవారలు ధనసహాయముచేసి పురాతనగ్రంథ ముద్ధరించగలరని గోరుచున్నాము.

| | | |
|---|---|---|
| ప్రధానపోషకులు | రు | 10—0—0 |
| పోషకులు | | 5—0—0 |
| అభిమానులు | | 3—0—0 |

యీ క్రింది అడ్రసుకు విరాళములుగా పంపగలరు-

రాజవైద్య

ములుగు పండితయ్య అయ్యావారు

ఈమని P. O.

తెనాలి తాలూకా

గుంటూరు జిల్లా

# శ్రీ గజానన సర్వస్వము

[ సంపాదకులు ]

ఇది యొక సాహితీ సంచిక. శ్రీ చాగంటి భాస్కరలింగశాస్త్రి గారి సంపాదకత్వమున వెలువడిన సచిత్ర సంచిక. ఇందలి గజానని చిత్రమెంతయో యాకర్షణీయముగనున్నది. గజాననచరిత్ర మున్నగు సర్వవిషయములు పండితాదరణీయములై - మిక్కిలి శ్లాఘనీయములై నూతన శోభను గలిగించుచున్నవి. వరంగల్లులోని శైవప్రచారిణీ సంస్కృత పాఠశాల యందలి విద్యార్థులచే [illegible] సం॥ల పూర్వమందు ప్రారంభింపబడిన గణపతి నవరాత్ర్యుత్సవము నేడును నిర్విఘ్నముగ గొనసాగుచుండుట - దాని కర్తృత్వము భాస్కరలింగశాస్త్రిగారు వహించి సర్వతోముఖముగ విస్తరింపజేసి విజయవంతముగ నొనర్చుట ముదావహము. ఆ గజాననుని యందలి భక్తి శ్రద్ధలే యీ గజానన సర్వస్వము వెలువరించుటకు ప్రోత్సాహము గల్గించిన వనుటలో సంశయములేదు. ప్రతి సంవత్సర మొక సంచికను ప్రకటింప వీరి యాశయమైనటుల గన్పించుచున్నది. వీరి యుద్యమము సఫలమగుటకు గజాననుడు తోడ్పడుగాత! కావలసినవారు వివరములు దెలిసికొనుటకై యీ క్రింది అడ్రస్సుకు వ్రాయుడు.

అడ్రస్ :

చాగంటి భాస్కరలింగశాస్త్రిగారు

మెయిన్‌రోడ్, వరంగల్.



# విజ్ఞానదర్పణము

[ సంపాదకులు ]

ఈ గ్రంథము మల్లికార్జున పండితారాధ్యుల కోట్లింగమూర్తి అయ్యవారిచే రచింప బడినది. ఇందు గురు శిష్యుల సాంప్రదాయ విషయములు విమర్శించి విపులముగ వ్రాయబడినవి. అముద్రిత గ్రంథము. శతావధాని ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారిచే గొంతవఱకు బరిష్కరింపబడినది. పండిత పామరులకు నావశ్యకమగు గ్రంథము.

వీరొకతడి సంచారము వెళ్ళినపుడు మార్కాపురంతాలూకా- ముడివేముల గ్రామకాపురస్థులగు శతావధాని ఉప్పల వేంకటశాస్త్రి గారు వీరి గ్రంథమును జూచి నీ క్రింది యభిప్రాయ మిచ్చి యున్నారు. విజ్ఞానదర్పణమందు వీరు రచించిన పద్యములు నక్కడక్కడ గలవు. ధార సరళమైనది. వీరు యితర గ్రంథములనుండి యెత్తి వ్రాసిన శ్లోకములును, పద్యములును, పాఠ్యములును- శ్రావ్యములై యున్నవి. వీరి గ్రంథమునుగూర్చి వారు వ్రాసిన పద్యములలో నొకదాని నిట నుదహరించుచున్నాడ.

సీ. అనఘ శ్రీ మల్లికా, ర్జున పండితారాధ్య
వనరాశి చంద్రతా, వక మనోజ్ఞ
విజ్ఞాన దర్పణ, విదితార్థ మార్యచ
యంబునకెల్ల గ్రా, హ్యంబుకాదె
శ్రద్ధాళువులు ప్రీతి, జదివిన జ్ఞానము
బడసి యశమ్మిహ, పరములందు
జెంది సంభావ్యులై, చెలగుటకేమి సం
శయము లేదీనుడి, సత్యము నుమి

గీ. యిటుల కావ్యములఁ గూర్చి, యింపు మీఱ
పార్వతీపతి కరుణచే, బ్రాకటముగ
విబుధతతిచేత గను గాని, మెంచబడిన యెం
లింగము ? రుచిరకీర్తి కో. టిలింగమూర్తి.

ఇట్టి పరమార్థమును దెలుపు నీ గ్రంథమును గొనుచుండుటకై భక్త మాహేశ్వరులందఱు యథాశక్తి తోడ్పడుదురుగాత.

ఇట్లు :

మల్లికార్జున పండితారాధ్యుల కోటిలింగమూర్తి అయ్యవారు

నందికేశ్వర నిలయము -

ఊతముక్కల - (వయా టంగుటూరు - ఒంగోలు తాలూకా

---

# శివపూజకు నుపయోగించు పుష్పముల వివరము

[ముదిగొండ రామలింగశాస్త్రిగారు - ఈమని]

నంద్యావర్తము- శ్రియావర్తము- గన్నేరు- తుమ్మి-పున్నాగ మందారము- కమలము- తెల్లజిల్లేడు- నల్లకలువ- లొద్దుగ- ఉమ్మెత్త- వావిలి- మారేడు- అగిసె- మాలతి- బంటిగురివింద- జాజి- మల్లె- పాటలము వీని పుష్పములు శివపూజ కుపయోగించును.

వీటిలో తెల్లని వన్నెగలపూలు సాత్వికములు-ముక్తిప్రదంబులు నగును. అవి యీశ్వరుని కత్యంత ప్రియకరంబులు. ఎఱ్ఱనివన్నెగల పూలు రజోగుణ ప్రధానంబులును, భోగప్రదంబులునగును. పచ్చని వన్నెగలపూలు సత్వరజోగుణ మిశ్రంబులును,భుక్తి ముక్తి ప్రదంబులు

సగును. నల్లకలువతప్ప తక్కినవి నల్లనివన్నెగల పూలు తమోగుణ ప్రధానంబులుగాన నీశ్వరపూజకు నుపయోగించ కూడదు.

పూవులలో శేల తుమ్మిపూవులును- పత్రములలో బిల్వంబును శివపూజకు ప్రశస్తములైనవి.

చేతబట్టుకొని తెచ్చినవిగాని - వస్త్రములో నునిచి తెచ్చినవి గాని - ఆముదపాకులో కోసియుంచి తెచ్చినవిగాని - అపవిత్రులగు జనులు తెచ్చినవిగాని శివపూజకు నుపయోగించ గూడదు.

మఱియు నేలమీద పడినవి - వాసన చూచినవి - కింజల్కములు లేనివి - పురుగులుగలవి - తొడిమె లేనివి - వ్రణముగలవి పూజకు నుపయోగింపరాదు.

నీటియందుగాని, మెట్టయందుగాని పుట్టిన పుష్పములను పుట్టిన విధముగనే పూజింపవలయును. అనగా వెలికిలగానే యుంచ వలయును. బిల్వపత్రమునైనచో బోరగిలపెట్టవలయును.

పుష్పముల నన్నిటిని బూజించి తరువాత బిల్వము నుంచ వలయును. బిల్వముమీద భస్మము నుంచవలయునుకాని భస్మము మీద నింకొక దానిని నుంచకూడదు.

బంగారముచే నిర్మింపబడిన పుష్పములకు, పత్రములకు నిర్మాల్య దోషములేదు. ఒకసారి పూజించినది తిరిగి పూజకు కూడదను నిషేధములేదు. కావున సువర్ణ నిర్మితములగు పుష్పములతోడను - పత్రములతోడను నిత్యము పూజించవచ్చును. ఇట్టి పూజాఫలమింతయని చెప్ప నలవికాదు. వసంతఋతువునందు - కడిమి, సంపెంగ, పున్నాగము బృహతి వీని పూలతో శివుని బూజించిన అశ్వమేధయాగఫలము లభించును.

గ్రీష్మఋతువునందు - పాటలి, మల్లె, నూరురేకులుగల కమలము వీనితో శివుని బూజించిన అగ్నిష్టోమ ఫలము కలుగును.

వర్షర్తువునందు - కమలము - మల్లెపువ్వు వీనితో శివుని బూజించిన అశ్వమేధఫలము కలుగును.

శరదృతువునందు నల్లకలువ - కల్హారము కలువలలో నొక తెగపువ్వు) ఉమ్మెత్త, జాజి వీని పూలతో శివుని బూజించిన సత్త్రయాగ ఫలము కలుగును.

హేమంత ఋతువునందు జాజి, నల్లకలువ, గన్నేరు వీని పూలతో శివుని బూజించిన నూఱుయజ్ఞములు చేసినందున గలుగునంత సుకృతంబు గలుగును.

శిశిర ఋతువునందు కొండగోగు పువ్వులతో శివుని బూజించిన సర్వక్రతు ఫలము గలుగును.

---

# శైవకవుల చరిత్ర

## చాగంటి వీరమాంబ

[ముదిగొండ రామలింగశాస్త్రిగారు - ఈమని]

ఈమె నివాసము రాజమహేంద్రవరము. తణుకు తాలూకా ఐతంపూడి యగ్రహారమునుండిన వీరభద్రారాధ్యులీమెకు గురువర్యులు. ఈమె శివభక్తిని - వేదాంతవిషయములను బోధించు ననేక గ్రంథముల రచించెను.

ఈమె రచించిన గ్రంథములు శ్రీశైల మల్లేశ్వర స్తోత్రములు. ఇందు 'శ్రీ గిరినివాస! మల్లేశ! చిద్విలాస' అను మకుటముతో 47 గీత పద్యములును - తరువాత నొక గీతమాలికయు - మంగళహారతులు మున్నగునవి గలవు.

2. గౌతమీ సంకీర్తన. ఇందు గోదావరినదీ మాహాత్మ్యము- శివకీర్తనలు - దండకము మున్నగునవి గలవు.

3. షట్స్థలగురుప్రబోధసారము. ఇందు వేదాంత విషయము గలదు.

ఈమె భక్తిరస మొలుకునట్లు గ్రంథముల రచించుటయే గాక రాజమహేంద్రవరములో భక్తాదుల యిండ్లకు స్వయముగా వెళ్ళి శివభక్తి ననేక విధములుగా ప్రబోధించి వాసి గాంచినది.

---

మహోపాధ్యాయ, శివయోగి

## ముదిగొండె నాగలింగశాస్త్రిగారి

## స్మారక పద్యములు

[ శివదేవుని వీరభద్రశాస్త్రిగారు ]

(గత సంచిక తరువాయి)

సీ. మహి సనాతనశైవ మాతృఫాలస్థలి
  తిలకంబు కలముచే దిద్దినావు
దుస్తరగంభీర విస్తరశైవాబ్ధి
  తల రత్నరాసులు ద్రవ్వినావు
సందేహ సందోహమం దేగువారికి
  బ్రహ్మపథము జూపి ప్రబలినావు
శ్రుత్యాగమస్మృతుల్ శోధించి లెస్సగా
  శైవాహ్నికస్ఫూర్తి సలిపినావు
గీ. యింక చేదగు కార్యంబు లెన్నొయుండ
  దలచరానట్టి దలపుగా ధరణివీడి

బ్రహ్మసాయుజ్యమందున బడసినావు
పూత ముదిగొండవాసి ప్రాజ్ఞచంద్ర. ౧౧

గీ. అస్తమించితి రవివోలె, నవని నీవు
బంధువులకెల్ల దక్కిన భాగ్యమువిడి
యస్తమించుచు నాచంద్ర; మైన కీర్తి
యుగయుగంబుల ధరణిపై నుండుగాక. ౧౨

సీ. అలవడ్డినాదవి నకలాంధ్ర భూమిని
పదవాక్యరచనైక ప్రాశస్త్యమంబు
ఊరేగినాదవి యోరుగల్లు ప్రాంత
గంధసింధుర మెక్కి ఘనత మెఱయ
సాగించినాడవ విశ్రాంత మొకటు లేక
ఘనశైవభాష్య సత్కార్యదీక్ష
కృపగాంచినాడవా కృత్తివాసుని పేర
శంభుశతకము జెప్పి సర్వగతుల

గీ. నవని నా చంద్రతారమైయుండ నెవరుగలరు?
బ్రతికినన్నాళ్ళు సత్ప్రతిభ ప్రబలజేసి
యర్థవంతైన యారాధ్య డనెడు బిరుదు
నందుకొంటివి నాగలింగాభిధాన. ౧౩

సీ. రామనాథపురస్థ రాట్సభాస్థలిలోన
వ్యాకరణపరీక్ష నందినావు
శివజగత్కారణ సిద్ధాంత మొనరించి
యాత్మకూరులోజయ మందినావు
సాహిత్య పరిషత్తు సాన్నిధ్యమున మహో
పాధ్యాయ బిరుదంబు బడసినావు

శైవజనాధ్వతు సత్సభాపీఠంబు
పెక్కుమారులునీవ యెక్కినావు

గీ. జగతి శివయోగివరుడన జాలినావు
ఛాత్రులందర బుధులుగా సల్పినావు
కులమతములకువన్నె చేకూర్చినావు
చిటికలో శంభులోకంబు జేరినావు. ౧౮

సీ. జ్వాలాంబికాఘోర సంతాన జలధిలో
రాణించుమేలైన రత్నమీవు
ఉభయభాషామాతృ శుభపాదపద్మముల్
కోరి పూజించు పూజారివీవు
ముక్తి సీమంతినీ ముక్తాఫలంబుల
గుట్టుబాపిన జగజ్జెట్టి వీవు
నిర్మల శివతత్త్వ నిర్వాణలబ్ధికై
విధి పథంబునుదెల్పు వేల్పువీవు

గీ. స్వస్వ జీవన ధాన్యంబు శైవఫలక
మందు నులిపిన భూమి ఖామందువీవు
శూలిపాదాగ్రములనొప్పు సుమములందు
నాగలింగాఖ్యపుష్పమై నావు నేడు. ౧౯

సీ. అల్లారుముద్దుగా నాడె ద్రావిడమందు
శైవవాఙ్మయమెల్ల శైశవమున
దుర్వాదఖండనో త్సుకయేచు సభలందు
జయమందెవర వీర శైవమగుచు
వృద్ధాప్యమున రస వృద్ధిగా శైవంబు
ముందేగె పటిమతో మూడుకాళ్ల

శైవచింతామణి ఛాయల నర్తింపి
శైవంబు శోభిల్ల జేసినావె

గీ. సమయవిస్ఫూర్తిగా భవ త్సమ్య దివ్య
సత్వతేజము శాంభవ సారమగుచు
వెలుగు వెలిగించె దిక్తటుల్ వెల్లబోవ
నఖిల బుధగేయ నాగలింగాభిధేయ. ౧౬

సీ. భారతీమంజీర వాద్యాజ్ఞములకేవి
రవళించె నీ జిహ్వా కవనగతిని
నిర్మలమందాకినీ తోయములచాయ
ప్రవహించె శైవ్యాణి పలుతెరంగు
నటరాజ ధక్కాని నాదాక్షరార్భటి
ఘీపెట్టె శాస్త్రార్థ ఘీంకరణము
సురపాద పోద్భూత సుమగుచ్ఛవాసనల్
వెదజల్లె విజ్ఞాన విషయ రుచులు

గీ. జన్మ జన్మార్జితంబైన సకల పుణ్య
మిట్లు ఫలియించె నాంధ్ర భూమి ప్రసిద్ధ
తాడికొండ పురంబున తావకీయ
నామమున విశ్వకళ్యాణ ధామమగుచు. ౧౭

గీ. సర్వజిద్వర్ష మాఘ మాససితపక్ష
శుక్రవార తృతీయ నస్తోకమహిమ
నరిగినాడవు కైలాస యాత్రజేయ
వచ్చు శివరాత్రికిని జేర వలయు ననుచు. (౧౮)

# పితృస్మృతి

[ శతావధాని, ముడిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారు ]

శా. శ్రీ లన్నించి గృహాంతరంబుజనితో చిన్నారిపొన్నారి లే
కాలంబందున ముద్దుముచ్చటల బంగారం బటుల్ చూడ స
ర్వాలంకార విభూషణంబు కౌమరప్రాయంబునుం జెల్లె వి
ద్యాలక్ష్మిన్ కృపనొప్పి కొండయసుధీ తండ్రీ కులగ్రామణీ! 1

మ. ఒక యేడాది గతింపకుండ జననీయోగంబు వాయంగ ని
న్నకటా! తల్లియొకర్తు పుంసునను మాతైనన్ మదిందోప నీ
యక నేత్రోద్దను బెంచెఁ బ్రేమమతి వియ్యమ్మన్ ధరన్ వీడి చిం
తకు తావౌనటు పోతె కొండయసుధీ తండ్రీ కులగ్రామణీ! 2

మ. జనకుండన్నను వీరభద్రయసుధీ చంద్రుండె నీ వ్రాతకై
యనయంబున్ మనమందు నెంత ఘన శోకాబ్ధిన్ మునింగెన్ జగం
బనిమేషంబుగ వ్రేలుఁజూపె మఱి యం దారీతి లేదంచు తా
తను మాత్రంబుననిల్చె కొండయసుధీ తండ్రీ కులగ్రామణీ! 3

మ. అనుజుల్ నిన్విడినట్టి దుఃఖమున నయ్యా పెక్కువర్షంబు లే
పనియున్ జేయక నిస్పృహన్ నిలచి సంభావించుచున్ నిన్ను నీ
జన నాద్యాచరితోత్తమ క్రియల నిచ్చల్ ముగ్ధులైయుండి రెం
తని వాక్రుచ్చుదు మంచు కొండయసుధీ తండ్రీ కులగ్రామణీ! 4

మ. తనయస్నిగ్ధ మనోనురాగముమదిన్ దండ్రిన్ జరాక్రాంతు ధా
రుణి నేరీతి విడంగనేర్తునను కారుణ్యంబు గన్పింపఁ ద
మ్మునితో వృద్ధుఁడు తండ్రి పిల్లలని నీ పోవేళన ప్రీతి నెం
తని భావింపఁగ నేర్తు కొండయసుధీ తండ్రి కులగ్రామణీ! 5

మ. కవితల్ నేర్చి త్వదీయ దివ్య పదపద్మగ్రంథముల్ బందురన్ బెట్టి త
త్కవితామాధురి మెచ్చి భావంబున హర్షంబుంచి దీవించ నా
భవమున్ప్రోక్ష కృతార్థ మయ్యెదనొ సంభావించ విద్వాంసు లం
తవిశేషంబగునో నాకు కొండయసుధీ తంత్రీకులగ్రామణీ! 6

మ. తలపన్ నేరకఁబోతి నేటికి భవ త్సాహిత్య సంపత్తి ను
జ్జ్వల ధారాళ మతి ప్రబోధక కవిత్వప్రౌఢి నీ కీర్తిఁ గ
న్నులకున్ బండువుచేసె నేఁడు నవ సంతోషంబు వర్ణింపఁగా
దలమే తావకశక్తి కొండయసుధీ తంత్రీకులగ్రామణీ! 7

మ. వటువుం జేయుటచే పితృణమును దీర్పన్ జాలితిన్ గాని ధూ
ర్జటినింబోలు శివాంఘ్రి భక్తి కవితా సమ్రాట్టులౌ నిన్ను వ
క్కట భాషాద్వయ సత్కవిత్వ విలసత్కావ్యంబులన్ వ్రాసి యు
త్కట సంతోషముగూర్ప కొండయసుధీ తంత్రీకులగ్రామణీ! 8

మ. కవితన్ వ్రాయఁగనేస్తువన్ననుడి యాకాశంబులో వాణిమై
చెవికిన్ సోకిన వ్రాత పాత్రముల వీక్షింపన్ బ్రయత్నించి యె
న్నివిధాలో కనుగొంటి నేటికిని నీ నిర్వాణ నిశ్రేణి వే
ద విదగ్రత్వముగన్న కొండయసుధీ, తంత్రీకులగ్రామణీ! 9

మ. నను గన్నందుకు సంతసించితివి సన్ జ్వాలాపతీయన్న నూ
యని యన్నందుకె సంతసించితి వటే యానాడు నేఁడుండి మ
ద్వినయారాధితపాదపద్ముఁడవునై వీక్షించి మోదంబు జెం
దను నోచంగను బోతి కొండయసుధీ తంత్రీకులగ్రామణీ! 10

మ. అనఘా! నీవు వినంగ మెచ్చఁగ నవో హాల్ నాకు విన్పింప నూ
తన మార్గంబులుఁ జూప మీకృప జగద్గణ్యంబుగా సంస్కృతం
బున నాంధ్రంబున నింక నెన్ని కృతులన్ బ్రోవుల్ ధరన్ బోయెనో
తనువున్ శక్తియు నీవె కొండయసుధీ తంత్రీకులగ్రామణీ! 11

మ. నిను గన్నట్టులెయుండె నేఁడు గన నీ "నిర్వాణ నిశ్రేణి" ని
న్ననుఁ బూజింపఁగలేని లోపమును మాన్పన్ గాదె నాచే సమ
ర్పనముల్ గాంచిన నీదురూపమగు నీ గ్రంథంబు చేకూర్చె నూ
తన విజ్ఞానము మాకు కొండయసుధీ తండ్రీ కులగ్రామణీ! 12

శా. సేవాధర్మము పుత్ర ధర్మమును భాసింపంగఁజేయున్ ధరన్
తావున్ పైడికి గల్గినట్టులది యందందన్ గనన్ జాలి నే
నా పిన్నాణపు మాటకున్ వగను గాదా యంచు నున్నంత చిం
తా విశ్రాంతి నొసంగె కొండయసుధీ, తండ్రీ కులగ్రామణీ! 13

శా. నికన్నాకును నొక్కరే గురువు కానీ మైన నీకూర్పు సే
వాకల్పద్రుమ మంత చిన్నపుడె సంభావ్యంబుగానయ్యె నా
నీ కావ్యంబు మెఱుంగు పెట్టిన దహో "నిర్వాణ నిశ్రేణి" విం
తౌకల్పోజ్జ్వల వృత్తి కొండయసుధీ తండ్రీ! కులగ్రామణీ! 14

మ. అనఘా! జీవితకాలమంతయును విద్యాలక్ష్మి లేకాలమున్
నినుమర్యాదగఁజూచెనన్నునుడులన్ విన్నప్పు డస్మన్మతిన్
వినుతింపన్ దలఁపయ్యె మాయెడనన్ విద్వత్సుదారిద్రతా
ధ్వని మాత్రంబుఁగ నిల్చె కొండయసుధీ తండ్రీ కులగ్రామణీ! 15

శా. అయ్యా! మాయెడ నీమనంబునను నెయ్యం బెంతదో గానీ తా
తయ్యన్ గన్నుల నశ్రుబిందువులు చిందన్ జూచి మా వంకకున్
జెయ్యిన్ జూపుచు సౌంజ్ఞ చేసితివటే, క్షేమంబుగాఁజూడ గు
ర్తయ్యా మమ్ములతాత కొండయసుధీ తండ్రీ కులగ్రామణీ! 16

శా. కైలాసంబున దల్లిదండ్రులు నినున్ గారాముతోఁ జూడ మీ
రాలున్ భర్తయు భక్తి నీశ్వర సపర్యాసక్తులై యుండి మ
మ్మాలోకింతు రటంచు నెంతుఁ గృప నాహ్లాదింపుఁడీ బిడ్డ ప
ద్యాలన్ ముద్దొనరించి కొండయసుధీ తండ్రీ కులగ్రామణీ! 17

మ. భవదీయోత్తమ సత్కవిత్వ రచనా ప్రావీణతన్ గన్న నీ
శివధర్మజ్ఞత తత్త్వబోధము సదా శీల వ్రతాచార సా
ష్టవ సంపత్తి శ్లాఘించు నీ కృతి సమస్తాంశంబులతో నన్ను సం
స్తవముఁ జేయుచు నాత్మ కొండయసుధీ, తంత్రీ కుల గ్రామణీ! 18

శా. దారాపుత్రులపాటు యేమని మదిన్ దర్కించుటల్ తండ్రి నీ
కై, రాతిం బవలోక్కనీతిగను దుఃఖంబందు టూహింతువో
సారంబైన నసారమైన విషయన్ సంసార మూహించి తా
నేరన్ నీ మనసిట్టిదంచు గని నీ నిర్వాణ నిర్దేశనిన్. 19

---

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ మడివటూరి సానందారాధ్య విరచిత నటరాజ శతకమునుండి
గ్రహింపఁబడిన మఱికొన్ని

# పద్యములు

సీ. వఱలు సద్యోజాత వక్త్రంబుచేనొప్పి
దీపించునటువంటి దేవుడెవడు
వామదేవాఖ్యమౌ మోమున జెన్నారి
వెల్గొందునటువంటి వేల్పెవండు
భాసురాఘోరాఖ్య వదనంబు రవళింప
పటుశక్తుడౌ భగవంతుడెవడు
పుణ్యతత్పురుషంబు ముఖమున భాసించు
ధర్మస్వరూపుడౌ దైవమెవడు

గీ. ఎవడు నీశానముఖముచే నెసగుచుండు
బంచభూతంబు లెవనిచే బ్రభవమందు

నట్టి దేవుడవీవయ్య యష్టమూ_ర్తి
మౌళి ధృతరాజ నటరాజ మహిత తేజ॥ 1

సీ. ఏ వేల్పు సృష్టికి హేతువై యొప్పారి
బ్రహ్మదేవుండౌచు బరగినాడు
ఏ వేల్పుపోషణ హేతువై యొప్పారి
వైకుంఠుడై పేరు వడసినాడు
ఏ వేల్పు సంహార హేతువై దీపించి
జగతిరుద్రుండౌచు నెగడినాడు
ఏ వేల్పు ముప్పార కేకరూపుండౌచు
శివనాముడై కీ_ర్తి జెందినాడు

గీ. అట్టి పరతత్వమూ_ర్తియా నాదిదేవు
డఖిల బ్రహ్మాండముల దన యందుగల్గు
దేవదేవుడవీవుగా దెలిసినాడ
మౌళిధృతరాజ నటరాజ మహిత తేజ॥ 2

సీ. ప్రథమమూలాధార వరచక్రమందున
గణపతిరూపంబు గాంచినావు
అభవ! స్వాధిష్ఠాన మనుచక్రమందున
బ్రహ్మరూపంబున బరగినావు
మణిపూరకంబను గణితచక్రంబున
విష్ణురూపంబున వెలిగినావు
పటుతరానాహత వరచక్రమున రుద్ర
లలితరూపముచేత నిలిచినావు

గీ. సారిది సీశుడవై తివి శుద్ధమందు
జెలగి యాజ్ఞేయమున సదా శివుడవగుచు

గ్రమత శివుడై తివల సహస్రారమందు
మాళి ధృతరాజ నటరాజ మహిత తేజ॥ 3

సీ. భక్తస్థలంబున బటు దివ్యరూపమా
నాచారలింగంబ వౌచునిలిచి
మాహేశ్వరస్థలి మాన్యమై దనరారు
నద్భుత గురులింగ మాచు వెలిగి
పరమప్రసాదాఖ్య భవ్యస్థలంబున
నతిశయ శివలింగ మాచునరి
ప్రాణలింగస్థలి భక్తుల కెల్లను
నమలమా చరలింగ మాచువజలి

గీ. శరణతలమందు తత సుప్రసాదలింగ
మగుచు నైక్యస్థలంబున నధిక తేజ
మున మహాలింగమైతివి ముక్తినొసగ
మాళి ధృతరాజ నటరాజ మహిత తేజ॥ 4

సీ. మహిమీద జనియించు మనుజసంతతిబ్రోవ
నమలమా గురురూప మందినావు
స్థూలదేహంబును శుద్ధిగావింపంగ
నిష్ట లింగాకృతి నెగడినావు
సూక్ష్మదేహంబును శుచిమంతమునుజేయ
బ్రాణలింగాకృతి బడసినావు
కారణదేహ సంస్కారణంబు గావింప
భావలింగాకృతి వజలినావు

గీ. త్రివిధ లింగాత్మకంబౌచు దివ్యమైన
పాశుపతదీక్ష సంసార పాశములను

త్రెంచు మార్గము శ్రుతుల బోధించినావు
మాళి ధృతరాజ నటరాజ మహిత తేజ॥ 5

సీ. ఏ మహాదేవుని మొనలేని లీలల
సర్వభూతంబులు సంస్తుతించు
ఏ భూతనాథుని యిద్ధనామావళి
పఠనంబుచే సర్వ బాధలడగు
ఏ భగవంతుని మొనలేని సత్కథా
కర్ణనంబున నాత్మ కలుషమడగు
ఏ మహాత్మునిపాద మెందఱభక్తుల
హృదయసీమలయందు గదలుచుండు

గీ. అట్టి పరమాత్మ వవ్యయుం డజుడవఖిల
లోకరక్షకమూర్తివి లోకవంద్యు
డమలగుణరాశివని భక్తు లంద్రు నిన్ను
మాళి ధృతరాజ నటరాజ మహిత తేజ॥ 6

సీ. నరుని యజ్ఞానంబు నాశనం బొనరింప
పరమోత్తముండైన గురుడువలయు
గురుదత్తమైనట్టి హరదీక్ష దీపించు
పరమేశలింగంబు బడయవలయు
లింగార్చనాభక్తి సంగాత్ముడౌ దివ్య
మాహేశ్వరునిగొల్చి మనగవలయు
మాహేశ్వరాదిక మహితపాదోదక
పానంబుచే శుద్ధి బడయవలయు

గీ. హరనివేదిత నైవేద్య మందవలయు
భస్మరుద్రాక్షశివమంత్ర భరితుడైన

యతడె రక్షితుడావరణాష్టకమున
వాళి ధృతరాజ నటరాజ మహితతేజ॥ 7

సీ. పరమలింగాచార భరితుడై నిత్యంబు
పరమేశ! నినుగొల్చు భక్తుడెవడు
భవ్యసదాచార భాగ్యుడై నిరతంబు
పశుపతి! నినుగొల్చు భక్తుడెవడు!
మహిని శివాచార మహితసంపన్నుడై
భవ నిన్నుగొల్చెడు భక్తుడెవడు
లలితగణాచార లక్ష్య లక్షితుడౌచు
పరమాత్మ! నినుగొల్చు భక్తుడెవడు

గీ. సత్కటాచారవంతుడై సాంబ! నిన్ను
భావనారంగమున నిల్పు భక్తుడెవడు
వాడెగా నీదు భక్తుండు వసుధయందు
వాళి ధృతరాజ నటరాజ మహితతేజ॥ 8

సీ. దృగవధానముచేత దృష్టిని నిలుపుచు
దృగ్విలీనతచేత దృప్తినొంది
దృక్పూజచేతనే దృఢభక్తి సేవించి
త్వగ్వ్యాప్తి నింద్రియ తతిమఱల్చి
పరుగిడు నిజ మనోవ్యాప్తిని బంధించి
మనసు నీ యందున మలిపి నిలిపి
భావనార్చనచేత భవబంధమున్ద్రెంచి
గణ నమస్కృతి నిన్ను గణనజేసి

గీ. సుగుణగణ శీలు నిన్ను సంస్తుతి యొనర్చి
మహితమైనట్టి నీలీల మగ్నుడైన

మనుజుడవ్యయపదభాగ్య మనుభవించు
మాళి ధృతరాజ నటరాజ మహిత తేజ॥ 9

సీ. నిర్మల దర్శన నీ రాజనంబిడి
యవసరహారతి నమరసలిపి
నెమ్మితో మజ్జన నీరాజనమునిచ్చి
మాంగల్యదీపంబు మమత సల్పి
కర్పూరహారతి ఘనముగా నొనరించి
శృంగార తేజంబు జెందజేసి
నతమహా నీరాజనంబును గల్పించి
యానందహారతి నమరబట్టి

గీ. క్రమముగా నొప్పుతుది నసంఖ్యాతనామ
హారతిని బట్టి నీపూజ యనవరతము
జేయు భక్తుడు నీలోన జేరునిజము
మాళి ధృతరాజ నటరాజ మహిత తేజ॥ 10

సీ. పార్వతీపతి! నీదు పరిణయ విభవంబు
గనజాలనటువంటి కన్నులేల
అభవ! నీ యుత్సవ మనుసరించుచు వెంట
భావించి నడువని పదములేల
కైలాసవాస! నీ కల్యాణ కథనంబు
వినజాలనటువంటి వీనులేల
పురహర! నీ పాదముల పూల పూజలు
జేయజాలనియట్టి చేతులేల

గీ. నాగభూషణ నీ పుణ్య నామసమితి
పలుకగా జాలనటువంటి వదనమేల
పురుషునకు పుణ్య నరజన్మ పొదలువేళ
మాళి ధృతరాజ నటరాట మహిత తేజ॥ 11

# శైవగ్రంథమాల

| | | |
|---|---|---|
| 1. సంధ్యావందనము | ... | 0—8—0 |
| 2. ఆంజనేయ స్వరూపనిరూపణము | ... | 0—8—0 |
| 3. భగవద్గీత | ... | 6—0—0 |
| 4. శైవాహ్నికము | ... | 1—0—0 |

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు ఉత్తరము వ్రాయవలెను.

# శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అడ్రస్ :— 1

## ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వ రం గ ల్

అడ్రస్:— 2

## ముదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) దుగ్గిరాల

సూచన :— వ్యాసములు - ఉత్తరములు - బ్లాకులు - చందాధనము ఈ పై అడ్రస్సులలో ఒకదానికి పంపించవలెను.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# శైవమతప్రకాశిక

[illegible]

సచిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవళంబి సంవత్సరము | సంచిక |
| --- | --- | --- |
| ౮ | 15—10—1957 | ౬ |

సంపాదకులు :

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.

*Principal Ayurvedic college & Superintendent*
*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు :

ముదిగొండ రామలింగశాస్త్రి

భాష్యపీఠి.

శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థతతిప్రభాసికా
సందేహసందోహమహానిరాసికా ।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా
జయత్వియం శైవమతప్రకాశికా ॥

శ్రీ శైవ మ హా పీ ఠ ము

స్టేషనురోడ్డు, శ్రీ విశ్వేశ్వర దేవాలయము

వరంగల్

# విషయసూచిక

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమున ప్రచురింపబడు

సచిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవళంబినామ సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౮ | 15—10—1957 | ౬ |


## సంపాదకీయము

శైవసభ వరంగల్లులో జరిగి మూడు మాసము లయినది. నిర్మాణకార్యక్రమము ఈ విజయదశమినుండి ప్రారంభింపబడినది. స్థానిక శైవ సాంఘిక సమావేశము పీఠాధిపతుల యధ్యక్షతతో జరుపబడినది.

ప్రతి శైవుడు - ప్రతి దినము శైవ సంఘమున జన్మించినందులకు పత్రిక పోషణక్రింద - ఒక్క నయాపైస శివార్పణబుద్ధితో ధర్మముచేయవలెను. పత్రికా పఠనము నేను చేయుచున్నానా ? లేదా ? అను వాద వివాదముల క్రింద తావులేదు. ఒక దీపము వెలిగించి - కోమలము లయిన బిల్వదళములతో - కాంతివంతము లయిన కుసుమ విసరముతో తన శివలింగము నభిషేకించి పూజించి నివేదించి శివప్రసాదము గొనుటయు - శివనామ సంకీర్తన మొనర్చి కాలోచిత కృత్యముల నిర్వహించుటయు, శివలింగధారుల కీరెండు ప్రధాన కార్యములు.

ఆరాధనవిధి శివమేధము - దీక్షావిధి - మొదలగు గ్రంథములు ముద్రించవలసియున్నది. 1934 సంవత్సరమునుండి యేలేటిపాడు

అగ్రహార వాస్తవ్యులగు రెంటాల వీరభద్రశాస్త్రిగారును – 1930 వత్సరము నుండి వరంగల్ శైవబృందమును – ఎన్నోమారులు ముద్రించ వలయునని వ్రాసినను – ప్రయోజనము లేదు.

ఏలయన :– తగినంత మూలధన మాయనకు లేదు. వీరభద్రా రాధ్యుల వారయిన అందుకు వలయు ధన సంపాదనమును చేసియుండ లేదు. సాంఘికులు విరాళము లిందుకై యిచ్చియుండలేదు. ఇక మత గ్రంథములు ముద్రింపబడుట ఎట్లు ?

అచ్చుపడని పుస్తకము లసలే పడలేదు. ముద్రింపబడినవా ? పునస్ముద్రణము గోరుచున్నవి. సాంఘికులుగాని తదితరులుగాని, ఉచితముగ నిచ్చిన గైకొనెడి వారేగాని వారికి ఖరీదుపెట్టి కొనవలసిన యవసరము లేదు. నిజముగా నీ పుస్తకము లెవరి కవసరమన శ్రౌత స్మార్త కర్మల చేయించు మనలోని యాజ్ఞికులకు – ధర్మ శాస్త్రజ్ఞులగు పండితుల కావశ్యకములు.

ఈ విషయము గుర్తించియే సర్వధారి సం॥ర మార్గశిర శుద్ధ విదియ గురువారము రాత్రి 7–30 నిమిషములకు శైవాచార్యుల సంఘము – అనగా యాజ్ఞికుల – సంఘము నొకదానిని నెలకొల్పితిమి. ఇట్టి సంఘములు గాని తన్నియుక్తులయిన శైవాచార్యు లిద్దరు శైవులు గల ప్రతిగ్రామమందున నుండి – శైవుల గృహములందు జరుగు శుభాశుభ కార్యములు నెరవేర్చుచుండవలయును.

ఇట్టి పురోహితుల ప్రాబల్య ముండిననే గాని ధర్మాచరణ విధి ప్రతిపాదక గ్రంథావశ్యకత గోచరించదు. ఇట్టివారును మన సంఘమున సన్నగిల్లిరి. ఒకవేళ యున్నను స్వసాంఘికులు – వారిని బ్రహ్మత్వ పదవి నొసగి తమ కార్యనిర్వహణానంతరము వారికి తగు మర్యాదలు చేయకపోవుటయు కూడ మరొక కారణమని భావించబడుచున్నది.

కర్మనిష్ఠులయిన - పెద్దలు - అచ్చుపుస్తకాలు వారము రోజులు - శైవధర్మాభిలాషులకు శైవధర్మము ప్రమాణముగ బోధింపజేయు నేర్పాటులు గావింపవలెను. యువకులు, సంస్కర్తలందున - శైవలాంఛనము లయిన భస్మరుద్రాక్షాదులు ధరించినందున - రుద్రాక్షపితల మాలలు విరుగుండినందున - తద్విధములు పెట్టినందున శివపూజ మానినందున తమకు గలిగెడి లాభనష్టము లేమో మహేశ్వరులవలన దెలిసికొనవలెను. ఏ గ్రంథములో నున్నదన్న ప్రమాణము చూపించవలెను. సందేహముగలవారు శైవకార్యాలయమునకు వ్రాసినచో వెంటనే జవాబు పీఠము నుండి వ్రాయబడును. నేడే యువకులందరు సభలు బిగించండి. వృద్ధులు - యువకులు ఈ పథమునకు కావలసిన పరికరములు సేకరించి సూర్యభగవాను డస్తమించుటకు చేరకముందే శివభక్తి ప్రచారము శైవపీఠముద్వారా జరుగునట్లు తగు సహాయ మాచరింప గోరెద.



స్వస్తి సర్వేజనా స్సుఖినోభవంతు.

## శైవ వ్రతములు

1. సిద్ధివినాయక వ్రతము
2. కుమార వ్రతము
3. వీరభద్ర వ్రతము
4. నందికేశ్వర వ్రతము
5. లక్షవర్తి వ్రతము
6. ఉమామహేశ్వర వ్రతము
7. సోమవార వ్రతము
8. భీమేశ్వర వ్రతము
9. కార్తీకమాస వ్రతము
10. శ్రావణమాస వ్రతము
11. మంగళగౌరీ వ్రతము
12. కేదారేశ్వర వ్రతము
13. సోమవత్యామావాస్య వ్రతము
14. హరితాళిక వ్రతము
15. కోటి బిల్వార్చన వ్రతము
16. లక్ష బిల్వార్చన వ్రతము
17. శనిత్రయోదశీ వ్రతము
18. పక్షప్రదోష వ్రతము
19. ఆకాశదీప వ్రతము

## విజ్ఞాపనము

శివాద్వైత సిద్ధాంత ప్రచారము గత శ్రావణ మాసములో మహబూబునగరజిల్లా షాదునగరమున అమృతలింగేశ్వరస్వామివారికి ప్రతిదినము ఏకాదశ రుద్రాభిషేకము సహస్ర బిల్వార్చన జరిగినది.

ఈ సందర్భములో కలకల్ల సాంబశివుడుగారు తమగురువులయిన మల్లికార్జున పండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారిచే అస్తావరణ ములగూర్చి యుపన్యాసము లిప్పించి 116-0-0 లు సన్మానించిరి. శైవ మత ప్రకాశికా సముద్ధరణకై 116-0-0 లు కూడ యివ్వవలయునని గురువులు వచించిరి. వాగ్దానము జరిగినది. సాంబశివుడుగా రిదివరలో 6 వేలు వ్యయపరచి ధర్మసత్ర మచట కట్టించిరి. ఈశ్వరుడు వీరి మనో రథముల సిద్ధినొందింప జేయుగాత.

షాదునగరు
11—9—57

ఇట్లు
సన్నిధానం వెంకటేశ్వరశర్మ

---

# శివశబ్ద మహిమ

రెంటాల వీరభద్ర శాస్త్రిగారు
(వేలేటిపాడు అగ్రహారం. - గోదావరిజిల్లా)

వష్టి - లోకహిత మిచ్ఛతీతివా - వశకాంతా వితిధాతోః సర్వం స్వస్మి న్నశ్రికాళ యతీతివా - శివః । శివనామ జపేన విఘ్నాః-

ప్రయోగాః శాంతవాః శామ్యంత్యనేనేతి శివః। శేతే సర్వమస్మి న్నితివా శివః।

శ్లో॥ హీసిధాతో స్సింహాసూపః। వశకాంతౌ శివస్మృతః
వర్ణవ్యత్యయంస్సిద్ధః। పశ్యకః కశ్యపోయథా॥
శివా సర్వమంగళా శబ్దార్థవ విభాజ్యసంబంధేన
అస్మిన్నర్తత ఇతి శివః। అస్మాదిత్వాదచ్ప్రత్యయః॥
అతశ్శివశబ్దోచ్చారణేన సర్వదోషావినశ్యంతి
సర్వమంగళాని భవంతి తదుక్తంస్కాందే—

శ్లో॥ వేదేషునా పుణులేషుచ మంత్ర తంత్ర
శాస్త్రేషుసా రమపి శబ్ద సముద్రసారం।
సారేషు సారమిదమేవ శివేతినామ।
యేనాపికేన సకృదుచ్చరితం సధన్యః॥
భాగవతే॥ దధీచినాప్యేవం ప్రబోధితః దక్షఏవ-

శ్లో॥ యద్వ్యక్షరం నామగిరేరితం నృణాం,
సకృత్ప్రసంగాదఘు మాశుయంతియత్
పవిత్రకీర్తి తమలంఘ్యశాసనం
భవానహంద్వేష్టి శివం శివేతరః॥
అతశ్శివశబ్ద సదృశ శబ్దః కోపినాస్తీతి
విజ్ఞాపయన్నితో విరమామి॥

# విజ్ఞాపన

ములుగు వీరమల్లయ్య అయ్యవారు

మహాశయులారా!

నేను నా పూర్వులు వ్రాసిన దీక్షావిధిని తాళపత్రాలనుండి జాగ్రత్త పరచితిని. ఈ పురాణోక్త దీక్షావిధి యెచ్చటను ముద్రించ బడలేదు. శివలిఙ్గధారణ అష్టావరణవర్ణములయందు కలదు. ద్విజేతరు లగు వారందరికి శివదీక్ష యిచ్చుటకు ఇదియే మూలగ్రంథము. శైవ మత ప్రకాశికలో ప్రకటించుటకు కోరుచున్నాను.

ఈ గ్రంథమును వ్రాసినవారు వ్రాసిన గ్రంథము చివర శ్లోకము చదువుకొన్నచో ఈ గ్రంథము వ్రాయుటకు వారెంత కష్టపడి యుండురో, తమకు విశదముగా తెలియ గలదు.

శ్లో॥ బద్ధపృష్ఠకటి గ్రీవః స్తబ్ధచక్షురధోముఖః ।
కష్టేన లిఖితం గ్రంథం పుత్రవత్పరి పాలయ ॥

శిష్యసంచారముగల వారందఱికి, ఈ పుస్తకము అత్యవసర మైనది గనుక సంచారపరులందఱు తప్పక శైవమత ప్రకాశికకు చందాల పంపించి చందాదారులుగా చేరగోరుచున్నాను. మఱియు శైవాచార్యులందఱు ఇట్టి పుస్తకములను ముద్రించుట కొఱకు సాంఘికుల ప్రోత్సాహపరచెదరు గాత.

శ్రీశివాయ గురవేనమః

## పురాణోక్త దీక్షావిధి

శ్లో॥ అచింత్యావ్యక్త రూపాయ నిర్గుణాయగుణాత్మనే
సమస్త జగదాధార మూర్తయే బ్రహ్మణేనమః ॥

## దక్షిణామూర్తిస్తుతి

శ్లో॥ ఓం నమః ప్రణవార్థాయ శుద్ధ జ్ఞానైకరూపిణే
నిర్మలాయ ప్రసన్నాయ దక్షిణామూర్తయేనమః ॥

## మల్లికార్జున స్తుతి

శ్లో॥ శ్రీమల్లికార్జునం దేవం చిద్ఘనం చెన్న సంజ్ఞికం
గుహఘక్షేత్రేశ్వరాత్మానం గుణాతీత ముపాస్మహే ॥

## గణపతి స్తుతి

శ్లో॥ గజవదన మచిన్త్యం తీక్ష్ణదన్తం త్రినేత్రం।
బృహదుదరమునీశం భూతరాజం పురాణం।
అమరవర సుపూజ్యం చైకదన్తం సురేశం।
పశుపతి సుతమీశం విఘ్నరాజం నమామి ॥

శ్లో॥ వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానుపక్రమే।
యంనత్వా కృతకృత్యాస్స్యుః తం నమామి గజాననం॥

## గౌరీపతి ధ్యానం

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలంతదేవ గౌరీపతేతేంఘ్రియుగం స్మరామి॥

## శ్రీపతి పండితారాధ్యస్తుతి

శ్లో॥ శ్రీమచ్ఛ్రీపతి పండితాన్వయ సుధాసిన్ధ్వాది మూలోగురు
స్వామీ శ్రీజయవాటికా నగర సంస్థానో ద్విజాగ్రేసరః
శ్రీ మల్లేశ్వరలింగ గర్భ జనన శ్శృంగార భాస్వద్యశో
ధామా యస్సకలార్థ ముక్తిఫలదస్తం భావయేఽహం సదా.

శ్లో॥ స్వభక్తోద్ధృతిం భావ్య చిత్తేమహోగ్ర ప్ర
భావశ్శమీభూభవేబద్ధవస్త్రే)

ప్రభుఃకీలితాంగార భాస్వత్త్రమాణం
బిభర్తానుయుక్తం ప్రభూత్వా స్మరామి॥

శ్లో॥ చాక్షుషీనామ సంయుక్త దీక్షయా వీక్ష్య యోగాత్మజా
అక్షుద్రవిప్రమకరో దక్షయం తం భజామ్యహం
శతాధిక చరద్గురు చరేశ హేతువాక్యాక్షగో
మతాన్వయ వివృద్ధయే మహిత శిష్యసంప్రాప్తితః
సతీనిటలమధ్యమే భువి విలిప్య భూతిం సదా
సుతాంశ్చశర సంజ్ఞకాన్ జనయతిస్తుయ స్తంభజే॥

## నందీశ్వరధ్యానమ్

శ్లో॥ యత్రయోగీశ్వరశ్శంభుః, యత్రధర్మో వృషేశ్వరః
తత్రశ్రీర్విజయోభూతిః, ధ్రువానీతిర్మతిర్మమ॥

## శివస్తుతి

శ్లో॥ స్మృతే సకల కల్యాణభాజనం యత్రజాయతే
పురుషం స్తమజం నిత్యం వ్రజామి శరణం శివమ్॥
సర్వదాసర్వ కార్యేషు నాస్తి తేషామమంగళం
ఏషాంహృదిస్థో భగవాన్ మంగళాయతనం హరః
లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః
ఏషామిందు నిభాకారో హృదయస్థో మహేశ్వరః
ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీసోమం భూయోభూయోనమామ్యహం॥

## పార్వతి స్తుతి

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే శివేసర్వార్థ సాధకే
శరణ్యే త్రియంబకే దేవీ నారాయణి నమోస్తుతే॥

## ఉమామహేశ్వరస్తుతి

శ్లో॥ నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్టవపుర్ధరాభ్యామ్
నగేంద్ర కన్యా వృష కేతనాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీభ్యాం ॥

## గణ స్తుతి

శ్లో॥ శ్రీనంది భృంగిరిటవీరక వీరభద్ర
చండీశ్వర ప్రమథముఖ్య మహాగణేభ్యః
శ్రీస్కందమంత్రనుత పుష్పసహస్రకోటి కోటిభ్య ఏవ
ముహుర్ముహుస్తు నమో మహద్భ్యః ॥

## గురు స్తుతి

శ్లో॥ కృతప్రమాణై స్త్రిభిరేవ మద్భృతైః
యుతాస్త్రయో యేత్యుపగౌరవాంఛితాః
స్వతంత్రిణ శ్శైవ జనానురాగిణాం
స్తుతిం గురూణాం సుమతిః కరోమ్యహాం ॥

## మాహేశ్వర స్తుతి

శ్లో॥ సమీహితార్థప్రద కామధేనవః
సమస్తపాపాటవిచిత్రభానవః
భవాంధకార చ్ఛటచంద్రభానవః
పునన్తుమాం శైవ గణాంఘ్రిరేణవః॥

## సర్వ స్తుతి

ఉమామహేశ్వరాభ్యాంనమః, తద్వామభాగే లక్ష్మీనారాయణాభ్యాంనమః, దక్షిణభాగే వాణీహిరణ్యగర్భాభ్యాంనమః, తత్పురోభాగే శచీపురందరాభ్యాంనమః, అరుంధతీ వసిష్ఠాభ్యాంనమః. దూర్వాస,

కౌశిక, దధీచి, గౌతమాది మహాపాశుపతేభ్యోనమః, అనేకనవర మూర్తిభ్యోనమః నూతనపురాతన మహాభక్తగణేభ్యోనమః మహా ప్రమథగణేభ్యోనమః, దుర్గాగణపతిక్షేత్ర పాలకేభ్యోనమః, అనన్త కూర్మవర కమలాసనాయనమః, సర్వేభ్యోమహాజనేభ్యోనమః.

గురుః ఆచమ్య, ప్రాణానాయమ్య, ఉక్తిస్కంతౌ...... బ్రహ్మ కర్మసమారంభే, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శుభే శుభో దయముహూర్తే ఏతేషాం యజమానాదీనాం సర్వేషాం మమశిష్యా ణాం విభూతి రుద్రాక్షలింగధారణ మంత్రోపదేశేన శివదీక్షాం కరిష్య మాణః మంటపవేదికాస్థల శుద్ధ్యర్థం, అస్యయజమానస్య గోత్రస్య నామధేయస్య మమశిష్యస్య ఆత్మద్రవ్యగృహస్థల భూభాగ సిద్ధ్యర్థం శాంత్యర్థమభ్యుదయార్థంచ మహాజనైస్సహ శుద్ధి పుణ్యాహవాచనం కరిష్యే ఆదౌనిర్విఘ్న పరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాంకరిష్యే।

## కలశ పూజ

శ్లో॥ కలశస్యముఖేరుద్రః కంఠేవిష్ణుస్సమాశ్రితః
మూలేతత్రస్థితో బ్రహ్మా మధ్యే మాతృగణాస్మృతాః।

ఇతి కలశస్యోపరిహస్తం నిధాయ—

శ్లో॥ గంగేచయమునేచైవ గోదావరి సరస్వతీ
నర్మదే సింధు కావేరీ జలేస్మిన్సన్నిధింకురు.

ఇతి సకలతీర్థానావాహ్య – గణపతి ప్రాణ ప్రతిష్ఠాం కృత్వా –
గణానాం త్వా గణపతిం కవీనాం కవిముత్తమం
బ్రహ్మణాం జ్యేష్ఠరాజంతు, విఘ్నేశత్వంహి పాహిమాం,
ధ్యాయామి ధ్యానం సమర్పయామి
ఆవాహయామి ఆసనం సమర్పయామి
పాదయోఃపాద్యం, హస్తయోరర్ఘ్యం సమర్పయామి॥

## పంచామృత స్నానం

శ్లో॥ పంచామృతైః గంధతోయైః, కుశతోయైః
ఫలోదకైః అభిషించ్యామి దేవేశ భవన్తం శ్రీగణాధిప
పంచామృతస్నానం సమర్పయామి శుద్ధోదకస్నానం
శుద్ధాచమనీయం సమర్పయామి.

## వస్త్రం

శ్లో॥ అవిద్యాపటలధ్వంస, జగన్నిర్మాణకారక
నూత్న వస్త్రమిదం శంభోగృహ్యాతాం భక్తవత్సల.
ఇతి వస్త్రం సమర్పయామి.

## యజ్ఞోపవీతమ్

శ్లో॥ లంబోదర గణాధీశ పరమానందదాయకా,
యజ్ఞోపవీతం దాస్యామి, సర్వవిఘ్న వినాయక॥
గణాధిపాయనమః యజ్ఞోపవీతం సమర్పయామి—

## భస్మమ్

శ్లో॥ మేరుమందర తుల్యాని పాపాని వివిధానిచ,
నశ్యంతి భస్మనా యేన తద్విభూత్యా సమర్ప్యతే॥
ఇతి విభూతిం సమర్పయామి—

## గంధమ్

శ్లో॥ చన్దనాగరు కస్తూరీ కర్పూరాగరు సంయుతం,
తుభ్యందాస్యామి దేవేశ దివ్యగంధం గణాధిప॥
గంధం సమర్పయామి—

## అక్షతలు

శ్లో॥ పక్షిధ్వజవిరించాద్యైః సిద్ధైర్యక్షాది భిర్నుత
అక్షతైః పూజయామిత్వాం తురగీ కృతమూషక॥
ఇత్యక్షతాన్ సమర్పయామి—నానాభరణాని సమర్పయామి —

## పుష్పము

ఓం సుముఖాయనమః - ఓం ఏకదంతాయనమః - ఓం కపిలాయనమః - ఓం గజకర్ణకాయనమః - ఓం లంబోదరాయనమః- ఓం వికటాయనమః - ఓం విఘ్నరాజాయనమః ఓం గణాధిపాయనమః- ఓం ధూమకేతవేనమః - ఓం గణాధ్యక్షాయనమః - ఓం ఫాలచంద్రాయనమః - ఓం గజాననాయనమః - ఓం వక్రతుండాయనమః- ఓం శూర్పకర్ణాయనమః - ఓం హేరంబాయనమః - ఓం స్కందపూర్వజాయనమః - శ్రీ మహాగణాధిపతయేనమః - నానావిధ పరిమళ పత్రపుష్పాణి సమర్పయామి—

## ధూపము

శ్లో॥ వనస్పత్యుద్భవైర్దివ్యైర్నానాగంధైస్సుసంయుతః,
ఆఘ్రేయస్సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతాం.
ధూపమాఘ్రాపయామి—

## దీపం

శ్లో॥ సాజ్యమేకార్తి సంయుక్తం వహ్నినా యోజితంప్రియం
గృహాణ మంగళం దీపం త్రైలోక్యం తిమిరాపహాం।
భక్త్యాదీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే

ఇతి దీపందర్శయామి—ధూపదీపానంతరం ఆచమనీయం సమర్పయామి— నైవేద్యం సమర్పయామి—మధ్యేమధ్యే పానీయం ఉత్తరాపోశనం—హస్తప్రక్షాళనం—సమర్పయామి.

## తాంబూలం

శ్లో॥ పూగీ ఫలైస్సకర్పూరైర్నాగవల్లీ దళైర్యుతం,
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం।
ఇతి సదక్షిణ తాంబూలం సమర్పయామి—
నీరాజన మంత్రపుష్ప ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి-

శ్లో॥ యస్యస్మృత్యాచనామోక్త్యా తపఃపూజాక్రియాదిషు
న్యూనం సంపూర్ణతామేతి సద్యోవన్దే గణాధిపం॥
మంత్రహీనం క్రియాహీనం- భక్తిహీనం గణాధిప
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

ఉద్వాసన

యజ్ఞేన దేవతాస్సర్వేచాయజంత మతంద్రితాః
ప్రథమంతాని సర్వాణి ధర్మాణ్యాసంత్రివిష్టపే,
తేహనాకం మహిమానస్సచన్త యత్రపూర్వే సాధ్యాస్సన్తిదేవాః॥
వక్రతుండమహాకాయ సూర్యకోటిసమప్రభా
నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా॥
యాంతుదేవ గణాస్సర్వ పూజామాదాయసాంప్రతం,
ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం పునరాగమనాయచ॥
గణపతిం యథాస్థానం ప్రవేశయామి—



ఓం
శివ

# శివలింగధారులు గమనించవలసిన విషయములు

ఉత్థాన ప్రకరణము :

శివలింగధారులు సూర్యోదయమునకు పూర్వమే 5 ఘడియల ప్రొద్దు ఉన్నదనగా మేల్కొని తమ యిష్టలింగమును శివశివా యని కన్నుల కద్దుకొనుచు శయ్యనుండి లేచి కాలుచేతులు కడిగికొని మొగమున పొడి భస్మమును ధరియించి-

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితమ్ యేన తస్మైశ్రీ గురవేనమః॥

శ్లో॥ అశేష కామ్యార్థ ఫల ప్రదాయకాః
నిరంతరానంత విపత్తినాశకాః
భవాబ్ధి సంతారణ నావికాయమాన్
పునంతు మాహేశ్వర పాదపాంసవః

శ్లో॥ ప్రాతస్స్మరామి పరమేశ్వర పుణ్యనామ
శ్రేయఃప్రదం సకల దుఃఖ వినాశహేతుం
సంసారపాప తపనం కలికల్మషఘ్నం
గోకోటిదాన ఫలదం స్మరణేన పుంసాం.

అని గురుచరేశ్వరుల స్మరించి గతదినకృత పాపకార్యములకు పశ్చాత్తాపము చెంది ప్రకృత దినకృత్యము నాలోచించి గురుచరేశ్వర ప్రతిబింబములను దర్పణమును దర్శించి నిత్యకృత్యముల నిర్వర్తింప నారంభించవలెను.

౧. బహిర్విహారవిధి :

శైవులు పాదుకల తొడిగికొని జలపూర్ణకలశమును దండమును గైకొని గ్రామ బహిర్దేశమునకు వెళ్ళి జందెము, శివసూత్రము మెడ వెనుకవైపుకు వ్రేలాడవేసి తలకు బట్టచుట్టుకొని మలమూత్రముల విడిచి బావియొద్దకు వచ్చి, హస్త పాదముల కడిగికొని పుక్కిలించి వేయవలెను. పిదప జందెము నుపవీతముగా ధరించి శివలింగ పేటిక హృదయమునం దుండునటుల సరిచేయవలెను.

దంతధావనము :

వేప, కానుగు, తుమ్మ, ఉత్తరేణు పుడకలలో ఏదేని యొకటి తెచ్చికొనిగాని, దంతధావన చూర్ణముతోగాని, తర్జన వ్రేలును (చూపుడు వ్రేలును) వదలి తక్కిన వ్రేళ్ళతో పండ్లు తోముకొని నాలుక గీచికొని నీటితో ముఖమార్జనము చేసికొని శుభ్రమైన వస్త్రముతో తుడుచుకొనవలెను.

తరువాత పూజ కవసరమైన పంచపాత్ర, చెంబు, ఉద్ధరిణె ప్రభృతికపదార్థము శుభ్రముగా తోముకొని వస్త్రముతో తుడిచి, పవిత్రాసనము, విభూతిపండు, జపమాలలను సమకూర్చుకొని, వీనిని పరిశుద్ధప్రదేశమునందుంచి స్నానముచేయవలెను.

స్నానవిధి:

తిలకము దిద్దుకొనినప్పుడు శంభవేస్వాహా, శంకరాస్వాహా, శాంతాయస్వాహా అని ముమ్మారు ఆచమనముచేసి ప్రాణాయామము చేసి శివశివశంభో ఆజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబుద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే కృష్ణాకావేర్యోర్మధ్యదేశే సమస్తదేవతా మాహేశ్వర గురుచరణ సన్నిధౌ అస్మిన్వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన...సంవత్సరే...ఆయనే...ఋతౌ...మాసే...పక్షే. తిథౌ...వాసరే శివనక్షత్రే శివయోగే శివకరణే ఏవంగుణ విశేషణ విశిష్టే శుభే అభ్యుదయ ముహూర్తే మమ సమస్తపాపక్షయార్థం శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్స్నానం మహంకరిష్యే అని సంకల్పము చేసి గంగాధ్యానము చేయవలెను.

గంగాధ్యానం:

శ్లో॥ గంగా గంగేతి యో బ్రూయాద్యోజనానాం శతైరపి,
ముచ్యతే సర్వపాపేభ్యశ్శంభులోకం సగచ్ఛతి॥
అంబత్వద్దర్శనా న్ముక్తి ర్నజానే స్నానజం ఫలం,
స్వర్గారోహణసోపాన మహాపుణ్యతరంగిణి॥
యోఽసౌ సచ్చిత్సుఖవపుః పరమాత్మా పరశ్శివః,
స ఏవ రుద్రరూపేణ గంగాభో నాత్రసంశయః॥
విశ్వేశం మాధవం ఢుంఢిం దండపాణించ భైరవం,
వందే కాశీంగుహాం గంగాం భవానీం మణికర్ణికాం॥

భైరవప్రార్థన :

శ్లో॥ అతితీక్ష్ణ మహాకాయ కల్పాన్త దహనోపమ,
భైరవాయ నమస్తుభ్య మనుజ్ఞాం దాతు మర్హసి॥
త్వంరాజా సర్వతీర్థానాం త్వమేవ జగతః పితా,
యాచితో దేహి మేతీర్థం సర్వపాపాప నుత్తయే॥

అని ప్రార్థించి బొడ్డులోతు నీటనిలిచి శిఖను రెండుగా విడదీసి ముమ్మారు మునిగి శరీరము తోముకొనవలెను. పిదప శిఖను ముడి వైచి ఆచమనముచేసి మమ సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం పరమేశ్వరారాధనాది శ్రౌతస్మార్తనిఖిల ధర్మానుష్ఠాన యోగ్యతా సిద్ధ్యర్థం ప్రాతఃస్నాన మహంకరిష్యే.

అని సంకల్పముచెప్పి ఈ క్రిందిమంత్రముల నుచ్చరింపవలెను.

జలాభిమంత్రము :

ఆపోవా—ఆపఠం

శ్లో॥ గంగేచయమునే కృష్ణేగోదావరి సరస్వతీ
నర్మదే సింధుకావేర్యాజలేస్మిన్ సన్నిధింకురు॥

అని ప్రార్థించి శివశివాయని పలుకుచు హిరణ్యశృంగం పునః పునః. అని వరుణసూక్తము పఠించుచు స్నానము చేయవలెను.

మార్జనమ్ :

అపోహిష్ఠామ, హిరణ్యవర్ణ, పవమానస్సువర్జనః, పునాతు అను మంత్రములచే ఉదకమును బొటనవ్రేలితో శిరస్సున చల్లుకొని మరల స్నానముచేసి నమోగ్నయే-నమోభ్యః అని నమస్కారము చేయవలెను.

ఆలోడన పూర్వక మవగాహనమ్

ఋతదవాం క్రూరకమ్ - అఘమర్షణః అని మంత్రము చెప్పుచు బొటనవ్రేలుతో యజ్ఞోపవీతమును గ్రహించి ఆ వ్రేలితో ఉదకమును ప్రదక్షిణముగా త్రిప్పుచు ముమ్మారు స్నానము చేయవలయును.

అభిమంత్రణమ్.

ఇమమ్మే - సుషోమయ అను మంత్రముచే జలమును మంత్రించి-

అఘమర్షణ సూక్త పఠనం అవగాహనంచ - ఋతంచ మొదలు శిశ్వాధి అనువాకము అఘమర్షణ సూత్రము పఠించి ఉదకము వాసనచూచి పాపపురుషుడు చూర్ణమయ్యెనని యెంచి జలమును యెడమప్రక్క విడువవలయును. ఇదే అఘమర్షణము.

స్నానాంగ తర్పణము

ఏవంగుణ - పరమేశ్వర ప్రీత్యర్థం దేవాది తర్పణం కరిష్యే అని దేవతీర్థముతో తర్పణము చేయవలెను.

దేవతర్పణం :

౧. బ్రహ్మాదయో యే దేవాస్తాన్ దేవాగ్ స్తర్పయామి॥
౨. భూర్దేవాగ్ స్తర్పయామి॥
౩. భూవర్దేవాగ్ స్తర్పయామి॥
౪. సువర్దేవాగ్ స్తర్పయామి॥
౫. భూర్భువస్సువర్దేవాగ్ స్తర్పయామి॥

ఋషితర్పణం :

యజ్ఞోపవీతమును నివీతముగా (తావళము మాదిరిగా) ధరించి ఋషితీర్థముచేత రెండేసి పర్యాయములు తర్పణము చేయవలయును.

౧. కృష్ణద్వైపాయ నాదయో యే ఋషయస్తాన్ ఋషీగ్ స్తర్పయామి తర్పయామి॥

౨. భూర్ ఋషీగ్ స్తర్పయామి తర్పయామి।
౩. భువర్ ఋషీగ్ స్తర్పయామి తర్పయామి।
౪. సువర్ ఋషీగ్ స్తర్పయామి తర్పయామి।
౫. భూర్భువస్సువర్ ఋషీగ్ స్తర్పయామి తర్పయామి।

అగ్నిష్వాత్తాది పితృతర్పణమ్.

ప్రాచీనావీతిగా అనగా ఎడమ చేతిమీద జందెము వేసికొని మూడేసిమార్లు తర్పణము చేయవలెను.

౧. ఓం సోమః పితృమాన్ యమో௨ంగిరస్వా నగ్నిష్వాత్తాగ్నిః కవ్య వాహనాదయో యే పితరః తాన్ పితౄగ్ స్తర్పయామి తర్పయామి॥
౨. భూః పితౄగ్ స్తర్పయామి తర్పయామి తర్పయామి॥
౩. భువః పితౄగ్ స్తర్పయామి తర్పయామి తర్పయామి॥
౪. సువః పితౄగ్ స్తర్పయామి తర్పయామి తర్పయామి॥
౫. భూర్భువస్సువః పితౄగ్ స్తర్పయామి తర్పయామి తర్పయామి॥
తతః ఉదకప్రక్షేపణమ్.

యక్ష తర్పణమ్:

జందెము నుపవీతముగా ధరించి స్మృత్యాచమనము చేసి

శ్లో॥ యన్మయా దూషితం తోయం శారీరమల సంయుతం
తస్య పాప విశుద్ధ్యర్థం యక్ష్మాణం తర్పయామ్యహం॥

శ్లో॥ అసంస్కారాశ్చ యే కేచిజ్జలాశాః పితరో మమ
తేషా మాప్యాయ నార్థాయ దీయతే సలిలం మయా॥

ఈ శ్లోకమును చదువుచు దోసిలితో రెండుమార్లు ఉదకమును ఒడ్డున విడువవలయును.

వస్త్ర నిష్పీడనం :

శ్లో॥ యేకే చాస్మత్కులేజాతా అపుత్రాగోత్రిణోమృతాః
తే గృహ్ణన్తు మయాదత్తం వస్త్రనిష్పీడ నోదకం ॥

ఈ శ్లోకమును చదువుచు వస్త్రము నాలుగు మడతలుపెట్టి ఒడ్డున పిండుకొనవలయును. పిదప మంచి ప్రదేశమున వస్త్రము నారవేసికొని ఉచితప్రదేశమున పూజాపరికరములు గైకొని మధ్యన పెట్టికొనవలెను.

---

స్నానవిధి సమాప్తము

## మహా కైలాసము

గతసంచిక తరువాయి

పశ్చిమద్వారమున మహాశాస్త్రయు, వాయువ్య ద్వారమున దుర్గాదేవియు, ఉత్తరమున సుబ్రహ్మణ్యుడును, ఈశాన ద్వారమున గణపాలకుడయిన నందీశ్వరుడు నుండును. వీరికిగల అనుచరులకు లెక్కలేదు.

50 వేల యోజనముల వెడల్పుగల యీ పట్టణమునందు 10 వేల యోజనముల యెత్తున వజ్రమణి నిర్మితములగు 3 శిఖరములు గలవు. దానిలో 10 వేల యోజనముల యెత్తున పది శృంగములు గలవు. ఇవి పద్మరాగమణులచే చేయబడినవి. వాటిలోపల 3 యోజనముల యెత్తున ఒక కోటియోజనముల విశాలముగలవై వైడూర్య మణిఖచితములైన శిఖరములు గలవు. ద్వారమునకు వెలుపల 10 వేల యోజనముల విస్తీర్ణముగల భూమిగలదు. లోపల భూమి 40 యోజనముల విస్తీర్ణతగలిగియున్నది. ఈ భూమిలోగల శిఖరములమీద తారతమ్యము ననుసరించి సాలోక్యముక్తి చెందినవారుందురు. వా

మనస్సున కనుకూలమైన యిల్లు తోట బావి చెరువు నదీనదము లుండును.

ఈ భోగభూమి అప్సరస్త్రీలచేతను దివ్యములయిన పానీయ ములచేతను ఆహారపదార్థములచేతను నిండియుండును. అలంకృతములయిన శివగణములును - సౌందర్యముగల సురకన్యక లుండును. కల్పవృక్షములు కామధేనువులు చింతామణులు విశేషముగా నుండును. ఎవరెవరు యే వస్తువులను కోరుదురో ఆ వస్తువులు సిద్ధమై యుండును.



## శ్రీశైల క్షేత్రము

శ్రీశైల క్షేత్రమునకు 18 లక్షలు ఖర్చుపెట్టి తారురోడ్డు నిర్మించబడినది. బస్సు సర్వీసు యేర్పాటు చేయబడినది. రాష్ట్ర ప్రభుత్వం 20 వేలు ఖర్చుపెట్టి సత్రం కట్టించదలచినది. ఇదిగాక 100 గదులతో ఆధునిక పద్ధతులతో లక్షరూపాయలు ఖర్చుపెట్టి నిర్మించటానికి ప్రయత్నములు జరుగుచున్నవి. 50 వేల రూపాయలు ఖర్చుపెట్టి 12 భవనాలు కట్టించినారు. గవర్నరుగారు యిదివరకే అమూల్యమైన ఆభరణం స్వామివారి కర్పించినారు. దానివిలువ యెంతో యిప్పటికి నిర్ణయించబడలేదు. అనంతపురం వర్తకులు మల్లికార్జునస్వామివారి పూజకై రజతపాత్రలు సమర్పించుతారట. ఇంకను తదభివృద్ధికై ధర్మాత్ములు ప్రయత్నిస్తున్నారు. (ఆంధ్ర పత్రిక 3-10-57, నేటివరకు శ్రీశైల క్షేత్రమున ఆచార్య స్థానము వహించినది ఆరాధ్యులే. ఆరాధ్యులలో శ్రీపతి పండితారాధ్యులవారి పీఠమందే యున్నది. తదితర పీఠములు శిథిలావస్థ నొందుచున్నవి. ఇట్టి మహాస్థలమును నేటికి అఖిలభారత దేశ తీర్థయాత్రా స్థలముగా నొనర్ప సంకల్పించిన పుణ్యాత్ముల కందరికి మా ధన్యవాదములు.

# భ్రామరీ శతకము

భ్రామరీ శతకము : ఇందు 151 పద్యములతో శ్రీశైల భ్రమరాంబిక నుతింపబడినది. గ్రంథకర్త ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి గారు (సికింద్రాబాద) వీరు శివపురాణము, పారదత్త విజయము, సుభద్రా కళ్యాణము మున్నగు గ్రంథముల రచించిరి. వీరి కవిత్వము ద్రాక్షాపాకము గలిగి నన్నయ తిక్కనాది ప్రాచీనకవుల కవితా ధాటితో తులతూగుచుండు స్వభావోక్తులు మెండు. మచ్చునకు 2 పద్యము లుదహరించుచున్నాడ.

మ. తలలేదించుక జుట్టుయేని, మొకమందా లేదు బొట్టైద్దియున్
తొలిపల్కక్షరమేని నాల్కగన దెందుం బెద్ద టోపీలు లా
గులునుం గోటులు వేసియుందురెటుల న్గుర్తింపకావచ్చు బా
పలు వీరంచు; నొకండు చెప్పినను విశ్వాసంబెటుల్ భ్రామరీ॥

మ. వేదంబొప్పికొనంగరాదు మటి యవ్వేదోక్త కర్మాళి నా
మోదింపం దలపెట్టరాదు మఱియన్ మాధ్యంబునుం బూనగా
రాదే దైవతమూర్తినిం గొలువగా రాదంచు వాదించు దు
ర్బోధ ద్వాంతులు బోధ్ధలైరి కనరాదే తల్లిరో భ్రామరీ॥

---

# సద్గురు ప్రభూ

(అనుమోజు కోట్లింగాచార్యులు)

చం. కురుతలమార్చి పాండవుల కోరికదీర్చి యనేకదైత్యసం
హరణ మొనర్చి మాతృపితాదుల మేలొనగూర్చినట్టి యా
హరి తనదా పురాకృతఫలంబునగాదె తలంప నీచుడౌ
మొరకని యమ్మదాకి కుతికెండి యరణ్యములోన నొంటిగా
నొరిగె భువింజయింపనెవడోపు విధిన్నివ సద్గురుప్రభూ॥

ఉ. అన్న సమస్తలోకముల కాయువునివ్వనశక్తి తింత్రి యా
పన్నశరణ్యుడౌ తనదు మామ సుధాకరమూర్తియైన వా
డిన్నిటయొవ్వ కాముడు మహేశునిచేత ననంగుడయ్యెగా
మున్నె పురాకృతానుభవము న్విడజాలరు సజ్జనప్రభూ!

---

## దశావధానములు

(ముదిగొండ రామలింగశాస్త్రిగారు - ఈమణి)

శివపూజా సమయమునందు శివపూజను షట్స్థల విధానముతోఁ జేయవలయును. భక్తస్థలములో భస్మరుద్రాక్షుల ధరించి, దీపారాధనచేసి, గణానుజ్ఞనొంది, ప్రాణాయామముచేసి, దేశకాల సంకీర్తను గావించి సంకల్పము చేయవలెను.

మహేశ్వరస్థలమునందుఁ దన వామహస్తము నభిమంత్రించి, భస్మాసనము నేర్పరచి, యిష్టలింగమును లింగపేటికనుండి తీసి కర పీఠమునం దుంచుకొని ఆవాహనముచేసి షడక్షరీ మహామంత్రమును అంగన్యాస కరన్యాసపూర్వకముగా జపింపవలయును.

మూడవది ప్రసాదిస్థలం. ఇందు లింగముమీద భస్మ మునిచి లింగమును ఱెప్పలార్పక నిరీక్షించవలయును. ఇదియే లింగనిరీక్షణ. దీనిని దశావధాన పూర్వకముగ నొనరింపవలయును.

### ప్రథమావధానము

ఇందు దృక్పటుత్వము, దృగ్విన్యాసము, దృగ్విలీనత్వము, దక్స్థిరత్వము అను నాలుగు విషయములు గలవు. ఈ నాలుగుచేరి ప్రథమావధాన మగును.

దృక్పటుత్వం :- దృష్టి మనస్సుతోను ప్రాణముతోను గూడి యిష్టలింగమునందు లగ్నమగుటయు, దృష్టియను గోడయందు లింగ

స్వరూపము చిత్రింపఁబడినట్లు భావించుటచే దృష్టిలింగరూపము నొందు టయు, బంగరుతో ప్రతిమచేయఁగా బంగారము ప్రతిమారూపము నొందినవిధమున తనదృష్టి లింగాకారము నొందుటయు దృక్పటుత్వ మగును.

దృగ్విన్యాసః :– గణేశ్వరుడు చూచునట్లు తంబుర తీగలుం బోలు చూపులతో శివునిచూడవలయును. మఱియు దేవతలు చూచు నట్లు అంగవికార రహితంబుగను నందీశ్వరుడు గాంచునట్లు లవినా భావంబుగను లింగమును చూచుచుండుట దృగ్విన్యాస మనంబడును.

దృగ్విలీనత్వము :– గురుడు చెప్పినమంత్రములు శిష్యుని చెవి యందు లయించునట్లు సాధకుని దృష్టి చేతియందుంచిన యిష్టలింగ మున లయించునట్లు సాధకునిదృష్టి చేతియందుంచిన యిష్టలింగమున లయింపవలయు. వేదాంతములు శివుని ధరించినట్లును, లతలు కల్ప వృక్షమును జుట్టుకొనునట్లును, బాణము లక్ష్యమునందు నాటునట్లును, పుత్రులు తండ్రిని కౌగలించుకొను నట్లును, త్రాళ్లు మదపుటేనుగును బంధించునట్లును, ఎఱుకువాడు వేసినవల మృగమును బంధించునట్లును, భార్యను భర్తకౌగలించుకొనునట్లును, శిల్పిపట్టిన సూత్రము శిల్ప మును గూడునట్లును, గంధద్రవ్యముల సువాసన శరీరమునకు బట్టు నట్లును,నదులు సముద్రమున లయించునట్లును,ఎఱ్ఱగదాల్చినలోహము నందు నీ రింకిపోవునట్లును తన దృష్టి శివునందు లీనమగుట దృగ్విలీనత యనబడును.

దృక్స్థిరత్వం :– దృష్టి నేత్రాంతము నొందకయు, నీరుగ్రమ్మ కయు, లింగము మీఁదినుండి చలింపకయు, క్రూరభావములేకయు, మాంద్యము లేకయు నిట్లు అంగగుణములులేక స్థిరముగా నుండుట దృక్స్థిరత్వ మనబడును. [సశేషము]

# శైవగ్రంథమాల

| | | | |
|---|---|---|---|
| 1. | సంధ్యావందనము | ... | 0—8—0 |
| 2. | ఆంజనేయ స్వరూపనిరూపణము | ... | 0—8—0 |
| 3. | భగవద్గీత | ... | 6—0—0 |
| 4. | శైవాహ్నికము | ... | 1—0—0 |

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు ఉత్తరము వ్రాయవలెను.

# శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అడ్రస్ :— 1

## ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వ రం గ ల్

అడ్రస్:— 2

## ముదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) దుగ్గిరాల

:— వ్యాసములు - ఉత్తరములు - బ్లాకులు :- శంకాబోధనము
ఈ పై అడ్రస్సులలో నొకదానికి పంపించవలెను.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# శైవమతప్రకాశిక

[illegible]

[illegible]

| సంపుటము | హేవళంబి సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౮ | 15—11—1957 | ౭ |


సంపాదకులు :

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.

*Principal Ayurvedic college & Superintendent*
*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు :

ముదిగొండ రామలింగశాస్త్రి

శాస్త్రకోవిద.


శ్లో॥ శ్రీ వేదశాస్త్రోక్తతత్త్వప్రభాసికా
సందేహసందోహమహానిరాసికా ।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా
జయత్వియం శైవమతప్రకాశికా ॥


శ్రీ శైవ మహా పీఠము

స్టేషన్‌రోడ్డు, శ్రీ విశ్వేశ్వర దేవాలయము

వరంగల్

# విషయ సూచిక

# సంపాదకీయము

ప్రపంచమున ప్రతి వ్యక్తి యభిలషించునది శివానందము. తత్సాధకములు-నిగమాగమములు. తదనుసారముగా మానవులు ధర్మా[illegible]ర్థ కామమోక్షము లను చతుర్విధ పురుషార్థముల సాధించుచున్నారు. ఈ నాల్గింటిలో మోక్షము ప్రధానము. ముక్తి మార్గమును కాలక్షేపముగ వివరించుటకు నిక భాషలసద్గ్రంథములు-ఉపనిషత్తులే కాక తదర్థబోధకములయిన-బ్రహ్మసూత్రములు భగవద్గీతలుకూడ. శైవమహాపీఠము 30 సంవత్సరములనుండి భాష్యత్రయము ముద్రింపించ మహాప్రయత్న మాచరించుచున్నది. వరంగల్ నగరమున విశ్వేశ్వర దేవాలయమును నిర్మించి సంస్కృతాంధ్ర కళాశాలను స్థాపించి శైవధర్మము లనేకము లాచరించిన కీ॥ శే॥ ఆకారపు నరసింగం గుప్తగారు, జగద్గురు నీలకంఠాచార్యులవారు రచించిన బ్రహ్మసూత్ర భాష్యమును ముద్రింపించి శైవసంఘమునకు మహోపకార మొనర్చి యున్నారు.

శ్రీయుత కొమరవెల్లి బాలరాజగుప్తగారు భగవద్గీతాభాష్యమును ముద్రింపించి యున్నారు. గీతాభాష్యము కావలసిన మాహేశ్వరులు వారిపేరున ఉత్తరమువ్రాసిన యుచితముగ బడయగలరు.

శైవమహాపీఠము వరంగల్ నగరమున నెలకొల్పిననాటినుండి కార్యాలయమున జరుగుచున్నపని చివికి చీకిపోవుచున్న తాళపత్ర గ్రంథములతో వ్రాతప్రతులతో సరిచూచి అచ్చువేయుట కర్హమగు నటుల తిరిగి ఉపనిషద్భాష్యము అచ్చుకాపీలు వ్రాయుటయే.

ఇట్టి మహాత్కార్య నిర్వహణములో పీఠాధిపతులకు విద్యాప్రవీణ ముదిగొండ శంకరశాస్త్రి ప్రభృతులు తోడ్పడుచున్నారు. ఇయ్యది సమాప్తమయిన వెంటనే ఉపనిషద్భాష్యము కూడ ముద్రించ బడును.

ముద్రణమునకగు ధనవ్యయము భరించుటకు సాహాయ్యము చేసిన వదాన్యచూడామణులు నరసింగపురమున సుప్రసిద్ధ సత్కీర్తి మణులు - ఇష్టలింగధారులు శైవ మతాభిమానులైన కొండపాటి నాగలింగశ్రేష్ఠిగారు, బుచ్చి రాజలింగశ్రేష్ఠిగారు, మంగయ్య లింగం శ్రేష్ఠిగారు.

వీరు బళ్లారి క్షేత్రములోనున్న జన్మస్థలములో గొప్ప శివాలయము ను కట్టించి నేటివరకు క్రమముగ పూజామహోత్సవాదులు మహా వైభవముగ చేయుచున్నారు. శివాలయ తంత్ర మను మంత్రశాస్త్ర గ్రంథమును మల్లికార్జున పండితారాధ్య చరిత్రమును శైవాచార్య చరిత్రమును ముద్రించి శివార్పణ బుద్ధితో అందరికి ఉచితముగా పంచియున్నారు.

ఇంతియేగాక శైవమహాపీఠమునందు వీరు శాశ్వతసభ్యులు - శైవమహాపీఠ భవననిర్మాణమునకై 900—0—0 రూపాయలు యిచ్చియున్నారు. వీరు మాహేశ్వరాచార పరాయణులు - శైవ మతోపకారకులయిన వీరు త్వరలో భాష్యమును ముద్రింపించి శైవుల మనోరథముల నెరవేర్తురని మా సలహా. శైవమత విజయ స్తంభములలో నొక స్తంభమున సువర్ణాక్షరములతో వారి నామ ములు లిఖింపించి ఆచంద్రార్కము వారి యశశ్చంద్రికల ప్రకాశింప చేయవలెనని మా తలంపు.





# అభ్యర్థన

శైవులున్న ప్రతి గ్రామమునుండియు - పట్టణమునుండియు శైవ మత ప్రకాశికను యింకను నభివృద్ధి పరచుటకు శైవులలో యువకు లయిన కార్యకర్త లపేక్షింపబడుచున్నారు. పత్రికకు వ్యాసములు సమకూర్చుట - శుభాశుభసమయములందు విరాళములు - చందాలు వసూలుచేయుట - మున్నగు కృత్యముల వారు నిర్వహించవలెను. అట్టి యుత్సాహవంతులున్న మా కార్యాలయమునకు తెలుప గోరు చున్నాము.

మా వరంగల్ నగరమున - విరాళముల వసూలుచేయుటకు - శివతెంకె అమరరాజలింగముగారు - చందాలు వసూలుచేయుటకు నందిగాము పుల్లయ్యగారు - ఏర్పాటు చేయబడినారు - విరాళముల ఖాతా ప్రతినెల ప్రకటింపబడును - ప్రతి యూరునుండికూడ విరాళముల వసూలుచేసి పంపించ సంఘాభిమానులు - కోరబడుచున్నారు.

| పేరు | గ్రామము | విరాళము | తేది |
|---|---|---|---|
| 1. చాగంటి భాస్కరలింగశాస్త్రి గారు కాశీయాత్రా సమారాధనలో గంగపూజా సమయమున యిచ్చినది. | వరంగల్లు | 1-0-0 | 1-10-57 |
| 2. కొండూరి బుచ్చిరాజలింగం శ్రేష్ఠిగారు - వారిగిన్నీలో జరిగిన మాహేశ్వర సమారాధనలో యిచ్చినది. | వరంగల్లు | 6-0-0 | 1-10-57 |
| | | 7-0-0 | |

# శైవమత ప్రకాశిక (సచిత్ర మాసపత్రిక)

కార్యనిర్వహణము 1957-1958

ప్రవేశకులు – శివాశ్రమము

వ్యవస్థాపకులు – మురిగొండ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

సంపాదకులు – మురిగొండ సద్గిరీశ్వరశాస్త్రిగారు

సహాయ సంపాదకులు – భాషాప్రవీణ మురిగొండ ...లింగశాస్త్రి

గారు – తెనాలి


## వ్యాసరచయితలు

శైవసంయమాభిమానులు - శైవపండితవర్గము

## నియమములు

1. పత్రికకు యే నెలలో చందాయిచ్చినను – చాంద్రమానరీత్యా చైత్రమాసము మొదలు – ఫాల్గుణ బ 30 వరకు చందాదారుగ నెంచబడును.
2. వ్యాసముల నొకవైపుననే విడివిడిగా పెద్ద అక్షరములతో వ్రాసి పంపవలెను. ప్రకటించిన వ్యాసములు తిరిగి పంపబడవు.
3. ప్రతి ఇంగ్లీషునెల 15 వ తేదీ పత్రిక వెలువడును.
4. ఫోటోలు వేయించుకొనదలచువారు – 10-0-0 లు బ్లాకుకై పంపవలెను.
5. పత్రికలు 25 వ తేదీలోపుగ చేరనిచో ఉత్తరము వ్రాయవలెను. తరువాత సంపాదకుల జవాబుదారి లేదు.
6. మనోహరములయిన చిన్న వ్యాసములు ప్రకటించబడును.
7. చందా సం॥ నకు రు 3-0-0 లు యీయవలెను.

# అభ్యర్థన

శైవులున్న ప్రతి గ్రామమునుండియు - పట్టణమునుండియు శైవ సంతతి ప్రకాశికను యింకను నభివృద్ధి పరచుటకు శైవులలో యువకు లయిన కార్యకర్తలపేక్షింపబడుచున్నారు. పత్రికకు వ్యాసములు చందాదార్లు - శుభాశుభసమయములందు విరాళములు - చందాలు వసూలుచేయుట - మున్నగు కృత్యముల వారు నిర్వహించవలెను. ఇట్టి యుత్సాహవంతులున్న మా కార్యాలయమునకు తెలుప గోరు చున్నాము.

మా వరంగల్ నగరమున - విరాళముల వసూలుచేయుటకు - శ్రీ శైవ ఆముదాల జలింగముగారు - చందాలు వసూలుచేయుటకు నందిగాము పుల్లయ్యగారు - ఏర్పాటు చేయబడినారు - విరాళముల ఖాతా ప్రతినెల ప్రకటింపబడును - ప్రతి యూరునుండికూడ విరాళముల వసూలుచేసి పంపించు సంఘాభిమానులు - కోరబడుచున్నారు.

| పేరు | గ్రామము | విరాళము | తేది |
|---|---|---|---|
| 1. చాగంటి భాస్కరలింగశాస్త్రి గారు కాశీయాత్రా సమారాధనలో గంగపూజా సమయమున యిచ్చినది. | వరంగల్లు | 1-0-0 | 1-10-57 |
| 2. కొండూరి బుచ్చిరాజలింగం శ్రేష్ఠిగారు - వారిగిన్నిలో జరిగిన మాహేశ్వర సమారాధనలో యిచ్చినది. | వరంగల్లు | 6-0-0 | 1-10-57 |
| | | 7-0-0 | |

# శైవమత ప్రకాశిక (సచిత్ర మాసపత్రిక)

కార్యనిర్వాహకవర్గము 1957-1958

పర్యవేక్షకులు – పీఠాధిపతులు
స్థాపకులు – ముదిగొండ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
సంపాదకులు – ముదిగొండ మల్లికార్జునరావుగారు
సహాయ సంపాదకులు – భాషాప్రవీణ ముదిగొండ నాగలింగశాస్త్రి గారు – ఈమని

## వ్యాస రచయితలు

శైవసంఘాభిమానులు - శైవపండితవర్గము

## నియమములు

1. పత్రికకు ఏ నెలలో చందాయిచ్చినను – చాంద్రమానరీత్యా చైత్రమాసము మొదలు – ఫాల్గుణ బ 30 వరకు చందాదారుగ నెంచబడును.
2. వ్యాసముల నొకవైపుననే విడివిడిగా పెద్ద అక్షరములతో వ్రాసి పంపవలెను. ప్రకటించిన వ్యాసములు తిరిగి పంపబడవు.
3. ప్రతి ఇంగ్లీషు నెల 15 వ తేదీ పత్రిక వెలువడును.
4. ఫోటోలు వేయించుకొనవలయువారు – 10–0–0 లు బ్లాకుకై పంపవలెను.
5. పత్రికలు 25 వ తేదీలోపుగ చేరనిచో ఉత్తరము వ్రాయవలెను. తరువాత సంపాదకుల జవాబుదారి లేదు.
6. మనోహరములయిన చిన్న వ్యాసములు ప్రకటించబడును.
7. చందా సం॥ నకు రు 3–0–0 లు యీయవలెను.

8. చందా వ 1-0-0 లు ముందుగా చెల్లించనిది పత్రిక రాదు.
9. శైవ సంఘాభివృద్ధికరమయిన సర్వవిషయము లిందు ప్రకటింప బడును.
10. ఆస్తిక శాఖ సంవత్సరాంతమున లెక్కలను ప్రకటించును.

---

# యజ్ఞోపవీత ధారణవిధి

## సంకల్పము

ఆచమ్య॥

ప్రాణానాయమ్య దేశకాలౌ సంకీర్త్య

మమ శ్రౌతస్మార్త నిత్యకర్మానుష్ఠాన యోగ్యతాఫల సిధ్యర్థం యజ్ఞోపవీత ధారణం కరిష్యే॥

## అలంకరణం

అని సంకల్పముచెప్పి యజ్ఞోపవీతత్రయము నలంకరించి గాయత్రి దేవతను ధ్యానించి ఈక్రింది మంత్ర ముచ్చరించుచు కుడిచేతిమీదుగా ధరించవలెను.

## ధా ర ణ ం

యజ్ఞోపవీతం పరమంపవిత్రం। ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్।
ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచశుభ్రం। యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥

అని ఒక యజ్ఞోపవీతమును ధరించి—ఆచమనముచేయవలెను—
ద్వితీయయజ్ఞోపవీతధారణం మమనిత్యకర్మానుష్ఠాన యోగ్యతాసిద్ధ్యర్థం ద్వితీయ యజ్ఞోపవీతధారణం కరిష్యే॥

అని పైమంత్రముచ్చరించుచు 2 వ యజ్ఞోపవీతము ధరించవలెను.

### తృతీయ యజ్ఞోపవీతధారణం

ఆచమనముచేసి – ఉత్తరీయార్థం తృతీయ యజ్ఞోపవీతధారణం కరిష్యే.

అని సంకల్పించి పూర్వముమాదిరిగ పైమంత్రముచే తృతీయ యజ్ఞోపవీతమును ధరించవలెను.

తరువాత రెండు జందెములకలిపి పట్టుకొని పదిసార్లు గాయంత్రీ మంత్రము జపించవలెను. పిమ్మట రెండుమార్లు ఆచమనముచేసి – యీ క్రింది శ్లోకము చదువుచు జీర్ణోపవీతమును తీసివేయవలెను.

### జీర్ణోపవీత విసర్జనం

శ్లో॥ ఉపవీతం ఛిన్నతంతుం ।
జీర్ణం కశ్మలదూషితం ।
విసృజామి యశోబ్రహ్మ ।
వర్చో దీర్ఘాయురస్తుమే ॥



## శివసూత్ర ధారణవిధి

శైవులు తమ శివసూత్రము శిథిలమైనపుడు, నూతనసూత్రము ధరించవలెను. శివసూత్ర మనగా బంగారముతోగాని, వెండితోగాని చేయబడిన లింగకాయను మెడలోగట్టుకొనుట కుపయోగించిన త్రాడునకు పేరు. ఈ సూత్రమునందు 1–3–6–9–36 సూక్ష్మ తంతువు లుండవచ్చును.

పట్టుత్రాడుగాని, బంగారుత్రాడుగాని, కదురుతో వడికిన దారము గాని వాడుకొనవచ్చును. శివసూత్రము విచ్ఛిన్నమయినపుడు నూత్న సూత్రమును తెచ్చి కుంకుమతో భస్మముతో దాని నలంకరించి లింగ

కాషాయతో గూడిచ్చి ముడిముళ్లు గట్టిగవేసి మూలమంత్రమునుగాని, ఈ క్రింది మంత్రములనుగాని ఉచ్చరించుచు మెడలో ధరించవలెను.

శ్రు॥ క్షరం ప్రధానమమృతాక్షరం హరః।
క్షరాత్మానావీశతే దేవ ఏకః॥
తస్యాభిధ్యానాద్యోజనాత్తత్వభావాత్।
భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః॥

శ్లో॥ మాయా తత్ర జీవ శివావసా గురుః।
శివస్య శిష్యః ఖలు జీవ సంజ్ఞకః।
లింగంచ జ్యోతిర్ద్వహాద ప్రకాశకం।
ప్రాణాసిలోయం శివసూత్ర ముచ్యతే॥

## శివపూజావిధి

శివలింగధారులొనర్చు శివపూజ నాల్గువిధములుగ నున్నది.

1. మజ్జనము
2. అవసర పూజ
3. లఘు శివపూజ
4. మహాశివ పూజ

### మజ్జనవిధి

ఇది రెండు విధములు

1. చరలింగధారులు చేయువిధానము
2. చరవిడిపించి శివపూజపట్టనివారు చేయువిధానము.

### చరలింగధారులు

గురువువలన శివలింగధారణ దీక్షనుపొంది 3 రోజులు పసుపు వస్త్రమునందు లింగమును మెడలో కట్టుకొని 4 వ రోజున గురువు

వలనగాని - మహేశ్వరునివలనగాని - లేక వెండిచేత చేయబడిన నాగవాసములమధ్య దూదిలో పట్టువస్త్రముతో చుట్టిన లింగమూర్తి నుంచి కొత్త దారములతో జాలివోసి దానిపైన లక్క వేయబడిన లింగకాయను పట్టుత్రాడుతో చంక క్రిందిగా మెడలో ధరించిన బాల బాలికలు - చరలింగధారులు ఉపనయనము కాగానే బాలురును - వివాహముకాగానే బాలికలును 8 వ వత్సరము మొదలు 16 వ వత్సరములోపల శాంభవదీక్ష నొందవలెను. ఇట్టివారే చరలింగధారులు అనబడుదురు.

వీరు స్నానము సంధ్యావందనము చేసిన పిమ్మట షడక్షరీ మంత్రము 103 సార్లు జపించి భోజనము చేయవలెను.

షడక్షరీ జపవిధి

అస్యశ్రీ షడక్షరీ మహామంత్రస్య । పరబ్రహ్మాఋషిః । గాయత్రీ ఛందః । పరశివో దేవతా । ఓం బీజం । నమశ్శక్తిః శివాయేతి కీలకం । మమ పరశివప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ॥

కరన్యాసము

ఓం అంగుష్ఠాభ్యాం నమః
నం తర్జనీభ్యాం నమః
మం మధ్యమాభ్యాం నమః
శిం అనామికాభ్యాం నమః
వాం కనిష్ఠికాభ్యాం నమః
యం కరతల కరపృష్ఠాభ్యాం నమః

హృదయాదిన్యాసము

ఓం హృదయాయ నమః
నం శిరసే స్వాహా

మం శిఖాయై వషట్

శిం కవచాయహుం

వాం నేత్రత్రియాయ వౌషట్

యం అస్త్రాయఫట్

భూర్భువస్సువరోం – రెండుమ్రేళ్ళను తగిలించి

ధ్యానం

శ్లో॥ చైతన్యం పరిపూర్ణ మేకమచలం । జ్యోతిర్మయం వ్యాపకం
తత్పంచాక్షరమంత్ర వాచ్యమమలం । సూక్ష్మాతి సూక్ష్మంపరం
లింగంబ్రహ్మసనాతనం । సుమనసాధ్యా తవ్యరూపం సదా
బాహ్యాభ్యంతర సంస్థితం పరశివం । ప్రాణేశ్వరంభావయే.

గురుధ్యానము

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాం జనశలాకయా
చక్షురున్మీలితంయేన తస్మై శ్రీ గురవేనమః.

అని గురువుకు నమస్కరించి తన మెడలోనున్న రుద్రాక్ష మాలికమును తీసికొని 108 మార్లు షడక్షరీమంత్ర జపము చేయవలెను. తరువాత మరల షడక్షరీమంత్ర దేవతాధ్యానముచేసి

ఓం భూర్భువస్సువరోం –

పరశివార్పణం

"మయాకృత మేత త్సర్వం పరశివార్పణమస్తు"

అనుచు–ఉద్ధరిణెడు నీరునుతన చేతినుండి అభిషేకపళ్లెములోవదలవలెను.

భోజనవిధి

వండిన పదార్థములన్నియును విస్తరియందు వడ్డించిన తరువాత ఒక ఉద్ధరిణెడు నీరు చేతిలో పోసికొని " ఓం భూర్భువస్సువః – తత్స

వితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి - ధియోయోనః ప్రచోదయాత్"
అను మంత్రము చదువుచు విస్తరిమీద నీళ్లుచల్లి "సత్యం త్వర్తేన పరిషించామి" అని పగటిపూటను - "ఋతంత్వా సత్యేన పరిషించామి" అని రాత్రిపూటను చదువుచు విస్తరిచుట్టు నీరు త్రిప్పుచు విడువవలెను.

తరువాత తన చరలింగమును యెడమచేతితో పట్టుకొని ఓం ఆచారలింగ గురులింగ శివలింగ చరలింగ ప్రసాదలింగ మహాలింగ ముఖేభ్యస్వాహా అని ఉచ్చరించుచు తన లింగమునకు కుడిచేతితో నివేదనము చేయవలెను.

తరువాత కుడిచేయి అరచేతిలో నీరు పోసికొని అమృత మస్తు అమృతోప స్తరణమసి అని ఆ జలము నోటిలో పోసికొని ఎడమచేయి మధ్య వ్రేలిని విస్తరి యందుంచి -

ఓం ప్రాణాయస్వాహా
ఓం అపానాయస్వాహా
ఓం వ్యానాయస్వాహా
ఓం ఉదానాయస్వాహా
ఓం సమానాయస్వాహా
ఓం బ్రహ్మణేస్వాహా

అని 6 సార్లు ఆరు మెతుకులను నోటిలో వేసికొని విస్తరిలోని చేతి వ్రేలినితీసి ఈశాన్యదిక్కునందు పోసిన నీటిని ముట్టికొని తన వ్రేలిని తీసికొని భుజించవలెను. భోజనానంతరము "అమృతాభి ధానమసి" అని చేతిలో నీరు పోసికొని కొంత త్రాగి శేషమును

శ్లో॥ రౌరవేఽపుణ్యనిలయే పద్మార్బుద నివాసినాం
అర్థినాముదకందత్త మక్షయ్య ముపతిష్ఠతు.

అనుపు క్రింద విడువవలయును. అనంతరము చేయి కడుగు కొని - పుక్కిలించి చిమ్మి వేసి - కాళ్లుచేతులు తుడిచికొని తాంబూలము వేసికొని నిత్య కృత్యములు నిర్వర్తించుకొనవలెను.

భుజించునపుడు ఆద్యంతములయందు ద్రవపదార్థములను - భుజించవలెను. తూర్పు - దక్షిణము - పడమర ముఖముగ కూర్చుండి భుజించిన - ఆయువు - శ్రీ - ఐశ్వర్యము - కీర్తియు కలుగును.

## చరలింగధారణగల బాలికల పూజావిధానము

బాలికలు స్నానానంతరము శుభ్రవస్త్రముధరించి ముఖమున కుంకుమబొట్టుపెట్టుకొని - ఈ క్రింది శ్లోకముతో -

## పరశివధ్యానం

శ్లో॥ చైతన్యం పరిపూర్ణ మేక మచలం జ్యోతిర్మయం వ్యాపకం
తత్పంచాక్షరమంత్ర వాచ్యమమలం సూక్ష్మాతి సూక్ష్మంపరం
లింగంబ్రహ్మసనాతనం సుమనసాధ్యా తద్వ్యరూపం సదా
బాహ్యాభ్యంతర సంస్థితం పరశివం ప్రాణేశ్వరం భావయే.

అని శివలింగధ్యానముచేసి షడక్షరీమంత్రమును 108 సార్లు ప్రతిరోజు జపముచేసి తిరిగి పై శివధ్యానమును మరల చేసి

తత్సర్వం పరశివార్పణమస్తు -
అని నీరు పళ్లెములో వదలవలెను -

## భోజనవిధి

విస్తరిలో అన్నముపడ్డించిన తర్వాత - ఓం ఆచారలింగ - గురులింగ - శివలింగ - చరలింగ - ప్రసాదలింగ మహాలింగ ముఖేభ్య స్వాహా అని చరలింగము ఎడమచేతితో పట్టుకొని నివేదనచేసి భుజించవలెను.

ఏ పదార్థములు తాను తిన్నను తనలింగమునకు నివేదించి తినవలెను.

రజస్వలకాగానే స్త్రీలు - చరవిడిపించుకొని మజ్జనము పెట్టుకొనవలెను.

చరనుండి శివలింగమును మహేశ్వర పాదపూజచేసి విడిపించి కొనిన యిష్టలింగధారులు శైవమత ప్రకాశిక 6 సం॥ 1 వ సంచికలో వ్రాసిన విధముగ ప్రతిదినము మజ్జనము నిర్వర్తించి - షడక్షరిని జపించి చరలింగధారులవలె నివేదన సూచరించవలెను. 16 నుండీ 20 వత్సరములలోపు వయస్సుగలవారు తప్పక మజ్జన మొనర్చుకొనవలెను - చరలింగధారుల మాదిరి భోజనాది కృత్యముల చేసికొనవలెను.

ఇదియే చరవిడిపించి శివపూజపట్టని శివలింగధారుల విధానము.

ఇక ముందు - అవసరపూజనుగూర్చి వివరించుదుము.



# మహా కైలాసము

(గతసంచిక తరువాయి)

ఇంతేగాక సారూప్యముక్తిని, సామీప్య ముక్తిని పొందుచున్నారు. లోపలశిఖరములయొక్క కాంతులచేత దిక్కులు ప్రకాశించుచుండును. 40 వేల యోజనములయెత్తున 10 కోట్ల పుష్యరాగములచేత చిత్రింపబడిన నొక శిఖరముగలదు. అచ్చట శివపూజచేయు గంధర్వులు, యక్షులు, కిన్నరులు, గరుడులు, నాగులు మొదలగువారు ఎప్పుడును భోగము లనుభవించుచుందురు.

దానిలోపల 50 వేల యోజనములయెత్తున కోటిగోమేధికముల చేత ఏర్పరచబడిన శిఖరముగలదు. ఇక్కడ వారివారి పదభ్రష్టులైన ఇంద్రగణము శివారాధన చేయుచుందురు.

దీనితర్వాత 80 యోజనములయెత్తున 10 లక్షల నీలములతో కట్టబడిన శిఖరప్రదేశముగలదు. ఇక్కడ పదభ్రష్టులైన చతుర్ముఖ బ్రహ్మలు శివపూజ చేయుచుందురు.

దానితర్వాత గారుత్మతమణులచే కట్టబడిన లక్షశిఖరములు గలవు. ఇక్కడ లింగమూర్తి కనేకులు శివపూజ చేయుచుందురు. వీరి అధికారకాలము ముగిసినతర్వాత శివధ్యానముద్వారా తపుదోషము నుండి విముక్తులై అక్కడకు 70 వేల యోజనములయెత్తున నున్న శిఖరములయందు నివసించుచు సాయుజ్యముక్తిని పొందుదురు.

దీనికిపైన 40 వేల యోజనములఎత్తున 10 వేల యోజనములు వెడల్పుగల ముత్యాలశిఖరముల మందిరముగలదు. దీనియందు పశు పాశజ్ఞాన సహితులై గురుసేవయొనర్చి సారూప్యముక్తినిపొంది — హృదయమున శివధ్యానము చేయువారుందురు. పెద్దలయందు దయ గలిగి నిత్యముక్తి గల్గియుందురు. శివాజ్ఞచే నిత్యము కైలాసమందు వసించుచు తమ తేజస్సుచేత ప్రకాశమానులై యుందురు.

దీనిలోపల 90 వేల యోజనములయెత్తున ఒక వేయి యోజన ముల వెడల్పుగల స్ఫటికశిఖరములయొక్క మందిరముగలదు. వీటి యందు సాయుజ్య సార్ష్టికముక్తులపొంది, నంది, భృంగి, మహా కాలుడు, వీరభద్రుడు మొదలగువారు నివసించుచుందురు. ఈశ్వరాజ్ఞ చేత కోట్లగలది బ్రహ్మాండముల సృష్టిచేయుటగాని, నశింపజేయుటగాని, మార్చుటగాని సమర్థులైయుండుచు కైలాసమును రక్షించుచుందురు.

దీనిలోపల నూరు యోజనములయెత్తున నూరు ఆమడల వెడ ల్పున వజ్రములచే నిర్మింపబడిన మందిరముగలదు. దాని ప్రకాశము

ఈశ్వర నివాసమందిరములో వెలుగుచుండును. పరమేశ్వరుడు అమ్మ వారి శక్తులును – కుమారస్వామి – వినాయకుడు నివసించుచుందురు. వారు ఉమా మహేశ్వరుల సేవచేయుచుందురు.

ఈప్రదేశమునకు లక్ష యోజనముల యెత్తున పరమశివుని నివాసముగలదు. దేవతలు అక్కడకు వెళ్ళ వీలులేదు. దీనిని అంతఃపురమని చెప్పెదరు.

దీని తరువాత పరమేశ్వరుని స్వగృహము గలదు. అందు 11 యోజనములయెత్తున జ్యోతిర్మయ శిఖరములుగలవు. తర్వాత సదాశివుని మందిరముగలదు. దానిపైన జ్యోతిర్మయమైన దివ్యసింహాసనముమీద సదాశివునితో పరాశక్తి ప్రకాశించుచుండును. వెలుపల నున్నవారందరును శివధ్యానమువలన క్రమముగాముక్తినొందుచుందురు. ఈ మహాకైలాసము మాదిరిగా భూకైలాసమందుగూడ సమానమైన చిహ్నములుగలవు. ప్రళయకాలమందు అంతా యేకమై సృష్టికాలమందు శివానుగ్రహమున బ్రహ్మాండము లుదయించుచుండును.

---

మరా:- ఇంతవరకు ఈ మహాకైలాసవిషయము గోరఖ్‌పూర్ నుండి బయలుదేరి వచ్చుచున్న కల్యాణిపత్రిక ఆఫీసువారు ప్రకటించిన శివాంకమునుండి అనువదింపబడినది.

## పుణ్యాహవాచనము

ఓం పుణ్యాహం దీర్ఘమాయురస్తు–శివా ఆపస్సంతు–సౌమనస్యమస్తు – అక్షతంచారిష్టంచాస్తు–గంధాఃపాంతు – అక్షతాఃపాంతు–పుష్పాణిపాంతు – తాంబూలానిపాంతు–దక్షిణాఃపాంతు–సౌమంగళ్యంచాస్తు.

ఇతి శ్రీ నకులశానాదాయ పూజాంకృత్వా –

## దేవతా ధ్యానం

శ్లో॥ యదోన్మేషం వేదవిదః పురాణం
బ్రహ్మాణమీశం జగదాదికారణం।
ప్రాతంకరోప్యమ్నత మాదితేయా
సర్వేశ్వరః మంగళమాదిశంతు॥

శ్లో॥ దివాకరం దీప్తి సహస్ర హస్తం
తేజోమయం కర్మ సునాక్షిణంపరం
బ్రహ్మేంద్ర విష్ణ్వాది సురస్వరూపం
రవిం సదాహం శరణం ప్రపద్యే॥

శ్లో॥ యఃకాలహోత్రోః క్షయవృద్ధిమేతి
యం యాంత్యమృత్యా పితృదేవతాశ్చ
తం శైవ వరేణ్యం దశషట్కలానిధిం
సోమం సదాహం శరణం ప్రపద్యే॥

శ్లో॥ మహేశ్వరస్థాన నివాసయోగ్యం
రక్తాంబరాలంకృతి భూషితాంగం।
సువర్ణసంభూమి సుతంసువేషం
భౌమం సదాహం శరణం ప్రపద్యే॥

శ్లో॥ విశుద్ధ బుద్ధిం రవి సోమ భాసం
సత్యస్వరూపం శ్రుతివేద్యమానం।
సువర్ణసం సంప్రతి విశ్వరూపం
బుధం సదాహం శరణం ప్రపద్యే॥

శ్లో॥ బుద్ధైస్సమీడ్యం శ్రుతిసార భూతం
సమస్త వేదాంత విదం వరేణ్యం

ప్రజాపతేరాత్మజ మద్వితీయం
గురుం సదాహం శరణం ప్రపద్యే ॥

శ్లో॥ వర్ష ప్రదం చింతిత సిద్ధిదంచ
సర్వప్రదం సజ్జనసంఘ పూజ్యం
తంభార్గవం యోగవిశుద్ధ సత్వం
శుక్రం సదాహం శరణంప్రపద్యే ॥

శ్లో॥ శనైశ్శనైర్గచ్ఛతి యోజనేషు
శనైశ్శనైర్భోగతతిం ప్రదత్తే
రవేస్తనూజం సుజనప్రసన్నం
శనిం సదాహం శరణంప్రపద్యే ॥

శ్లో॥ యం దేవసంఘేఽమృతపాన లుబ్ధం
చిచ్ఛేద విష్ణుం దితిజం మహోగ్రం
యౌరాక్షసౌ విగ్రహమూర్ధయుక్తౌ
తౌ రాహుకేతూ శరణంప్రపద్యే ॥

శ్లో॥ తారాగణాః కేతువోరోహిణీయాః
సప్తర్షయ స్సర్వదాదీప్యమానాః
ఉల్కాపాతా విద్యుతశ్చాతి భావః
మోదం కుర్యుస్సంతతం సుప్రసన్నాః ॥

శ్లో॥ ఇమం స్తవం పద్మాసనేన ప్రణీతం
యే శ్రద్ధధానాః పుణ్యాహకాలే పఠంతి
తేషాంగ్రహాతే విషయస్థాయినోపి
ఏకాదశస్థాన ముదావరదాభవంతి ॥

శ్లో॥ ఆయుష్య మారోగ్య మతీవసౌఖ్యం
ధర్మార్థకామాన్ బహుపుత్రలాభం
శత్రుక్షయం రాజసు పూజతంచ
యచ్ఛంతి సూర్యాది నవగ్రహాస్తే॥

శ్లో॥ ధనకనక సమృద్ధిః ధ్యానమైశ్వర్యవృద్ధిః
యువతిజన సమృద్ధిః పుత్రపౌత్రాభివృద్ధిః
పరిజనపశువృద్ధిః కౌశలం ధర్మవృద్ధిః
తవభవతు సమస్తం మంగళం శాశ్వతంచ॥

అనేనమంత్రేణ దక్షిణకలశ మద్ధృత్య ఈశాన్యకలశే కించి త్కించి దుదకంనయేత్ శాంతిరస్తు, పుష్టిరస్తు, తుష్టిరస్తు, వృద్ధిరస్తు, ఆయుష్యమస్తు, ఆరోగ్యమస్తు, ఈశాన్యాం బహిర్దేశే అరిష్టనిరసన మస్తు యత్పాపం తత్ప్రతిహతమస్తు-యచ్ఛ్రేయస్తదస్తు ఇంద్రాది లోక పాలాః ప్రీయతాం ఆదిత్యాది నవగ్రహాస్త ప్యంతు నైరుత్యాందిశి ఘోరాణి శామ్యంతు। పాపాని శామ్యంతు ఈతయశ్శామ్యంతు సకల శుభాని వర్ధంతామ్ సర్వ మంగళానిభవంతు సర్వేశక్త్యాది సిద్ధాః ప్రీయంతాం భృంగీశ్వరాది మహాశైవాః ప్రీయంతాం శివ చతుర్దశ్యాది శివతిథయః ప్రీయతాం భవంతో బృవంతు పుణ్యాహం యజమానాయ శుద్ధి వృద్ధ్యభివృద్ధి కర్మణి మహాజన సేవకాయ ఆశిష మపేక్షమాణాయ స్వస్త్యస్తు ముఖసమం కలశముద్ధరేత్. శతాయు రస్తు, గోత్రాభివృద్ధిరస్తు, పౌత్రాభివృద్ధిరస్తు శాంతిః పుష్టిశ్చాస్తు శుభమస్తు సర్వసంపదస్తు సర్వతశ్శుచిరస్తు ఇతికలశేషు బ్రాహ్మణై రక్షతాన్కారయిత్వా

శ్లో॥ గంగా వేగవతీచ సూర్యతనయా సారస్వతో నర్మదా
కృష్ణా గౌతమి ముఖ్య పుణ్యతటినీ బ్రహ్మాండమధ్యేఖిలే
తీర్థస్నానవిశేషకోటి ఫలదాయద్వ్యద్విధౌతత్ఫలం
శంభోఃపాదజలం సదా శుభకరం కుర్యాత్సదామంగళం॥

ఇతి మండలం సంప్రోక్ష్య ప్రాచ్యాం మార్జయంతాం, దక్షిణాయాం మార్జయంతాం, ప్రతీచ్యాం మార్జయంతాం, ఉదీచ్యాం మార్జయంతాం, ఊర్ధ్వాయాం మార్జయంతాం ఇతిజలేన మార్జనం కృత్వా.

సర్వేభ్యో మాహేశ్వరేభ్యో ఉమామహేశ్వర స్వరూపేభ్యః ఉమామహేశ్వర ప్రీత్యర్థం మనసోత్సాహ పరిమిత హిరణ్యం తుభ్యమహం సంప్రదేనమమ – ఇతి సదక్షిణాక్షతోదక తాంబూలానిదత్వా ఆయుష్యాభివృద్ధిరస్తు సర్వసంపదస్త్వితి ఆశిషందత్వా – శాంభవదీక్షామారభేత్.

ఇతి పుణ్యాహవాచనం సమాప్తం

---

## ప్రశ్నాపధానములు

( గతసంచిక తరువాయి )

ముడిగొండ రామలింగశాస్త్రిగారు, ఈమని

### రెండవ దృగవధానము

దృక్పూజ : శివుని జూచుకొలది యానందమునొందుచుండుట దృక్పూజయగును. ఇందు దృష్టి యేలింగమునకు స్నానోదక రూపంబును – దృష్టియే గంధాక్షతరూపంబును–దృష్టియే పుష్పరూపంబును–దృష్టియే ధూపరూపంబును–దృష్టియే నీరాజనరూపంబును–దృష్టియే నైవేద్యరూపంబును – దృష్టియే తాంబూలరూపంబును – దృష్టియే పుష్పాంజలిరూపంబును నగును. ఇట్లు లెనిమిదివిధములనగు దృష్టితో లింగార్చనముచేయుట దృగవధానంబగును.

### మూడవ యవధానము

త్యాగాప్యప్తిః : దరిద్రుడు పెన్నిధిని గ్రహించునట్లును – ఆడయేనుగు మదపుటేనుంగును స్పృశించునట్లును – గౌరీదేవి లీలా

కమలమును గ్రహించునట్లును- పతివ్రత ప్రియుని గాత్రమును సేవించు నట్లును సాధకుడు లింగమును తనచేతితో స్పృశించుచు స్పర్శసుఖము నొందుచుండుట త్వగ్వ్యాప్తి యని చెప్పబడును.

నాల్గవ యవధానము

స్తుతిః : వేదములయందు, నుపనిషత్తులయందు గల మంత్రములచేతను - పురాణోక్తులచేతను నీశ్వరుని స్తోత్రముచేయుట స్తుతి యని చెప్పబడును.

ఐదవ యవధానము

మనోవ్యాప్తి : అగ్నియందు వెన్నకరగిపోవునట్లును - దీపమునందు కర్పూరము లయించునట్లును-నీరునందు నుప్పు కరగిపోవునట్లును -సముద్రమునందు వడగండ్లు కరగిపోవునట్లును - తన శరీరము యింద్రియములతోగూడ లింగమునందు లయించినట్లు భావించుట మనోవ్యాప్తి యని చెప్పబడును.

ఆరవ యవధానము

సానురాగమనోర్చనం : ఆనందబాష్పంబులె స్నానంబును - ఆసక్తియే గంధంబును - రోమాంచమే పుష్పమాలికయు - తత్త్వసంపదయె విభూతియు - తనదు సద్భావనయె ధూపంబును - జ్ఞానాంశువ్రాతె దీపజాలంబులును - ప్రాణమే నైవేద్యమును - అతీంద్రియత్వమే తాంబూలంబును - స్తోత్రమె మంత్రపుష్పంబును నీవిధంబున తనచిత్తమే సకలోపచారము నొందవలయు. స్నానోపచారమునందు చిత్తమే జలధారారూపము నొందవలయు - పూజయందు చిత్తమే సుగంధపుష్పరూపము నొందవలయు - గంధోపచారమునందుచిత్తమే శ్రీగంధరూపము నొందవలయు - ధూపోపచారమునందు మనస్సే ధూపద్రవ్యరూపంబు నొందవలయు - మంగళహారతి యిచ్చునప్పుడును మనస్సే తద్రూపమునొందవలయు - నైవేద్యదాన సమయమునందును

చిత్తమే భక్ష్యభోజ్యాదిసూపత నొందవలయు, ఇదియే సానురాగ మనోర్చనము.

ఏడవ యువధానము

గణప్రణామః : లింగమునందే రుద్రగణములనుగాంచి రుద్రాను వాకములతో వారిని నమస్కరించుట గణప్రణామమని చెప్పబడును.

ఎనిమిదవ యువధానము

గణస్తుతిః : లింగమునందు రుద్రగణములను భావించి రుద్ర సూక్తములతో స్తోత్రముచేయుట గణస్తుతియని చెప్పబడును.

తొమ్మిదవ యువధానము

గణలీలానంద మగ్నత : ఏ మహానుభావులు ఇచ్ఛామాత్రము చేతనే భూమియందు సూర్యచంద్రాది గ్రహనక్షత్రములతో గూడిన దినమును సృజింతురో - మఱియు నెవ్వారలు అష్టగుణైశ్వర్యము నొందియు నాశ్చర్యమందరో - ఇంక నెవ్వారలు చేయుపనులనుచూచి పరమేశ్వరుడే యాశ్చర్యమందుచుండునో అట్టి ప్రమథులలీలల నే సముద్రంబున నానందముతో మునుంగుచుండిన గణలీలానంద మగ్నత యని చెప్పబడును.

పదియవ యువధానము

లింగనిమగ్నత : లింగమునందే తన చిత్తములయించుటంజేసి యితరము నెఱుంగకుండుటచే బాహ్యమునందు దృష్టిచేతను అంతర మునందు మనస్సుచేతను లింగమెల్లప్పుడు లగ్నమైయున్నది. కావున సర్వకాల సర్వావస్థలయందును లింగముకంటె నన్యము గోచరింప కుండుటయే లింగనిమగ్నతయని చెప్పంబడును.

ఈ దశావధానములు ప్రసాదిస్థలములోనుండి సాధకుడు నిత్యా భ్యాస పూర్వకముగా సాధించి యనుభవములో నుంచికొనిన సర్వ విషయము లాతనికి ప్రత్యక్షముగ గన్పించుచుండును. మల్లికార్జున పండితారాధ్యులు మున్నగువారలు శివపూజాకాలమునందు ఆగతా

నాగతవిషయములు చెప్పియుండినటుల వారివారి చరిత్రలవలన దెలియు చున్నది. అందుకు దశావధానముల దెలిసికొని యాచరణలో నుంచు టయే కారణంబని చెప్పక తప్పదు. కాన శైవులందఱు వీటిని గురు ముఖతా బాగుగా దెలిసికొని యాచరణయం దుంచుకొందురుగాత.

( మహా శివపూజావిధినుండి )

---

# శ్రీ నీలకంఠభాష్యము

ఆంధ్రీకర్త :— నిర్మల శంకరశాస్త్రిగారు

( శ్రీకంఠ విద్యాభూషణ, సంస్కృతసాహిత్యరత్న )

ఆణ్వాది కారణవాదము :

" సృష్టి ప్రారంభములో రెండు అణువులు (చిన్నవి) కూడి పెద్దవై క్రమముగా కూడుచు ఈ ప్రపంచమును నిర్మించినవి " అని తార్కికుల యభిమతము.

నిర్విశేషవాదము :

ఇద్దానినే యద్వైతమందురు. " గుణములు స్వరూపము మొద లగు విశేషములు బొత్తిగా లేనట్టి బ్రహ్మము – గుణములు రూపము గల జగమునకు కారణమైనది. నిర్విశేషమగు బ్రహ్మమునందు జగము నారోపించి జగద్రూపముగా చూచుట భ్రాంతియగును. ఇట్టి భ్రమను వీడి సోఽహంభావనఁజేయుట ముక్తి " యని స్మార్తులు చెప్పు చుందురు.

కర్మవాదము :

" జీవులు ఆచరించు కర్మము – అపూర్వముగా పరిణమించి స్వర్గ నరకములందు సుఖదుఃఖములను కలుగజేయును. ఇట్టి కర్మందగు

ఫలము ననుభవించుటకు ఈశ్వరుని అనుసంధానము అవసరములేదు"
అని మీమాంసకుల యుద్దేశము.

శూన్యవాదము :

"నిర్విశేషవాదముతో సరిపోవును. బ్రహ్మము సచ్చిదానంద
రూపము గాక భూతాకాశమువలె శూన్యమైనట్టిది" అని అచలులు
కందార్థములతో ఆర్భాటముఁ జేయుచుందురు.

పాంచరాత్రాదివాదము :

పాంచరాత్రములనఁబడు ఆగమముల నంగీకరించి విష్ణుభక్త
లగు వారు పాంచరాత్రులు; " అంతస్తమో బహిఃసత్త్వః " అని
చెప్పఁబడు నారాయణుఁడు సర్వోత్తముడనియు మోక్షప్రదుడనియు
చెప్పువాదము.

(శైవమతప్రకాశిక, సంపుటము ౮, సంచిక ౩, పే. 20 - 23, తరువాయి)

శ్లో॥ నిజశక్తిభిత్తి నిర్మిత – నిఖిల జగజ్జాలచిత్రనికురుంబః ।
సజయతి శివఃపరాత్మా – సకలాగమసార సర్వస్వమ్ ॥

ఎల్లకాలము తన నాశ్రయించియుండు శక్తి యనఁబడు గోడ
యందు లోకముల నన్నిటిని సమూహము అనెడు చిత్తరువుల చేరికను
నిర్మించువాడును, వేదములు మొదలగు ఆగమముల సారములనఁదగు
ఉపనిషత్తుల సర్వస్వము – అనగా నవ్వానియందు బాగుగా నిరూపింపఁ
బడిన ముఖ్యాంశములయొక్క సంపూర్ణలక్షణము కలవాడును; జీవా
త్మను నియమించువాడగుటఁజేసి పరమాత్మ – యనఁదగు శివుఁడు –
తా సృష్టించిన చేతనాచేతన ప్రపంచమునకంటె నతిశయముగా
విరాజిలుచున్నవాడు.

శివుఁడు సర్వోత్కర్షతో నుండువాడని చెప్పుటకు వేదాంత
ములు – ప్రమాణములగుచున్నవి. శక్తియందు జగమును చిత్రించు
వాడగుటచే జగమునకు శక్తిగాక తానే కారణమగుచున్నవాడు.

పరమాత్మ - అజ్ఞానము లేనివాడగుటను అనంతములైన కల్యాణ గుణములుగల పరిశుద్ధ-స్వరూపము గలవాడగుటను తత్త్వవేత్తలు శివుఁడని చెప్పుచున్నారు. వేదాంతప్రతిపాదిత సంపత్తిగలవాడగుటచే వేదాంతసర్వస్వము శివునియందే తాత్పర్యము గలది యగుచున్నది. పరమేశ్వరుఁడు ఎల్లపుడును జీవభిన్నుడని "పరాత్మా" యను పదము తేటపఱచునది; జగమునకు చిత్రసామ్యమువలన "జగన్మిథ్యా" యని భావింపరాదు. చిత్రమువలె నానావిధములు కలిగిన జగము సత్యమైనట్టిది; గోడ చిత్తరువుఁగూడుట నిత్యముకానట్లు అపరాప్రకృతి వికారములైన పృథివీ జల అగ్ని వాయు ఆకాశాది అచేతనములందు పరాప్రకృతి సంబంధముగల చేతనులు (జీవులు) ప్రవేశించి యుండుట మాత్రము అనిత్యమగుచున్నయది.

వస్తునిర్దేశరూపమైన మంగళాచరణమును తెలుపున దీశ్లోకము. ఆశీర్వాదరూపమగు మంగళాచరణమును దిగువశ్లోకముతో గావించుచున్నవారు.

శ్లో॥ భవతు సభవతాం సిద్ధ్యై - పరమాత్మా సర్వమంగళోపేతః,
చిదచిన్మయః ప్రపంచః - శేషోఽశేషోఽపి యస్యైషః ॥

సర్వమంగళ యను పేరు గల గౌరీదేవితో కల్యాణ కర గుణము లన్నిటితోడను కూడియుండువాడు, పగలు రాత్రి యను విభాగము, సత్తు అసత్తు అనువాని వివేకంబును లేని మహాప్రళయ సమయములో - తనకంటె రెండవ వస్తువు (ప్రపంచము నధిష్ఠించునది) లేనివాడును ఉత్తమ పురుషుఁడునగు సదాశివుఁడు - భాష్యార్థ శ్రవణముఁజేయు మీ యందరి మనోఽభీష్టములను సిద్ధింపజేశి విజ్ఞానమును కలిగించుగాత.

[ సశేషము ]

# శైవగ్రంథమాల

| | | | |
|---|---|---|---|
| 1. | సంధ్యావందనము | ... | 0—8—0 |
| 2. | ఆంజనేయ స్వరూపనిరూపణము | ... | 0—8—0 |
| 3. | భగవద్గీత | ... | 6—0—0 |
| 4. | శైవాహ్నికము | ... | 1—0—0 |

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు ఉత్తరము వ్రాయవలెను.

Saivamataprakasika

Regd. No. A 227

# శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అడ్రస్ :— 1

## ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వరంగల్

అడ్రస్:— 2

## ముదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) దుగ్గిరాల

సూచన :— వ్యాసములు - ఉత్తరములు - బ్లాకు
ఈ పై అడ్రస్సులలో నొకదానికి పంపిం:

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమున ప్రచురింపఁబడు
పవిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవళంబి సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౧ | 15—12—1957 | ౧ |

సంపాదకులు :

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.
*Principal Ayurvedic college & Superintendent*
*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు :

ముదిగొండ రామలింగశాస్త్రి
భాషాప్రవీణ.

శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థతతిప్రభాసికా
సందేహసందోహమహానిరాసికా ।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా
జయత్వియం శైవమతప్రకాశికా ॥

శ్రీ శైవ మ హా పీ ఠ ము
స్టేషన్‌రోడ్డు, శ్రీ విశ్వేశ్వర దేవాలయము
వరంగల్

# విషయ సూచిక

# శైవమత ప్రకాశిక


శ్రీశైవమహాపీఠ పక్షమునఁ బ్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవళంబినామ సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౧ | 15—12—1957 | ౧ |


## సంపాదకీయము

శైవ మొకప్పుడు భారతావనిలో నగ్రస్థానము వహించి కాశ్మీరము మొదలుకొని కన్యాకుమారివఱకు పేరు ప్రఖ్యాదులతో దులతూగి యున్నది. కాలక్రమేణ యితర మత ప్రవక్తల విపరీత ప్రచారమువలన లింగధారణ లేని శైవము కాశ్మీర మందును – బసవేశ్వర మత ప్రచారమువలన వర్ణాశ్రమ ధర్మ విరహిత శైవము కన్నడ దేశ మందును – నాయనార్ల ప్రచారమువలన కేవల శివభక్తి అరవదేశ మందును ప్రచారములోనికి వచ్చినది.

ఆంధ్రదేశమందు మాత్రమే వర్ణాశ్రమ ధర్మములతో గూడిన లింగధారణగల శైవము నేడు ప్రచారముగ నున్నది. ఉద్భటారాధ్యుడు కాశ్మీరరాజగు జయాపీడుని సభలో విద్యాపతిగానుండి – కాశీలో విశ్వారాధ్య పీఠమును స్థాపించి భోజ మహారాజునకు లింగధారణ దీక్షనిచ్చి జగత్ప్రసిద్ధిబడసి యుండెను. ఆనాడుత్తర భారత దేశములో లింగధారణగల శైవమే లేకున్న ఉద్భటునివలన రాజాధిరాజులు లింగధారులగుట – యచట లింగధారి శైవులుండుట తటస్థింపదు.

పూర్వము ఆంధ్రదేశమునకే పలుప్రాంతములనున్న యారాధ్య శిఖామణు లరుదెంచి నివాసముల నేర్పాటుచేసికొన్న కతన నితర ప్రాంతములయందు వర్ణాశ్రమ ధర్మసహిత లింగధారణగల శైవము ప్రచారములో లేక మృగ్యమైనది.

గణపతిదేవుని మంత్రియగు శివదేవమంత్రి కాశీనగరమునుండి మల్లికార్జునారాధ్యులవారిని రుద్రుని దోష నివారణార్థము తీసికొని వచ్చి వారికి ముదిగొండ యను గ్రామము నగ్రహారముగ నిప్పించి యచటనే నివాస మేర్పరచుకొనునటుల చేయుట చారిత్ర ప్రసిద్ధమగు విషయమేగదా!

ఆనాడు శ్రీశైలములో శ్రీపతి పండితుని పీఠమున్నటుల తెలియుచున్నది. పుష్పగిరి మున్నగు నిప్పటి పీఠములానాడు శైవులు స్థాపించినవనియే చారిత్రక పరిశోధకులు ఆంధ్రులచరిత్రయందు నుడివి యున్నారు.

నేడు చూచుచుండగనే యగ్రహారము లెందఱివి హరించి పోలేదు. అటులే యానాటి ద్వాదశారాధ్యులు నేర్పాటుచేసిన పీఠముల ధనాభావముచే నితరులకువదలి కేవల శిష్యసంచారమువిూాధ యాధారపడి యుండుటవలన నీనాడు పూర్వవిషయముల స్వప్నగాథల వలె తలంచవలసి వచ్చుచున్నది.

ఆరాధ్యులు (లింగధారీ బ్రాహ్మణులు) చాతుర్వర్ణ్య గురుత్వ మును వహించి విఖ్యాతిగాంచిరే గాని యేనాడును లింగధారణలేని విప్రులకుగాని – లింగధారణగల బ్రాహ్మణేతరులకు గాని శిష్యులుగ నుండలేదు. ఈవిషయము శాస్త్ర ప్రసిద్ధమేగాక చారిత్రకదృష్టిలో గమనార్హము. శంకరాచార్యులవారు రేణుకాచార్యులవలన పీఠలింగ మును స్వీకరించిరేగాని ఆరాధ్యులు లింగధారణను శైవేతరులనుండి [illegible] ములనుండి గ్రహించుట కవకాశమే గన్పింపదు. చరిత్రలయం

దెచ్చుటను కనివిని యుండలేదు. కొందఱీనాడట్లు వచించుట యవిచార మూలకము.

లోకమునందీ నాడందఱు పురోభివృద్ధిగాంచ నెంచుచుండుట చూచుచుంటిమిగదా! మనమును మన పూర్వపు టౌన్నత్యమును సంపాదించుటకు యత్నించుటయేగాక చారిత్రక విషయముల పరిశీలించి యున్నతస్థితిని గాంచగలందులకు యత్నింతురు గాత?



## శివపూజా విశేషములు

పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు

1. లింగధారియగు విప్రుడు నిజలింగమును షట్కాలముల యందుగాని, యేకకాలమునగాని, ద్వికాల - త్రికాలములయందుగాని కరపీఠము నందుంచుకొని షట్స్థలాత్మక విధిచే షట్త్రింశత్పూజోప చారముల నర్చించవలయును.

2. స్వజాతి విహితమును విధ్యుక్తమునునగు కర్మముల నాచ రింపక యొనర్చిన పూజనము శివప్రీతికరము కానేరదు. శివభావనయా చేసిన కర్మములన్నియు శివార్చనా రూపములే యగుచుండును.

3. సర్వేంద్రియములను శివాంగములుగ గుర్తించి తదింద్రియ వ్యాపారములన్నియు శివార్చనా భావిత మొనర్చినచో భోగోపభోగ రూపములగు సకలేంద్రియ కార్యములును శివకార్యము లగును.

4. తాను రుద్రుడై రుద్రుని యజింపవలెను. రుద్రుడు కాక రుద్రుని బూజింపరాదు. మానవునకు గురుకటాక్ష ప్రాప్తశాంభవ దీక్షా పరత్వ ప్రాణలింగాంగ సంగతిని రుద్రత్వము సంభవముగు చున్నది.

5. శాంభవదీక్షితుడు జాతాశౌచ - మృతాశౌచములందును శివపూజను మానకూడదు. శివలింగమున శిలాబుద్ధియు ప్రసాదంబున బదార్థ చింతయును తీర్థంబున జలభ్రాంతియు నెవ్వఁడు కలిగియుండునో యాతడు బ్రహ్మహత్యాది పాతకములకు గురియగు చున్నాడు.

6. పూజాసమయమందు నశుచియై విషయాసక్తముగాని చిత్తమును శివునందుంచి లభింపని పూజాద్రవ్యముల మనస్సునందు భావింపుచు మాంద్యములేనివాడయి రొమ్ముడలు విరచుట నిద్రపోవుటాది గాగల దురభ్యాసములకు లోనుగాక సేకరించుకొనిన పూజా ద్రవ్యములతో సుఖాసనస్థుడై బహిష్కృతుల సంగతిని చెందక భక్తుడు శివారాధనము చేయనగును.

7. శివానుభవమగు దానినే అనుభవింపుము. అట్లు గానిచో ప్రత్యవాయమునకు పాత్రుడవగుదువని శ్రుతి ఆజ్ఞాపించుచున్నది. ఇద్దాన పత్రము పుష్పము ఫలము తోయము అన్నము సర్వము శివు నర్పించి నర్పించియే సాధకుడు గ్రహింపవలయును.

8. ఒక్కటియగు శివమూర్తియే భక్తానుగ్రహార్థము గురుచర ఈశ్వర రూపము లయ్యెను. ఇద్దాన గురుచరేశ్వరులయందు భేద బుద్ధినివీడి ఏకరూపమున నర్చించుట సముచితమగును. గురుచరేశ్వరుల యందలి సమానభావము ఉత్తమభక్తి, న్యూనాధికత్వ చింతనము కనిష్ఠ భక్తియగును. ఉత్తముడు ఉత్తమభక్తి నాశ్రయింపవలయును.

9. షట్స్థలాత్మకమగు శివపూజావిధియందు శుచియు నియమియునై భక్తుడయిన సాధకుడు సమాసీనుడై భూతిరుద్రాక్షలధరించి మాహేశ్వరుడై షడక్షరమును నిష్ఠచే జపించి ప్రసాదియై హస్త పీఠమునయున్న లింగమును దశావధాన పద్ధతిచే నిరీక్షచేసి ప్రాణ లింగియై పూజయొనర్చి శరణుడై అర్పణముచేసి శివైక్యుడై ప్రసా [illegible] సందము లింగార్చనము నాచరింపవలెను.

10. మహాపూజ గురుపూజ లఘుపూజయని శివపూజ మూడు విధములగును. ఉత్తముడు మహాపూజను, మధ్యముడు గురుపూజను, అశక్తుడు లఘుపూజను చేయుచుండవలెను. సాయం మాధ్యాహ్న కాలము లిందుకు తగినవి. ప్రాతరాదులయందు అవసరార్చనము నియతమగుచున్నది.

11. పూజావిధియందు వైదిక - తాంత్రిక మంత్రముల తత్తత్క్రియాచరణమున జెప్పుట సర్వసమ్మతమగును. గృహిణీ జనము లకు తాంత్రిక మంత్రములతో అవసరార్చనము చేసికొనవలయును. వైదికులు వేదమూలకములగు తాంత్రిక మంత్రములచేతను వేద మంత్రములతోడను శివపూజ నాచరించవలయును.

12. సకల విద్యలయందు శ్రుతియు, నందు రుద్రమును దాని యందు ఓన్నమశ్శివాయయను మహామంత్రమును దానియందు శివ యను అక్షరద్వయమును తరతమాధిక్యమున అధికృతమయియుంటచే పరమేశ్వర మూలమంత్రముచే శివునర్చించుటయు సర్వతోవరమగును. అరుద్రుడుకాని సరుద్రుడుకాని పంచాక్షరీ మహామంత్రముతో నెవ్వడు శివుని బూజింపుచున్నాడో ఆతడు ముక్తినొందుచున్నాడని శాస్త్ర నిర్ణయము.

13. సముచిత విధిని భస్మరుద్రాక్షతల ధరింపక శివారాధనము చేయుటకు సాధకుడు అర్హుడుకాడు. అట్టి పూజ వ్యర్థమే యగును.

14. పూజాకాలమున నరుదెంచిన యతిథిని మూఢుడుకాని, పండితుడేకాని పరమేశ్వరునింబోలె భావించి పూజింపవలయును. బహిష్కృతులను చూడకూడదు. తద్వాక్యముల వినకూడదు.

15. పాదములతో స్పృశింపబడిన పూజాద్రవ్యములు పూజార్హములుకావు. హస్తచ్యుతములై నేలబడిన గంధపుష్పాదికములు పూజావిధి కనర్హములు.

16. తిథి వార నక్షత్రయోగ కరణములన్నియు శివమయముగ స్మరించి సాధకుడు వైదికమగు శివపూజావిధిని ప్రారంభింపవలయును.

17. దీపము వెలిగింపక సంకల్పము చేయకూడదు. పూజార్థము వేసికొనిన రంగవల్లిని దీపమును గంధ పుష్పాదుల నలంకరింప వలయును.

18. ఇతర దేవతారాధనాదికమునకు సిద్ధపరచిన పూజా ద్రవ్యములనుండి శివపూజకు పూజాద్రవ్యాదికము గ్రహింపకూడదు.

19. అవసరార్చనమున అష్టదళయుతమగు పద్మ మొకటియు లఘుపూజయందు నవపద్మములును గురు మహా పూజలందు భద్రత త్త్వమండలములను వేసికొనవలయును. ఇందు క్రమముగా నొకదాని కంటె యొకటి అధికమగుచు అర్చనోచిత ద్రవ్యముల నుంచుటకు ప్రశ స్తము లగును.

20. లఘు అవసర పూజలయందొక్క దీపమును మహా పూజ గురు పూజలయందు దీపద్వయముగాని నాల్గు దీపములుగాని వెలిగింప వలయును. గోఘృతము, మహిషీఘృతము, తిలతైలములను దీపమున కుపయోగింప వలయును. ఇవి ఉత్తమ – మధ్యమ – అధమ భేదములు కలవిగా గుర్తింపబడును.

21. హస్తపీఠమునందలి భస్మశయ్యయందు అంగుష్ఠ తర్జనుల కభిముఖముగ గోముఖ ముండునట్లు యిష్టలింగమునుంచి దక్షిణ ముఖమున కభిముఖుడయి పూజింపవలయును.

22. దేవతాహ్వాన లాంఛనమైన ఘంటానాదము; పూజా రంభమునను, అభిషేక సమయమునను, పూజాకాలమునందును, ధూప – దీపార్పణములందును చేయవలెను. శంఖమును పూరింప వలయును.

23. వామహస్త పీఠమునందలి యిష్టలింగమును దర్శింపుచు యొనర్చెడి జపఫలమును చెప్పశక్యముకాదు. అవసర – లక్ష్యార్చనల యందు అష్టోత్తర శతపరిమితముగను, గురుమహాపూజలయందు సహస్రమునకు తక్కువగాకుండగను షడక్షరమును జపింపవలెను.

24. పూజాసమయమున నుపయోగించెడి వత్తులు ముప్పది యారు ప్రోగులతో చేసినవి యయి యుండవలయును.

25. అభిషేక సమయమున మాత్రమే పురాణ శ్రవణము విహితమగును. నమకము చమకము పురుషసూక్తము శాంతిదశకముల పఠించి అభిషేకించిన సాధకుడు గృహాయజమాని గృహము చేరు నటుల మహాదేవుని చేరుచున్నాడు.

26. అవసరపూజయందు దర్శన, అవసర, ఉత్తర నీరాజన ములు మూడును, లక్ష్యార్చనయందు దర్శన, అవసర, మజ్జన, మాంగళ్య, కర్పూర, శృంగార, మహా, ఆనంద, అసంఖ్యాతములను నవ నీరాజనములును, గురు–మహాపూజ లందు సానురాగ – తాంబూలములను రెండును పూర్వోక్తములగు నవ నీరాజనములతో చేరి పదకొండు నీరాజనము లివ్వవలయును.

27. జలజములును స్థలజములు నగు పుష్ప పత్రముల నుత్పన్న మయినట్లే పూజాకాలమున లింగశిరమునం దుంచవలయును. బిల్వ దళముల బోర్లగిలనుంచవలెను. సౌవర్ణములగు పత్ర పుష్పములకు నిర్మాల్య దోషము లేదు.

28. చందన, బిల్వగంధమును, శుభ్రాక్షతలును, దశాంగ ధూపమును శివపూజయందు ప్రశస్తము లగును.

29. సర్పము నర్చించి బిల్వము నర్చింపవలయును. బిల్వోపరి భస్మము మాత్రము నుంచవలెను. అద్దానిపై నెట్టి పూజాద్రవ్యము నుంచజనదు.

30. ప్రాతఃకాలమున పారిజాతములును, సాయంసమయమున చంద్రకాంతములును, మాధ్యాహ్నకాలమున మాధ్యాహ్న మల్లిక లును, ద్రోణ, బిల్వ, కనకాంబరములను పుష్పములు శివపూజ యందు అర్పింపుట విశేష ఫలదమగును.

31. నమస్కార రహితమైన పూజ వ్యర్థము. కరపీఠమున లింగము నభ్యర్చించి కంఠోర్ధ్వభాగమునుండి శిరముఃనువంచి ఎనిమిది గాని, నూటఎనిమిదిగాని నమస్కారముల పూజయందు భావించి యొనర్పవలెను.

32. శాలిపిష్టముతోడ మరు ప్రతిరూపమైన వానియందు దీపముల వెలిగించి కైవత్తుల (చేతిదీపములు) దీపములతో జ్యోతి స్సుల దర్శింప జేయవలయును.

33. వ్రేలవిడచిన అంగుష్టముగల ముష్టిని లింగమునకు చుట్టు ముమ్మారు త్రిప్పుచు ప్రదక్షిణముల భావించి యథాకామముల ప్రార్థింపవలెను.

34. అనివేదిత పదార్థముల గైకొనకుండుటయు, నివేదిత పదార్థముల వీడకుండుటయు నను విధిభరితమను సంజ్ఞ కలిగియున్నది. వీనిభక్తుడు అప్రమత్తుడై ఆదరించవలెను. నివేదనము తా ననుభ వింపుటకు ఆజ్ఞారూపముగనున్న దొకటియు పరమేశ్వరార్పణమునకు చేయున దొకటియు నయి రెండు విధములగుచున్నది.

35. నైవేద్యము సిద్ధపరచనిదే ధూప దీపముల సమర్పింప కూడదు. ధూప దీపార్పణానంతరము నైవేద్య సమర్పణమునకు ఆలస్యముకూడదు. నివేదనార్థకాలమున లింగశిరమున పత్ర పుష్పాది [illegible] భవాంశముగ నుంట నైవేద్యమునందు పడినచో నిర్మాల్య [illegible]లంగులచే తన్నివేదనము నివేదనానర్హ మగుట శివలింగ

శిరమున అల్పమగు పూజాద్రవ్యమునుంచి నివేదనము చేయవలయును. లింగశిరము శూన్య మస్తకము కాకూడదు.

36. ఉపచారము దీపాంతమును నైవేద్యాంతము పూజయగును. నైవేద్యము లేక పూజ లోపించును. ప్రసాద భోగాంతము నైవేద్యార్పణమగుచున్నది. ప్రసాదము గ్రహింపకున్నచో అర్పితము నిష్ఫల మగును.

షట్స్థలాత్మక ధర్మాచరణమున శాంభవ వ్రతి అర్చనార్పణ భావసిద్ధినంది నిత్యషట్స్థలివిదై పరమేశ్వరోపాసనా రూపము లయిన కార్యజాలములందు భక్త మాహేశ్వరాది వాచ్యుడగుచు తత్త్స్థల నియత కర్మబద్ధుడై యుండును. ఆచరణ భేదముల ననుసరించి స్థల షట్కమున న్యూనాధికతయు ఆరూఢపతిత్యాది దోషములును స్థల సాంకర్యమును సంభవముకాదు. నియమిదై భస్మరుద్రాక్షలధరించి భక్తుడగుచుండును. షడక్షరమును నిష్ఠచే అనుష్ఠింపుచు మాహేశ్వరుడగును. దశావధానము లొనర్చుచో ప్రసాదియగును. పూజ యొనర్చుచో ప్రాణలింగియగును. సర్వార్పణ మొనర్చు సమయమున శరణుడగును. సర్వశివభావనయా ఐక్యుడగుచుండును. ఇట్టి మహోత్కృష్ట ధర్మాభ్యాసమునకు శివపూజ ప్రధాన సాధనము. కాన నే షడక్షరీ జపము – దశావధానములు. సర్వార్పణము దానికి తగుమైన అర్చనా విధి సర్వశివభావన శివోహంభావనా నిరూఢములై షట్స్థలాచరణ మూలకమైన ధర్మములు ముక్తిదములై శాస్త్రముల పదింపదిగ గీర్తనీయము లగుచున్నవి.

# శివభక్తిసుధా

ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారు శతావధాని

శ్లో. శ్రీ వాక్సుధా మధురఝురీసుర నిమ్నగాగ్రే
ప్రేమామృతం వికిరతీవ సుధాంశు రేఖా
యస్మిన్ శివేనవరసాః ప్రవహంతి తేషాం
హేతుస్తదాశ్రిత లతా లలితా స్తువేతౌ. 1

శ్లో. మత్కావ్యకల్పతరు పుష్పిత భక్తి సూక్తిః
తత్పాద పద్మ మకరంద రుచి ప్రసక్తా
భక్తౌఘ కర్ణపుట పూరిత తత్ప్రవాహాః
వాచా తరంగ నిచయై రవ గాహ్య తేభూః. 2

శ్లో. సానంద మాజనయతి ప్రతిభావిశేషం
సామర్ష మాజనయతి ప్రతిభాప్రమోదం
పూర్ణానురాగ లలితం కమలం యదైకం
నేత్రం కృపా పరిణతం కుముదం తథాన్యత్. 3

శ్లో. నిత్యప్రభా రుచిర వక్త్రి విభేదనామ
రుద్రాక్ష దివ్య మణయః కరపద్మయుగ్మే
ఇందిందిరా ఇవ భవంతి పరస్పరోద్ధాః
నిత్యేవ సంతసమయే సుమితాప్రమ జూటే. 4

శ్లో. ప్రాలంబ షట్పద సమావృత కుంతలేషు
ప్రాలేయశైల తనయాకర సంస్కృతేషు
హస్తారవింద యుగళార్పిత గంధిలేషు
వీచై స్సదా మదతి బాలసమీర పాళిః. 5

శ్లో. నిష్యందనేత్ర కమలత్రయ దీప్తి రేఖాః
నిత్యం పరస్పర విభేదకృతి ప్రసక్తాః
తస్మిన్కృతనా స్వహితమైత్రి మవాపురస్య
శృంగారకల్పిత శుభాశుభ శంకమానాః. 6

శ్లో. నాహం భుజంగ ఇతి సంప్రతి సంశయంతః
దేహేవిలీన ఫణి నశ్చ భుజంగ నాథే
సామ్యాహ్వాయంత దధిపేన నిశమ్యహితాం
దృష్టోన్నమయ్య స్వశిరః ప్రహసంత్యభిజ్ఞాః. 7

శ్లో. గాలీస కుంకుమ ముఖాంబుజ చుంబనేన
పర్యాప్త కుంకుమ రజోరుణ భాసి తాస్యం
దైతేయసంగర సముద్భవ కోపహేతు
శ్చేత్ప్రేక్ష్యతే కవిభిరాత్మ విరోధ భావాత్. 8



శ్రీ శివాయగురవేనమః

## నటరాజశతకమునుండి

గ్రహింపబడిన మఱికొన్ని పద్యములు

ఇవటూరి సానందారాధ్యులవారు

సీ. తొలి సృష్టికల్పనా కవితభావుడవౌచు
గగనమండెలు ముందు నెగడసల్పి
రమణీయముగ వాయు రచనంబుగావించి
యగ్ని తేజంబును నమరజేసి
సలిలపూరితదివ్య సాగరావళినిల్పి
పృథులమై యొప్పిడి పృథివిమల్పి

మనుజుల బశువుల ఘనవిహంగావళి
తరులతాపర్వతతతి నొనర్చి

గీ. రమ్యమై యొప్పు సృష్టి చిత్రంబువ్రాసి
తౌర నీ శక్తి వర్ణింప నలవియౌనె!
చిత్రకారులకాద్యుఁడౌ చిత్రకార
మౌళి ధృతరాజ నటరాజ మహితతేజ. 1

సీ. కాలచక్రంబును గల్పింపగాముందు
గల్పభేదంబుల సల్పి మఱల
గలగల్పమునందు ఘటియింపజేసితి
మన్వంతరంబుల మహితగతిని
మన్వంతరంబులో మలయునట్లుగ బెద్ద
యుగభేదనిర్మాణ మొగినొనర్చి
ప్రతియుగంబున పాద భాగంబులమరించి
ప్రతిభాగమందున బరపివృత్తు

గీ. లబ్దముల వృత్తివృత్తిని నమరజేసి
ఋతుల నెలలను పక్షసం తతుల, వార
దివసములజేయు నీ తెల్వి దెలియనౌనె
మౌళి ధృతరాజ, నటరాజ మహితతేజ. 2

సీ. రామాయణగ్రంథ రచనగావించిన
ప్రాచేతసునివిజ్ఞాన భాండ మెద్ది?
భారతామ్నాయంబు ప్రభవింపజేసిన
వ్యాసుని విజ్ఞాన వనధి యెద్ది?
కావ్య నిర్మాణంబు గావించు సత్కవి
విజ్ఞానహేతువై వెలయు నెద్ది?

సకల శాస్త్రంబుల సంతసించెడు శాస్త్రి
విజ్ఞానములకెల్ల బీజ మెద్ది?

గీ. అట్టియామ్నాయములముందు నమరజేసి
కామికాద్యాగమగ్రంథ కరణమునను
పరమవేదార్థముల దేట బఱచినావు
మాళి ధృతరాజ నటరాజ మహితతేజ. 3

సీ. నీ చేత సృష్టమా నిగమాళి స్మరియించి
వాల్మీకి కవిలోక వంద్యుడయ్యె
నీ చేత సృష్టమా నిగమాళి స్మరియించి
మహిని వ్యాసుడులోక మాన్యుడయ్యె
నీ చేత సృష్టమా నిగమాళి స్మరియించి
కాళిదాసుడు లోక గణ్యుడయ్యె
నీ చేత సృష్టమా నిగమాళి స్మరియించి
కవిసింహజాలంబు గణ్యమయ్యె

గీ. కవినదీ జాలమెల్లను గలియునట్టి
ఘనతరామ్నాయ వనధికి గర్తవైన
నీ మహాత్వంబు వర్ణింప నెంతవాడ
మాళి ధృతరాజ, నటరాజ, మహితతేజ. 4

సీ. రేవణాసిద్ధ ప్రభావంబుచేనీదు
కల్యాణ చరితంబు గణుతికెక్కె
మరల సిద్ధేంద్రుని మాహాత్మ్యముననీదు
సత్కథాసారంబు జగతినిండె
సదమలై కోరామ సత్సిద్ధ వరునిచే
నీ కీర్తి చంద్రికల్ నిండె ధరణి

విశ్వోద్భటారాధ్య వేమనారాధ్యుల
మహిమచే నీ యశో మహిమ వెల్గె

గీ. గాన భక్తాగ్రగణ్యులే కాలమందు
నిన్ను జింతించి, సేవించి సన్నుతించి
నీ యశోరమదిక్కుల నింపినారు
మాళి ధృతరాజ, నటరాజ, మహిత తేజ. 5

సీ. శ్రీపతి పండిత శిష్టసంసేవ్యుండు
శర్వ! నీ భక్తి ప్రచారకుండు
మంచనపండిత మహిమానుభావ్యుండు
శర్వ! నీ భక్తి ప్రచారకుండు
మల్లికార్జుననామ మహితపండితమూర్తి
శర్వ! నీ భక్తి ప్రచారకుండు
హరదత్తుడను మేటి యాచార్యవర్యుండు
శర్వ! నీ భక్తి ప్రచారకుండు

గీ. భాష్యములు వ్రాయుపండిత ప్రవరులైన
పరమ శ్రీకంఠ భట్టభాస్కరులు జనుల
యందు నీ భక్తి వర్షించి రతులగతుల
మాళి ధృతరాజ, నటరాజ, మహిత తేజ. 6

సీ. నిజధర్మాశ్రయనీతి నియమవర్తనమైన
కోకిలకోరునే గుడ్లగూబ
శుకమునందనురాగ శుద్ధమానసయాచు
కామించునే శుకి కాకపక్షి
కాయంచయందున రక్తిచే విహరించు
హంసి తావలచునా యులిపులుగు

ప్రియమనోహరసంగ ప్రీతిచే ముదమందు
శారికవలచునే చక్రవాక

గీ. మఱులెఱి నీ పాదపద్మ నిష్యందమధుర
మధురమధుపానుమన్మనో మధుకరంబు
పోవునే నిన్నువిడియన్య దేవుగోరి
హాళి ధృతరాజ, నటరాజ, మహితతేజ. 7

సీ. శ్రీశంభుసత్కథా సిద్ధాంత శుద్ధాంత
రంగులై భువిని సత్పంగులగుచు
పరమేశసద్గుణ వర్ణనా కర్ణన
స్వాంతులై పూర్ణ విశ్రాంతులగుచు
మధురభవద్గీత మంజులరంజనా
నందులై త్వద్భక్త బృందులగుచు
పశుపతిసద్గ్రంథ వాచనాలోచనా
సక్తులై భక్తి సంయుక్తులగుచు

గీ. వెలయునటువంటివారిలో దలచి తలచి
వారు చరియించినట్టి సత్పథముబట్టి
సంచరించెద నీ విశ్వ శాలయందు
హాళి ధృతరాజ, నటరాజ, మహితతేజ. 8

సీ. అభవపాదార్చనా విభవంబులేనట్టి
గృహముగాదదిపాప మహముగాని
పరమేశుసేవకై వ్యయముసేయగలేని
ధనముగాదరిపాప వనముగాని
భవసమర్పితదివ్య ఫలముభక్షింపని
ముఖముగాదది పాపసఖముగాని

పరశివార్పితపుష్ప వాసనారుచిలేని
ముక్కుగాదది తోలు డొక్కుగాని

గీ. శంభుపాదార్చనంబును సలుపనట్టి
చెయ్యిగాదది యొక మొద్దు కొయ్యగాని
యనుచు జింతింతు నాత్మలో నహరహంబు
వాళి ధృతరాజ, నటరాజ, మహితతేజ. 9

---

# శ్రీ నీలకంఠభాష్యము

(గతసంచిక తరువాయి)

ఆంధ్రీకర్త :- నిర్మల శంకరశాస్త్రిగారు

(శ్రీకంఠ విద్యాభూషణ, సంస్కృతసాహిత్యరత్న)

చేతనులు, అచేతనములును నిండియుండు ప్రపంచమంతయు ఏ పరమాత్మకు శేషమగుచున్నదో - అనగా ఒకానొక భాగమగుచున్నదో అట్టివాడు శివుడని భావము.

శేషమనగా పరార్థమైనది. శేషమగు ప్రపంచము శేషియైన పరమేశ్వరు నారాధించుటకు ఉపయోగించునట్టిది.

అశేషము శేషమగుచున్నదని చెప్పుటయందు ఆభాసించు విరోధము "ప్రాకృతదృష్టితో ప్రపంచము అశేషముగా కనుపడినను అప్రాకృత దృష్టిగలవారికి పరమేశ్వర విభూతిలేశముగా స్ఫురించు"ననే నిరూపించుటవలన పరిహరింపబడును. తమ తమ యధికారము ననుసరించి కర్మజ్ఞానములతో శివుని ఆరాధించుటకు చేతనవర్గము;

శివారాధనకు ఆశ్రయమగుటకు భూజల అగ్న్యాది అచేతన [illegible] నుపయోగించును కావున చరాచరము శివునకు శేషమగు [illegible] సందేహము లేదు.

జీవులు సంసారబద్ధులుగా నుండువరకు పశువు లనఁ బడుదురు. జగము (జీవులను బంధించు సంసారమగుటచే) పాశ మనఁ బడును. శివుఁడు – ఇతరులగు ప్రభువులవలె ధనికులవలెను గజాశ్వ సువర్ణాభరణాది పరిమిత సంపద కలవాడు గాక పశుపాశ సమ్మిశ్రమగు ప్రపంచమును శాసించు గొప్ప ఐశ్వర్యము కలవాడగుచున్నవాడు.

నమస్కార ఆశీర్వాద వస్తునిర్దేశములతో త్రివిధమగు మంగళము – నాచరించి – పాశుపతదీక్ష నను గ్రహించి సమస్త వేదాంతార్థమును బోధించినట్టి తమ ఆచార్యుని దిగువ శ్లోకముతో నమస్కరించుచున్నవారు.

శ్లో॥ నమః శ్వేతాభిధానాయ – నానాగమ విధాయినే;
కైవల్య కల్పతరవే – కల్యాణగురవే నమః॥

అనేక వేదాంతములకు తోచెడు విరోధమును పోనాడి సరసమైన ఏకార్థమును నిర్ధారించి యుపదేశించువారును, కైవల్యముః(శివ సాయుజ్యము) అనఁబడు మోక్షమునకు కల్పవృక్షమువంటివారును, జ్ఞాన భక్తి వైరాగ్యాది కల్యాణగుణములు కలవారును, పాశుపత దీక్షను ప్రసాదించినట్టి కల్యాణగురువులునగు శ్వేతాచార్యులవారికి నమస్కారము.

వేదవాక్యములందువలె నీశ్లోకమున రెండు నమః పదములు ఆదరాతిశయముతో వాడబడినవి. శైవసమయ రహస్యము ననుసరించి శివస్తుతి కన్న గురుస్తుతి యధిక ఫలప్రదమగుచున్నందున రెండు మారులు నమఃపదము ప్రయోగింపఁ బడెను.

వేదాంతములన్నియు ఎట్టి విరోధములేనక శివునియందే తాత్పర్యము కలిగియుండునని శిష్యులకు ఉపదేశింప శ్వేతాచార్యులవతరించినవారు. మరియు కల్పవృక్షము కాముకుల కోర్కెలను ఫలింపఁజేయునట్లు కైవల్యమనఁబడు మహాఫలము నపేక్షించువారికి [illegible]మాహాత్మ్యమును కలుగజేయువారు.

శ్రీనీలకంఠాచార్యులకు విద్యాగురువు లేగాక దీక్షాగురువులని "కళ్యాణగురవే" అను పదము తెలుపును. శ్రీ నీలకంఠశివాచార్యులు "కళ్యాణగురు"వని శ్వేతాచార్యులను స్మరించినందున శాంభవ దీక్షితులై ఇష్ట ప్రాణభావ లింగాను సంధానముతో సంప్రదాయబద్ధమైన ముముక్షుత్వము (మోక్షాపేక్ష) నవలంబించిన వారని తెలియనగును.

—oo❀oo—

# ఆహ్వానము

కొత్తపల్లి గ్రామంలోని శివాలయమందు వచ్చే వైశాఖములో కల్యాణోత్సవము జరుగుననియు– ఆ సందర్భములో శైవమహాజన సభను జరుపుటకు కృతనిశ్చయులై యున్నట్లు యచటి శైవులు చెప్పిరని ఇవటూరి సానందారాధ్యులవారు మా కార్యాలయమునకు తెలియబరచినారు. రాబోవు పత్రికలయందు తేదీలు నిర్ణయించి తెలుపబడును.

—సంపాదకులు.

# శబరీ విలాపము

ఈ గ్రంథ రచయిత వరంగల్లు నగరమందలి శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాలయందలి యుపాధ్యాయ పదవిలో నున్న శ్రీ భాష్యం విజయసారథిగారు. వీరీ గ్రంథము నొక ఖండకావ్యముగ గీర్వాణభాషయందు రచించి శ్రీ చాగంటి భాస్కరలింగశాస్త్రిగారికి [illegible] సమర్పణచేసిరి. ఇందలి కథ స్వల్పము. ఇంద్రాది దేవతాప్రార్థన [illegible] పరమేశ్వరుడు తారకాసుర సంహారణార్థమై కుమారస్వామిని

బంపును. యుద్ధోన్ముఖుడైన పసివాడగు కుమారునిజూచి హిమాలయ పర్వత గుహనుండి యొక శబరి వెడలివచ్చి దీనవదనముతో బల్కిన పల్కులను నలుబది శ్లోకములతో నీకవి రచించి పాఠక లోకమునకు శ్రోత్రానందమును గలుగజేసిరి. ఇంతకు పూర్వము వీరు విషాదల హరి యను గ్రంథము నొకటి రచించి గజానన సర్వస్వ మను సంచిక యందు ముద్రించిరి. సహృదయానందకరములగు నిట్టి గ్రంథముల రచించి భాషాసేవ నొనరింప బూనిన కృతికర్తను తగు ప్రోత్సాహము గల్గించిన కృతి భర్తను నభినందించు చున్నాము.

—సంపాదకులు.

*

ఓమ్

# ఓంకారము - శివలింగము

ముదిగొండ మల్లికార్జునరావుగారు - తాడికొండ

ఈ వ్యాసమును వ్రాసినవారు తాడికొండ గ్రామకాపుర స్థుడగు ముదిగొండ వీరభద్రయ్యగారి కుమారుడు మల్లికార్జునరావుగారు, వీరు శ్రీ సనాతనధర్మ మహాసభ (సికింద్రాబాద్) తరఫున వైదికధర్మ ప్రాశ స్త్యమునుగూర్చి పలుచోట్ల యుపన్యాసము లిచ్చుటయేగాక ప్రచార కులుగనుండి ప్రసిద్ధిగడించి యుండిరి.

ఒకతరి వీరు శ్రీశైలమునకేగి తిరిగివచ్చుచు చిన్నవయస్సు నందే జీవితయాత్రను ముగించి లింగైక్యముచెందిరి. "శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మనవిద్యతే" అను శాస్త్రోక్తి ననుసరించి శిఖరదర్శనము చేసికొని పునీతులై యిహమునువీడిన వీరికి శివసాయుజ్యముతప్పక లభించినదని చెప్పుటకు సందేహములేదు. వీరనేక గ్రంథములరచించిరి. అందు ఓంకారము – శివలింగము అను దానినిగురించి వ్రాసిన విషయ

మును వారి కుమారుడు శివప్రసాద్ మా కార్యాలయమునకు పంపించి యున్నాడు. దానిని యిందు ప్రచురించుచున్నాడ.

శ్రీ బేచూసింహ శాంభవ్ గారు "శివ నిర్మాల్యరత్నాకరము" అను గ్రంథ పీఠికలో, ఫ్రెంచి దేశస్థుడగు లూయీస్ గారి గ్రంథముల ననుసరించి అత్యంత ప్రాచీన కాలమునందు విదేశములలోకూడ శివ లింగపూజన మొనర్పబడుచుండెడిదని వ్రాసియున్నారు.

వారిట్లు వ్రాయుచున్నారు "ఉత్తర ఆఫ్రికా ఖండమందలి ఈజిప్టు ప్రాంతములో 'మేఫిస్' 'అసీరిస్' అను స్థలములయందు నందివాహనారూఢుడును, త్రిశూలహస్తుదును, వ్యాఘ్ర చర్మాంబర ధారియునగు శివుని విగ్రహములు ఉన్నవి. వానిని అక్కడి ప్రజలు మారేడు పత్రితో పూజింపుచున్నారు. పాలతో అభిషేకమొనర్చు చున్నారు. టర్కీ దేశమందలి "బాబిలోన్" పట్టణమునందు 1200 అడుగుల ఎత్తుగల శివలింగమున్నది. ప్రపంచమందెచ్చటను ఇంతటి పెద్దలింగము లేదు. హైడ్రోపోలిస్ అను నగరమందు 300 అడుగుల ఎత్తుగల లింగమున్నది. ముసల్మానుల యాత్రాస్థలమైన మక్కా పట్టణమునందు 'మక్కేశ్వర' శివలింగమున్నది. దానిని వారు ఖర్జూరపత్రములతో పూజించెదరు. అమెరికా ఖండమందలి బ్రెజిల్ దేశమునందు చాల శివలింగములున్నవి. యూరప్‌లోని "కారింథ్" అను పట్టణమున పార్వతీ దేవాలయమున్నది. ఇటలీలో అనేకమంది క్రైస్తవమతస్థులు ఇప్పటికిని శివలింగ పూజన మొనర్చుచునే యున్నారు. స్కాట్‌లండ్ (గ్లాస్గో) లో ఒక సువర్ణాచ్ఛాదితమైన శివ లింగమున్నది. ప్రజలు దానిని చాలభక్తితో పూజించెదరు. ఫీజియన్ లోని ఎటిస్ (నినివా) అనెడు పట్టణములో "ఎషర్" అనెడు శివ లింగమున్నది. యహూదీయుల దేశములో వేలకొలది శివలింగము లున్నవి. ఆఫ్గనిస్తాన్, చిత్రాల, కాబూల్, బలఖ్ బుకారా మొదలగు

చోట్ల శివ లింగము లున్నవి. అక్కడి ప్రజలు వానిని "పంచపేర్" "పంచపీర్" అను పేర్లతో పిలుచుచుందురు.

పండిత కాశీనాథశాస్త్రి (మైసూరు) గారు ఇట్లు వ్రాయు చున్నారు. ఫ్రెంచి రాజ్యాధీనమైన అనాం (Annam) దేశమునందు చాల శివాలయములున్నవి. ఇది ఇండో చైనాయందున్నది. దీనినే ప్రాచీన కాలమునందు "చంపా" అని పిలిచెడివారు.

సుప్రసిద్ధ పరిశోధకుడగు మిష్టర్ ఎ. బర్గేన్ (A Bergaingne) గారు వ్రాసిన శివాలయములోని శిలాశాసనములకు సంబంధించిన ఒక పుస్తకములోనూ, R. C. ముజుందారిగారి "Ancient Indian Colonies in the Far East" అను పుస్తకమునందును, అక్కడ చాల శిలాశాసనములు శివాలయములకు సంబంధించినవి దొరకినట్లు వ్రాయబడియున్నది. వీటిలోని సంస్కృతభాష చాల అందముగను, ప్రతి శాసనమునకు మొదట "ఓం నమశ్శివాయ" అని వ్రాయబడి యును ఉన్నది.

డాక్టర్ ప్రాణనాథ విద్యాలంకార్ గారు ది 1-౬-33 న కాశీ నాగరీ ప్రచారిణీసభ వార్షికోత్సవ సందర్భమునందు, హిందుదేశములో నేటికి 15000 సంవత్సరములకు పూర్వమే శివలింగపూజ ఉండెడిదని అనేక ప్రమాణములతో రుజువుచేసినారు.

శ్రీ సునీత కుమారచటర్జి M. A. D. Lit. గారు ఇట్లు వ్రాయు చున్నారు. "ఒకానొకప్పుడు 'అనాం' దేశమందలి 'మిసోన్ ఖేడా' అను పట్టణము కాశీకన్నను మించిన శివక్షేత్రముగ ఉండెడిది."

మిసోన్ గ్రామములో దొరికిన 4 వ శిలాశాసనము ననుసరించి భద్రేశ్వర శివలింగస్థాపన నేటికి 1400 సంవత్సరములకు పూర్వమే జరిగినట్లు తెలియుచున్నది. అందులోని ధ్యానశ్లోకము—

శ్లో॥ సృష్టం యేన త్రితయ మఖిలం భూర్భువః స్వః స్వశక్త్యా
యేనోత్థాతం భువనదురితం వహ్నినేవాంధకారం

యస్యాచింత్యా జగతిమహిమా యస్యనాదిర్న చాంత
శ్చంపాదేశే జనయతు సుఖం శంభుభద్రేశ్వరోయం ?

శ్రీ శానభద్రేశ్వర లింగము 'ఉవఙా' అను పర్వతముమీద స్థాపింపబడినట్లు 32 వ శాసనముద్వారా తెలియుచున్నది. గ్రంథ విస్తరభీతిచేత ఆ శ్లోకముల నన్నింటిని ఇచట వ్రాయుటలేదు.

మ్యాస్పరో అనెడి ఫ్రెంచి విద్వాంసునివలన మఱికొన్ని విషయములు బయటపడినవి.

బాబూ శివప్రసాదుగారు వ్రాసిన 'పృథ్వీ ప్రదక్షిణము' అను గ్రంథమునందు అనేక గొప్ప విషయములు ఉదహరింపబడియున్నవి.

29 వ శాసనమునందు నేటికి 4 లక్షల 38 వేల సంవత్సరముల క్రిందట 'ముఖలింగేశ్వర' దేవాలయము స్థాపింపబడినట్లు వ్రాయబడియున్నది. 'ట్రాక్యా' అను గ్రామమునందు ఒక శివ విగ్రహము దొరికినది. 'యూనముమ్' అను గ్రామములోనూ, 'డాఙలాయే' అను గ్రామములోనూ త్రిశూలపాణియగు శంకరవిగ్రహములు దొరికినవి. 'పోనగర్' అనుచోట 'కౌతారేశ్వరి' యను దేవీపూజ జరిగెడిది. 'డాంగ్ఫుక్' అను చోట అర్ధనారీశ్వరమూర్తి దొరికినది. ఫ్రెంచి 'కంబోడియా'లో శా॥ సం॥ 866 లో అంకోర్ తాం అను గ్రామమునందు శివలింగ స్థాపన జరిగినట్లు వ్రాయబడియున్నది.

'జావా' 'సుమిత్రా' ద్వీపములు పూర్వకాలమునందు 'యవ' 'సువర్ణద్వీపము' లని పిలువబడెడివి. డాక్టరు N. J. క్రోమ్‌గారు వ్రాసిన (Het oude Javaen Sijn Kunst) అను డచ్చిభాషలోని పుస్తకమునందు అనేక చిత్రపటము లివ్వబడినవి.

జావా ద్వీపమందలి 'ప్రాంబనాఙ' సమీపమునందు లారంజో గ్రాంగ్ అనెడు శివాలయమున్నది. పఙతరఙ అనెడు గ్రామములో ఒక గొప్ప శివాలయమున్నది.

T. గోపీనాథరావుగారు (Elements of Iconography Vol II Part I) అను పుస్తకమునందు గుడిమల్లంలోని ఒక ప్రాచీన శివలింగమును వర్ణించినారు.

రాడెన్ మాస్ పోర్ బట్ జరకా(Raden Mas Poedatjaraka) గారు ఒక గ్రంథములో మొట్టమొదట రోమన్ లిపిలో వ్రాసిన మంగళాచరణము నిచట ఉదహరింపుచున్నాము.

"ఓం అవిఘ్నమస్తు. నమఃశివాయ"

శ్లో. యఃసర్వాన్సృజతి ప్రపాలయతి చాశేష్యం హరిష్యత్యపి
దేవానాం జగతోఽపియః సుశరణో గౌరీపతిర్వ్యాహరః
తందేవం ప్రణమామి శూలిన మచింత్యం నీలకంఠంశివం
భో దేవేశమమ ప్రశామ్యతుమలం పాపంచ సర్వంసదా॥

కావున చారిత్రాత్మకముగ పరిశీలించిన యెడల అత్యంత ప్రాచీనకాలమునుండియును ప్రపంచమందంతటను శివలింగపూజనము ఆచారమునం దున్నట్లు కాన్పించు చున్నది.

పండిత మాధవాచార్యశాస్త్రిగా రిట్లు వ్రాయుచున్నారు. "శివలింగపూజ జైనులకాలమునుండియో లేక వామ మార్గీయుల నుండియో ప్రారంభించియుండునని నేడు కొందరు అల్పజ్ఞులనుచున్నారు. కాని నేటికి 2000 సం॥ లకు క్రితమే శంకరాచార్యులవారు 'అథ బ్రహ్మావతారస్య' యని సింహగర్జన మొనర్చియున్నారు. అందువలన, ఆయనకంటె పూర్వమే శివలింగ పూజనము బాగుగా వ్యాపించియుండెనని ఋజువగుచున్నది, అంతియెగాక, మనుస్మృతి (అధ్యా 2) లో ఇట్లు వ్రాయబడియున్నది.

శ్లో. నిత్యం స్నాత్వా శుచిః కుర్యా ద్దేవర్షి పితృతర్పణమ్
దేవతాభ్యర్చనం చైవ సమిదాధాన మేవచ॥

అనగా నిత్యమును స్నానాదికము లొనర్చి పవిత్రముగా దేవ, ఋషి, పితృతర్పణము లొనర్పవలయును. శివుడు మొదలైన దేవతా విగ్రహమ్ములను పూజింపవలయును. హవన మొనర్పవలయును.

మనువు సృష్టియొక్క ఆదికాలమునందలివాడు అగుటచే శివలింగ పూజనముకూడ సృష్టి ప్రారంభమునుండియే యుండెనని తెలియుచున్నది.

ఇతిహాస గ్రంథములనుండియును ఇటులనే తెలుసుకొనగలుగుచున్నాము. సంస్కృత సాహిత్యమునందలి ఆదికావ్యమగు వాల్మీకి రామాయణము (ఉత్తరాకాండ 31 సర్గ 42—43 శ్లో) నందు ఇట్లు వ్రాయబడియున్నది.

శ్లో. యత్ర యత్ర సయాతిస్మ రావణో రాక్షసేశ్వరః
జాంబూనదమయం లింగం తత్రతత్రస్మనీయతే
వాలుకావేది మధ్యేతు తల్లింగం స్థాప్యరావణః
అర్చయామాస గంధాఢ్యైః పుష్పైశ్చాగురుగంధిభిః॥

రాక్షసులకు రాజగు రావణుడు (దిగ్విజయయాత్రచేయునపుడు) ఎక్కడెక్కడికి పోయిన అక్కడికెల్లను సువర్ణ మయమగు లింగము నొకదానిని తీసుకొనిపోయెడివాడు. ఇసుకవేదికపై దాని నిడి గంధపుష్పాదులతో పూజచేసెడివాడు.

ఇటులనే శ్రీరామచంద్రుడు సహితము శివలింగపూజన మొనర్చినట్లు వాల్మీకి రామాయణము (యుద్ధకాండ సర్గ 125 శ్లో 20–21) నందున్నది.

శ్లో. అత్రపూర్వం మహాదేవః ప్రసాదమకరోద్విభుః
ఏత త్తదృశ్యతే తీర్థం సాగరస్యమహాత్మనః.

శ్రీరామచంద్రుడు సీతతో అనుచున్నాడు, 'దేవీ! ఇచట శివలింగస్థాపన మొనర్చి పూజించుటచే మాకు మహాదేవుని వరము లభించినది. అకనుపించునదియే గొప్పదగు సాగర తీర్థమైయున్నది.'

ఇది ఇప్పటికి 864000 సం॥ క్రిందటిమాట. దీనినిబట్టి అప్పటికే శివలింగపూజనము ప్రచలితమైయున్నట్లు తెలియనగుచున్నది.

## శైవగ్రంథమాల

1. సంధ్యావందనము ... 0—8—0

2. ఆంజనేయ స్వరూపనిరూపణము ... 0—8—0

3. భగవద్గీత ... 6—0—0

4. శైవాహ్నికము ... 1—0—0

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు ఉత్తరము వ్రాయవలెను.

Saivamataprakasika Regd. No. A 227

# శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అడ్రస్ :— 1

మునిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వరంగల్

అడ్రస్:— 2

మునిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) దుగ్గిరాల

సూచన :— వ్యాసములు - ఉత్తరములు - బ్లాకులు - చందాధనము ఈ పై అడ్రస్సులలో నొకదానికి పంపించవలెను.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# శైవమతప్రకాశిక

శ్రీ శైవమహాపీఠ పక్షమున ప్రచురింపబడు

సచిత్ర మాసపత్రిక


| సంపుటము | హేమలంబి సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౧ | 15—1—1958 | ౯ |



సంపాదకులు :

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.

*Principal Ayurvedic college & Superintendent*

*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు :

ముదిగొండ రామలింగశాస్త్రి


[illegible]

శ్లో|| శ్రీవేదశాస్త్రాగమతత్త్వప్రభాసికా

సందేహసందోహమహానిరాసికా ।

తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా

జయత్వియం శైవమతప్రకాశికా ॥


శ్రీ శైవమహాపీఠము

స్టేషనురోడ్డు, శ్రీ విశ్వేశ్వర దేవాలయము

వరంగల్

# విషయ సూచిక

# శైవమత ప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమునఁ బ్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవళంబినామ సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౮ | 15—1—1958 | ౯ |

## సంపాదకీయము

శ్లో॥ అకంఠేకళంకా దనంగే భుజంగా
దపాణౌ కపాలా దఫాలేఽన లాక్షాత్
అమౌళౌ శశాంకా దవామే కళత్రా
దహం దేవమన్యం నమన్యే నమన్యే॥

### అకంఠేకళంకాత్

శైవమతప్రకాశిక 6 వ సంపుటం 2 వ సంచిక 12 వ పేజీలో శ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగా రుదాహరించిన "అకంఠేక లంకాద"ను శ్లోకమునకు మనపండితు లొకరు జవాబు వ్రాయమని కోరినందున వ్రాయబడుచున్నది.

"అకంఠేకలంకాత్" దేవత లెవ్వరికి సాధ్యముకాని హాలా హాలవమును మ్రింగి దేవతల భయము బాపి రక్షించినాడని భావము.

"అనంగేభుజంగాత్" వాసుకి తక్షకులు కుండలములుగను-ఆదిశేషువు యజ్ఞోపవీతముగను ధరించుటచే అనుపమాన శక్తిసంప న్నుడని భావము.

" అపాణౌకపాలాత్ " బ్రహ్మశిరంబును ద్రుంచి శూలపాణియై భిక్షమెత్తిన భైరవయవతారమున దుర్జనుల శిక్షించువాడని భావము.

" అఫాలేఽనలాక్షాత్ " దేవతలకంటె విలక్షణమైన ఫాల నేత్రమున కాముని దహించి జితేంద్రియుడై యున్నవాడని భావము.

" అమౌళౌ శశాంకాత్ " దక్షశాపమున రాజయక్ష్మచే పది హేను కళలు క్షీణముకాగ శేషించిన పదహారవకళను శిరంబున ధరి యించి చంద్రుని బ్రతికించిన భోళాశంకరుడని భావము.

" అవామే కళత్రాత్ " శివశక్త్యాత్మకమైన రూపము ధరించి ప్రపంచమంతయు శక్తివిశిష్టమైనదని తెలియజేయుచున్నాడని భావము.

ఇట్టి ఈశ్వరునకంటె నితర దైవమును నేను తలంచను.

ఈ శ్లోకము శంకరాచార్య రచితమగు శివభుజంగస్తోత్రములోని కఠినశ్లోకము. కంఠేకలంకః యస్యసః అని బహూవ్రీహి సమాసము చెప్పితే అర్థము కుదరదు. అందువలన కంఠేకలంకః కంఠెకలంకః అని సప్తమీ సమాసముచెప్పి తరువాత "కంఠేకలంకస్య అభావః అకంఠేక లంకః" కంఠమునందు కలంకాభావమువలననూ అంగమునందు భుజంగాభావము వలనను, శివునిదప్ప యితరదైవములను కొలువనని భావము.

అపంచమ్యాః అను నిషేధముండుటవలన అవ్యయీభావమున, అంభావమురాదు.

ఇట్లు
సంపాదకుడు

# శైవ మహాపీఠ విరాళములు

| | |
|---|---|
| లోగడ నిల్వ | 7-0-0 |
| శ్రీయుత ఆకారపు రాజచెన్న విశ్వేశ్వరరావుగారి వలన | 1-0-0 |
| ,, గుండా రాజలింగంగారి వీరభద్రయ్యగారి వలన | 1-0-0 |
| ,, నార్ల నారాయణ, మణెమ్మ, సుందరమ్మగార్ల వలనజమ | 3-4-0 |
| ,, గుండా రాజయ్యగారి వెంకట్రాజంగారు | 1-0-0 |
| ,, తేగొండ నరసయ్యగారి వలనజమ | 2-4-0 |
| 31-12-57 వరకు నిలువ జమ | 15-8-0 |

---

# దేవాది తర్పణము

స్మృత్వాచమనం కృత్వా। ప్రాణానాయమ్య । ఏవంగుణ విశేషణ విశిష్టే, శుభే, అభ్యుదయముహూర్తే శ్రీమాన్ — గోత్రః— శర్మా - అహం మమ ఉపాత్తదురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య పరమేశ్వర ప్రీత్యర్థం దేవర్షి పితృతర్పణం కరిష్యే॥

అని సంకల్పించి దేవతర్పణము బ్రహ్మతీర్థముతో చేయవలెను.

### దే వ త ర్ప ణ వి ధి

మహాలింగచేర స్వరూపంమాయా విశిష్టం జ్యోతిర్మయం,
పరశివం మహాదేవం తర్పయామి॥
మహాశక్తిదేవతా ప్రకృతి జనయిత్రీం పరాశక్తిం,
మహాదేవీం తర్పయామి॥
శివాదయో యే దేవస్తాన్ దేవాన్తర్పయామి॥
సర్వాన్ దేవగణాంస్తర్పయామి॥
సర్వాన్ దేవపత్నీగ్ంస్తర్పయామి॥

సర్వాన్ దేవపుత్రాగ్ం స్తర్పయామి॥
సర్వాన్ దేవపౌత్రాగ్ం స్తర్పయామి॥
భూర్దేవాగ్ం స్తర్పయామి॥
భువర్దేవాగ్ం స్తర్పయామి॥
సువర్దేవాగ్ం స్తర్పయామి॥
భూర్భువస్సువర్దేవాగ్ం స్తర్పయామి॥
ఇష్టలింగం తర్పయామి॥
ప్రాణలింగం తర్పయామి॥
భావలింగం తర్పయామి॥
ఆచారలింగం తర్పయామి॥
గురులింగం తర్పయామి॥
శివలింగం తర్పయామి॥
చరలింగం తర్పయామి॥
ప్రసాదలింగం తర్పయామి॥
మహాలింగం తర్పయామి॥

## ఋషి తర్పణము

ఉపమన్యు దధీచి దూర్వాసవ్యాసాదయోయే,
ఋషయస్తాన్ ఋషీగ్ం స్తర్పయామి తర్పయామి॥
సర్వాన్ ఋషిగణాగ్ం స్తర్పయామి తర్పయామి॥
సర్వాన్ ఋషిపుత్రాగ్ం స్తర్పయామి తర్పయామి॥
సర్వాన్ ఋషిపౌత్రాగ్ం స్తర్పయామి తర్పయామి॥
సర్వాన్ ఋషిపత్నీగ్ం స్తర్పయామి తర్పయామి॥
సర్వాన్ ఋషిపుత్రాగ్ం స్తర్పయామి తర్పయామి॥
సర్వాన్ ఋషిపౌత్రాగ్ం స్తర్పయామి తర్పయామి॥
భూః ఋషీగ్ం స్తర్పయామి తర్పయామి॥
భువఋషీగ్ం స్తర్పయామి తర్పయామి॥

సువఋషీగ్ం స్తర్పయామి తర్పయామి॥
భూర్భువస్సువఋషీగ్ం స్తర్పయామి తర్పయామి॥

జపమాలవలె జందెమును ధరించి ఋషితర్పణమును చేయవలెను.

★

## నైవేద్యము

(ముదిగొండ రామలింగ శాస్త్రిగారు – ఈమని)

శిష్యుడు :– లింగధారి దేవతాంతరమునకు నివేదించిన పదార్థమును గ్రహింప వచ్చునా ?

గురువు :– దేవతాంతరమునకు నివేదించిన పదార్థమును స్వేష్టలింగమునకు నివేదింప కూడదు. అదియునుగాక ఒక లింగమునకు నర్పించిన దానిని వేరొక లింగమునకు నర్పింప గూడదు. వస్త్రము – ఆభరణము – పుష్పము – అన్నము – పానీయము – ఔషధము – మొదలగు వానిని ప్రాణాంత సమయమందైన స్వేష్ట లింగమునకు నర్పించియే గ్రహింపవలయును.

శిష్యుడు :– ఓ గురువా! ఒకలింగమున కర్పించినదానిని నింకొక లింగమున కర్పింపగూడదని యంటిరి. అన్నియు లింగమునకు నివేదించియే గ్రహింపవలెనంటిరి. ఇది స్త్రీలకెట్లు సంభవించును. భార్య భర్త యుచ్ఛిష్టమును ప్రతిదినము సేవించుచుండునుగదా! భర్తృ శేషము మొదట భర్తచే తన లింగమునకు నర్పింపబడినదేగదా! దానిని భార్య తిరిగి తనలింగమునకు నెట్లు నర్పించును? తనలింగమునకు నర్పింపక తాను భుజించుట యెట్లు? ఈ విషయము విన్నవింపుడు.

గురువు :- ఇది ముఖ్యముగా నందఱు తెలిసికొనదగిన విషయము. నివేదనము రెండు విధములు. అందు లింగ మనుభవించినట్లు భావించి తా ననుభవించుట యొకటి. తా ననుభవించుటకు లింగము ననుజ్ఞగై కొనుట యనునది వేరొక్కటి. భర్తృశేషము గురుప్రసాదము, గురుపాదతీర్థము, లింగతీర్థము ననువానిని గ్రహించు నప్పుడు లింగముయొక్క యనుజ్ఞగొనుట యను నివేద నమే చేయవలయునుగాని ముందు లింగమనుభవించినట్లు భావిం చుట యను నివేదనము చేయగూడదు.

శిష్యుడు :- భర్తృశేషమును లింగమనుభవించినట్లు భావించుట రూపముగా వర్పింపగూడదేని అట్టినివేదనము స్త్రీలకు ప్రతిదినము సంభవించుటెట్లు? స్త్రీలు ప్రతిదినము భర్తృశేషమునే సేవింప వలయునుగానను భర్తృశేషమునకు భోగరూపార్పణము కూడదు గానను స్త్రీలకు భోగరూపమగు నర్పణ మెప్పుడును సంభవింపదు. స్త్రీలు లింగపూజగావించి లింగమునకు భోగరూపార్పణము చేయ వలయునా? పనిలేదా? చేయవలయునేని భర్తృశేషమట్లు నివేదింపకూడదని చెప్పితిరిగదా? ఇంక దేనిని నివేదింపవలయును? భర్తృశేషముగాక వేరుపదార్థమునట్లు నివేదింపవలయునందురేని పతివ్రత భర్తృశేషము భుజింపవలయునా? లింగభోగరూప నివే దితమును భుజింపవలయునా? తెలుపుడు.

గురువు :- స్త్రీలలో పూర్వసువాసినుల విషయమై సంశయము లేదు గదా! ఇక సువాసినుల విషయమై చెప్పుచున్నాను. ముత్తైదువ లింగపూజ గావించినను కావింపకున్నను వేరుపదార్థముతోనే లింగభోగరూప నివేదనము ప్రతిదినముచేసి శివలింగమందును తన భర్త యందును భక్తి కలదై రెండు ప్రసాదములను భుజించు చుండవలయును.

శిష్యుడు :- లింగార్పిత పదార్థమును వదలిపెట్టవచ్చునా ?

గురువు:-లింగమునకర్పించని పదార్థమును భుజింపగూడని విధమున అర్పించని పదార్థమును పరిహరింపగూడదు. అలా ప్రసాదమును వదలిపెట్టువాడు శివానుగ్రహ పాత్రుడు కాజాలడు.

శిష్యుడు :- నివేదనము చేసిన పదార్థమును వదలిపెట్టగూడదేని, భార్యకు శిష్యులకును ప్రసాదము నొసగుదురుగదా ! అవియెట్లు సంభవించును ? రౌరవమున నున్నవారల నుద్దేశించి జలము విడుచుట యెట్లు ? జలము పుక్కిలించివేయుట యెట్లు? భుజించి చేయి మూతి కడిగికొనినను ప్రసాద శేషము కొంతయైన విడువబడక యుండదుగాన నవియెట్లు లాచరింపవలయును. ప్రసాదము పవిత్రమైనదిగాన దానిని గ్రహించి కరముఖశుద్ధి యెట్లు చేసికొన వలయును ? నివేదింపని జలమును పుక్కిలించి వేయనగునా ? నివేదించిన జలమును పుక్కిలించి విడుటయెట్లు ? నివేదన సందర్భమున నున్న నిట్టిసంశయముల దెలుపవలయును.

గురువు :- భార్యకు, శిష్యునకు ప్రసాదము నొసంగినను " రౌరవే౽పుణ్యానిలయే " అను మంత్రముతో నరకవాసులకు నుదకము నిచ్చినను నీ విషయమున ప్రసాదత్యాగ దోషములేదు. ఏలనగా ప్రసాదమును విడువగూడదని చెప్పిన నిషేధము శాస్త్ర విహితముగాన ప్రసాదత్యాగమును గూర్చి ప్రవర్తించినదే. భార్యకు శిష్యులకు ప్రసాదము నొసగవలయుననియు, నరకవాసులకు జలము నియ్యవలయుననియు శాస్త్రవిధులు గలవు. లోకమున నవిహితత్యాగంబును గలదు. ఎట్లనగా ఆశచే నధికముగా నివేదనముచేసి భుజింపలేక పరిహరించుటయు నద్దాని నసర్పములు, శ్వానములు మొదలుగా నుపయోగించుటచే నది దుర్వినియోగ మొందుటయు నీవిధమున ననుభవసిద్ధమై యున్నది. ప్రసాదమును పరిహరింప

గూడదను నిషేధము అవిహిత త్యాగమునందు చరితార్థమగు చున్నది గాన విహితత్యాగమును బాధింపజాలదని యెఱుంగ వలయును.

ఇక పుక్కిలించివేయుట మున్నగునవి యెట్లనిన పుక్కిలించి వేయుట మొదలగు కృత్యముల నుద్దేశించి యా రూపముననే నివేదనముచేసిన జలముతో నాయా కృత్యముల జరుపుకొనిన దోషములేదు. ఏలన పుక్కిలించి వేయుటకై నివేదన చేయు నప్పుడు ఈశ్వరుఁడును పుక్కిలించి వేసినట్లు భావించుట యను విధముననే చేయవలయునుగాన నీ విధమున నివేదనముచేసి యిట్టి పనులు తీర్చుకొనిన దోషములేదు. ముఖశుద్ధియందు ప్రసాద త్యాగము సంభవించదాయన్న, ముఖశుద్ధి, హస్తశుద్ధియు శాస్త్ర విహితములేగాన నా సమయమందలి ప్రసాదత్యాగము విధిమూల కమే యగునుగాన నిందు దోషములేదు.

శిష్యుడు :- గురు ప్రసాదస్వీకరణ విషయమున శుద్ధ్యాదు లావశ్యకము లేనా ?

గురువు :- " ప్రసాదస్తు కణత్రయం " అను వచనమునుబట్టి కణత్రయ రూపమగు గురుప్రసాదము మున్నగువానియెడ శుద్ధ్యాదులకు ప్రసక్తిలేదు. ఇందు కారణమేమనిన విధిమూలకః అను వచన మునుబట్టి యున్నివృత్తికై చేయు నాహారాదులయెడ ముఖశుద్ధ్యా దులు విహితములుగానను కణత్రయాత్మికమగు ప్రసాదమునెడ శుద్ధ్యాదులు నిషిద్ధములుగానను " వచనాత్ప్రవృత్తిః వచనాన్ని వృత్తిః " అను శాస్త్రానుసారమున నీ యర్థము లభించుచున్నది.

ఆహారమునకై గ్రహించిన ప్రసాదమునెడ శుద్ధి విధింపబడుట కును కణత్రయ రూపమగు ప్రసాదమునెడ శుద్ధి నిషేధింపబడుట కును ముఖ్యకారణమేమనిన " లాలాసంబంధరాహిత్యాత్ " అను

పదమునుబట్టి యొక విశేషము కనబడుచున్నది. ఏమనిన కణాత్రయాత్మికమగు ప్రసాదము గ్రహించునప్పుడు హస్తమునకు లాలా (సొంగతో) సంబంధము లేదు. ఆహారమునకై గ్రహించునప్పుడు అది కలుగక తీరదు. ప్రసాదము పరమపవిత్రమే అయినను లాలా సంబంధము వల్లనే ఆహారమునకై గ్రహించిన ప్రసాదమునెడ ముఖశుద్ధ్యాదులు విహితములని తెలియుచున్నది.

శిష్యుడు :- పవిత్రమైన యీశ్వరప్రసాదమును గ్రహించునప్పుడు లాలాసంబంధము గల్గియే యా ప్రసాదము కుక్షిలోన ప్రవేశించును గాన లోనప్రవేశించు ప్రసాదమునకు లాలాసంబంధముచే పవిత్రత సంభవింపదా ?

గురువు :- లాల (చొంగ) మొదలగునవి స్వస్థానమునుండి యీవలికి వచ్చినప్పుడే యపవిత్రములని శాస్త్రములయందు గలదు గాన లోన ప్రవేశించు ప్రసాదమునకు లాలాసంబంధముచే నపవిత్రత గల్గదు.

ఈ పై విషయమంతయు కారణాగమందు ఈశ్వరుడు పార్వతీ దేవితో చెప్పినటుల గలదు.

*
* *

# శ్రీ నీలకంఠ భాష్యము

[సంపుటము ౮, సంచిక ౮, తరువాయి]

(శ్రీకంఠ విద్యాభూషణ, సంస్కృతసాహిత్యరత్న)
ఆంధ్రీకర్త : నిర్మల శంకరశాస్త్రిగారు

శ్లో॥ వ్యాససూత్రమిదం నేత్రం విదుషాం బ్రహ్మ దర్శనే,
పూర్వాచార్యైః కలుషితం నీలకంఠేనాద్య ప్రసాద్యతే॥

అంగములతో కూడిన వేదములను వేదాంతములను చదివి యవ్వాని యర్థమును గ్రహించుటవలన బ్రహ్మస్వరూపము మనుస్సు నందు తోఁచుచుండును. ఇట్టి జిజ్ఞాసువులకు "బ్రహ్మ యిట్టి" దని నిశ్చితబుద్ధి కలుగుటకై వ్యాసులవారిచే రచింపఁబడిన ఈ సూత్రముల సముదాయము నేత్రము వంటిదనియు, ఇట్టి వ్యాససూత్రములను వ్యాఖ్యానించిన పూర్వాచార్యు లందఱును సూత్రముల యర్థమును కలుషితముఁ గావించినవారు గావున నీలకంఠ శివాచార్యుడ నగు నేను సూత్రములకు సహజమైన [ప్రసన్నమైన] యర్థమును అనగా సూత్రకారుని యుద్దేశమును సరిగా కనుగొని సరళమగు సమన్వయముతో వివరించుచున్నానని శ్లోకార్థము.

లోకములో నుండు వస్తువులను కనుగొనుటకు కన్నువలె – బ్రహ్మదర్శనమునకు శ్రీ వేదవ్యాస ప్రణీతమైన సూత్రజాతము నిరపేక్ష (రెండవ వస్తువవసరములేని) సుసాధనమని "నేత్ర"మను పదము విశదపఱచుచున్నది. మఱియు కుత్సితవైద్యులచే వికృతములైన నేత్రములు సద్వైద్యులచే బాగుచేయబడునట్లు పూర్వాచార్య కలుషితములైన వ్యాససూత్రములను ప్రసన్నార్థ నిరూపణముతోడ నుపాదేయములుగా నొనర్చినవారని గ్రహింపనగును.

కొందఱు మాయావాదబలముతోడ నధ్యాసకల్పనతోడను జీవేశ్వరుల కభేదమును నిరూపించుటతోడను, మరికొందఱు అనశ్వరులందు ఈశ్వరత్వమును తర్క వితర్కబలముతో సాధించు దుష్ట వ్యాఖ్యానములతోడ వ్యాససూత్రములను కలుషితములఁ గావించిరని "పూర్వైః కలుషితం" అను పదము తెలుపుచున్నయది. భాష్యకర్తలందఱును శ్రీ నీలకంఠ భగవత్పాదులవారి తరువాతివారైనను భాష్యకర్తల యభిమతములను పూర్వపూర్వముగా తెలిపినవారందఱు ఇచటి పూర్వపదముతో చెప్పఁబడుచున్నవారు.

ప్రమితత్వాధి కరణమునందు చెప్పఁబడిన ఈశానశబ్దము యోగశక్తిచే నారాయణాదులందు వర్తించునదైనను యోగము వలనను రూఢివలనను శంకరునే బోధించు ననియు, "శబ్దాదేవ ప్రమితః" అనుసూత్రమున కీశాన శబ్దాశ్రయశ్రుతియే విషయవాక్య మగు ననియు, ఇది మొదలగు ఉపనిషదము లన్నిటితో నారాయణ పరత్వమునుగాని, జీవ పరత్వమునుగాని, ప్రకృతి పరత్వమునుగాని సాధించుటకు వలనుపడదనియు, "ప్రసాద్యతే" అనుపదము తేట పఱచుచున్నయది.

శ్లో॥ బ్రహ్మసూత్రం పయో గాంగం - మలత్రయ విశోధకం,
పరైః పంకిలితం నీల - కంఠారాధ్యేన శోధ్యతే॥

మలము-అనగా అజ్ఞానము - ఆణవమనియు, మాయికమనియు, కార్మికమనియు, మూడు విధములై యుండును.

ఆణవము - సృష్ట్యారంభమున అణువులవలన ఏర్పడునది.

మాయికము - ఈశ్వరుని శక్తియగు మాయవలన సంభవించునది.

కార్మికము - సంచిత ప్రారబ్ధరూపమైన కర్మకు సంబంధించునది.

ఇట్టి మలములను పోనాడునట్టియు గంగోదకమువలె పవిత్రమైనట్టియు బ్రహ్మసూత్ర సముదాయమును ఇతరాచార్యులు అపార్థ కల్పనముతో మలినముఁ గావించినవారు కావున నీలకంఠారాధ్యుడను పూర్వోక్తమైన సదర్థముతో నిర్మలములఁ జేయుచున్నవాడను. కర్మజ్ఞానముల రెంటిఁదగు సమరస భావముగల శివభక్తియోగము - జీవేశ్వరజగములను ప్రతిపాదించుట ద్వారా బ్రహ్మసూత్రములందు నిరూపింపఁబడిన దగుటచేసి శివయోగుల కీసూత్రార్థము పరమాదర ణీయ మగుచున్నయది.

శ్లో॥ నీలకంఠో వివృణుతే – శ్రీకంఠోపసమాహ్వాయః॥
బోధాయనోక్తి మాలంబ్య – బ్రహ్మసూత్రం యథాశ్రుతి॥

శ్రీకంఠుడనఁబడు నీలకంఠశివాచార్యులు – బ్రహ్మసూత్రములను శ్రుత్యనుకూలార్థముతో బోధాయనవృత్తి ననుసరించి వివరించుచున్నవారు. "శ్రీ భాష్యకారులను సూత్రములను విష్ణుపరములుగా బోధాయనవృత్తి నవలంబించియే వ్యాఖ్యానించినవా"రని చెప్పఁగూడదు బోధాయనుడు శైవులలో నగ్రగణ్యుడగువాడు. మఱియు భగవత్తత్త్వము శివరూపమని నిర్ధారించి మభాన్యాస రుద్రయాగాది కల్పముల నేర్పఱచియు విష్ణుపరత్వము నుపేక్షించుటవలన బోధాయన విరచితమగు సూత్రవృత్తి శ్రీభాష్యకారుల కుపయోగింపదనియు, శ్రీ నీలకంఠ శివాచార్యులు శ్రీ రామానుజాచార్యులకన్న మొదటి వారగుటచే బోధాయనవృత్తి శ్రీవారికే లభ్యమై యుండుననియు ఇందువలన శ్రీభాష్యకారులు శ్రీకంఠభాష్యగతమైన వృత్తిపద్ధతి నవశ్యముగా గ్రహించియుందురనియు శైవాచార్యుల యేకగ్రీవాభిప్రాయము.

ఇట్లు తా రచించిన భాష్యమునందు పరభాష్యములకంటె నుత్కర్షమును నిరూపించినవారై యితరగుణములఁ దెలుపుటకై దిగువశ్లోకము నుదాహరించినవారు.

శ్లో॥ శ్రీమతాం వ్యాససూత్రాణాం శ్రీకంఠీయః ప్రకాశతే ।
మధురో భాష్యసందర్భో మహార్థో నాతివిస్తరః॥

నిఖిల వేదార్థగర్భితములైన వ్యాససూత్రములకు శ్రీకంఠ శివాచార్య ప్రోక్తమగు భాష్యసందర్భము మధుర (సరస) మై బ్రహ్మ గుణములను, బ్రహ్మతత్త్వమును నిర్ణయించుటకు వలయు న్యాయ సహస్రముతో నిండియుండున దగుటజేసి గొప్పయర్థముకలదై అనవ

సర ప్రసంగములు లేనిదగుటచే మిక్కిలి విస్తృతము కానిదై యున్నది.

సకలవేదార్థమును బాగుగా గ్రహించిన వేదవ్యాసులు రచించిన బ్రహ్మసూత్రములకు బ్రహ్మ (వేద) శ్రీః సహజమని "శ్రీమతాం" అను పదము తెలుపుచున్నయది. రస మనగా పరమాత్మ. శ్రుతి నిర్ధారితమై నిరతిశయానంద రూపమగు పరబ్రహ్మను ప్రతిపాదించునది భాష్యమని "మధురః" అనుపదము విశదపఱచును. "నాతివిస్తరః" అనుటచే పరభాష్యము లందున్న శబ్దాడంబర మిందు లేదని తెలియుచున్నది.

ఇట్టి శ్రేష్ఠగుణములుగల సూత్రభాష్యము, సర్వగ్రాహ్యము కాకుండునా యని శంకించుకొని భాష్యగ్రాహకుల యోగ్యత నీ క్రింది శ్లోకముతో నిరూపించుచున్నవాడు.

శ్లో॥ సర్వవేదాంత సారస్య సౌరభాస్వాదమోదినామ్,
ఆర్యాణాం శివనిష్టానాం భాష్యమేత న్మహానిధి॥

ఈ భాష్యము వేదాంతము లన్నిటియొక్క (నిరవధికముగా నాస్వాదింపఁదగు) పరమాత్మయందలి తాత్పర్య మనబడు పరిమళము నాఘ్రాణించుటచే సంతృప్తిపడునట్టి శివనిష్ఠులైన పూజ్యులందరికిని మహానిధివంటిది.

శివనిష్ఠు లనగా సర్వాంగలింగ సాహిత్యముతో సదాశివు నుపాసించు ఆర్యులు. రామానుజీయులు పాంచరాత్ర ఆగమముల ననుసరించి "యదా తమ స్తన్నదివా నరాత్రి ర్నసన్నచాస చ్ఛివ ఏవ కేవలః" ఇత్యాది శ్రుతివాక్యములకు విష్ణుపరత్వము నన్వయింపఁ జాలరైరి. ఇతరులు "ద్వాసుపర్ణా" మొదలగు వేదవచస్సులకు జీవ బ్రహ్మైక్యమును ప్రతిపాదింపఁ జాలకుండిరి. ఇట్టి వారి కీ భాష్యము

గ్రాహ్యము కాకుండినను సర్వశ్రుతిప్రమాణ వాదులైన శైవులకు పర మాదరణీయ మగుచున్నయది.

పూర్వసుకృత పరిపాకము గలవారికి ద్రవ్యనిధి ప్రకాశించునట్లు నిరంతర శివధ్యానముఁ జేయు మహానుభావుల కీ సూత్రభాష్యము సకల వేదాంతార్థ నిర్ణయమును కలుగఁజేసి దర్శనమాత్రమున పర మానందజనకమై సకల కల్యాణగుణసంపన్నమగు శివరూపము నవ గతముఁ జేయునదై యున్నది. మఱియు పాపాత్ములకు ఘోర సర్పా కారముతో గోచరించునదై దధీచిగౌతమాది శాపదగ్ధులగు వారికి రుచించనిదై యున్నయది.

* *
*

# శివభక్తిసుధా

ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారు శతావధాని

శ్లో॥ శృంగారతో యధితరంగ సుధారసార్ద్రైః
కందర్పదగ్ధతను సుందర భస్మరేణుః
యుష్మత్తనుం కుసుమగర్భరజస్సమానం
శృంగారకేళి సమయే సమలంకరోతి. 9

శ్లో॥ వ్యాసశ్శుక స్సకలమౌని వరాస్సమంతా
దాత్మానుభూతి సకలామపి కావ్యరూపాం
కృత్వాభవ త్కరుణ యా భవతాస్యహైవం
కైలాసవాస మసకృన్మనసాచ కాంక్షుః. 10

శ్లో॥ ఆనందకానన మహార్యసుతా విలాసం
కాశీపురం భవతితావక నిత్యవాసం.

గంగాతరంగ పరిసేవిత, దివ్యవాయుః
సాయంతనే ప్రతిదినం సుఖమాతనోతి. 11

శ్లో॥ సంకల్ప మాత్రధృత చిత్రవిచిత్రరూప,
బ్రహ్మాండ పూర్ణ పరిశోభిత సుందరాంగః,
త్వం త్వాంకథం వికృత వేషమవైతి లోక
స్వేచ్ఛానురూపతను రిత్య నభిజ్ఞవృత్యా. 12

శ్లో॥ యస్మాన్మృకండు తనయస్యత్వయాచిరాయు
ర్దత్తం యమస్యమరణం లిఖితం విధాత్రా,
జానాతితత్రకిమిదం భవతీతిచిత్రం
భక్తస్త్వదంఘ్రి కమలద్వయ భక్తి హేతుం. 13

శ్లో॥ కిం, దారుకావన విహారవిలాస కేళిః
మౌనీంద్ర చిత్తమదగర్వ విభంగ హేతుః,
యద్వావిలాస యువతీ విషయైకసృష్టిః
లభ్యాభవేన్నత వసంతతసృష్టి చిత్రే. 14

శ్లో॥ శీర్షస్ఫురత్కుటిల ద్బాలశశాంక రేఖా
నిష్ఠ్యూతసంతత సుధార్ద్రిభవత్కృపాధీః,
ప్రాలేయశైలతనయా విషయేస్రవంతీ
హ్యాస్మాదృశేషు భవితాకథ మూహ్యమానా. 15

శ్లో॥ యుష్మద్వివాహ మసకృత్ప్రతి వత్సరేకిం
కర్తవ్యమిత్యను దినంభువి శంకమానాః,
మర్త్యా భవంత్యఖిల జీవిత కాలమేషా
కోట్యంశమిత్యగణ యంతిహి తేక్షణస్య. 16

శ్లో॥ లోకే విచిత్రమిదమే కమవై తిమర్త్యో౽,
ర్ధాంగీకృతం హియువయోారపిదంపతీత్వం,
అన్యోన్యకాంక్షిత తపః ఫలదానరూపం
కింకాంక్ష్యమస్తి తవసృష్టిభవం సమస్తం. 17

శ్లో॥ భక్తాత్మపద్మ మధులోలుప చిత్తభృంగ
స్త్వంసర్వదేత్యభిమతఃఖలు భక్తవర్గైః,
తస్మాదియంగిరి సుతా భువిభ్రామరీతి
సంకీర్త్యతే నిజమనోంబుజవర్తి నీతి. 18

శ్లో॥ రత్నాకరాశ్చ చతురశ్చరమాంగ భాగే,
తూణీరతా మిహావ్రజంతితవైవ శంభో
రత్నానితావక తనౌ వివిధానిసంతి
తస్మాత్తథావదుపమాకవితా ప్రసిద్ధా. 19

శ్లో॥ శృంగారకేళి కలనా పరహస్తభాగే
లీలాకురంగధరణా భరణ ప్రసక్తిః,
ప్రేమావృతాత్మ విషయః పరికల్పితస్తే
భక్తౌఘు కాంక్షిత సదా వనశీలభావాత్. 20

* *
*

## శైవగ్రంథమాల

| | | | |
|---|---|---|---|
| 1. | సంధ్యావందనము | ... | 0—8—0 |
| 2. | ఆంజనేయ స్వరూపనిరూపణము | ... | 0—8—0 |
| 3. | భగవద్గీత | ... | 6—0—0 |
| 4. | శైవాహ్నికము | ... | 1—0—0 |

Regd. No. A 227

## శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | [illegible]—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అధిప :— 1

ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వ రం గ ల్

అధిప :— 2

ముదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) దుగ్గిరాల

సూచన :— వ్యాసములు - ఉత్తరములు - గ్రంథములు - చందాధనము ఈ పై అడ్రస్సులలో [illegible]దానికి పంపించవలెను.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమునఁ బ్రచురింపఁబడు
సచిత్ర మాసపత్రిక


| సంపుటము | హేవళంబి సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౮ | 15—2—1958 | ౧౦ |



సంపాదకులు :

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.

*Principal Ayurvedic college & Superintendent*
*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు :

ముదిగొండ రామలింగశాస్త్రి

భాషాప్రవీణ.


శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థతతిప్రభాసికా
సందేహసందోహమహానిరాసికా ।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా
జయత్యియం శైవమతప్రకాశికా ॥


శ్రీ శైవ మహా పీఠము

స్టేషనురోడ్డు, శ్రీ విశ్వేశ్వర దేవాలయము

వరంగ

# విషయసూచిక



* *
*

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమునఁ బ్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవళంబినామ సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౮ | 15—2—1958 | ౧౦ |


## సంపాదకీయము

ఏ మహాదేవుఁడు బ్రహ్మ విష్ణువుల వివాద తీర్పను యే మాఘ కృష్ణచతుర్దశి నాటిరాత్రి సమయమున జ్యోతిర్లింగాకారమున బ్రాదుర్భవించి జగత్త్రయమును పూన్చెనో, యా దేవ దేవుఁడు త్రిమూర్తుల కతీతుఁడై లింగరూపమున బూజింపబడుచు బరశివ రూపమున భావింపబడుచు నున్నాఁడు. మాఘ కృష్ణ చతుర్దశియే మహాశివరాత్రి పర్వ దినముగ నెన్నబడుచున్నది. ఆద్యంత రహితమై - జ్యోతిర్లింగాకారముగనున్న యనల స్తంభము, లోకజన సంసేవనార్థ మల్ప మూర్తిందాల్చి యరుణాచల నామంబున సుప్రసిద్ధంబయ్యెను.

ఈ కథా విధానమంతయు బహు పురాణ ప్రసిద్ధము. పూర్వ కాలంబునందొకప్పుడు విష్ణుండు గరుడాద్యనుచరులతోఁగూడి పరమైశ్వర్య సమన్వితుండై యనంతశయనంబున శయనించియుండ నా సమయంబున బ్రహ్మదేవుండు యదృచ్ఛావశంబున నచటి కరుదెంచెను. తన కచట సముచిత మర్యాద జరుగనందులకు కమలాసనుడు కోపించి విష్ణునిజూచి - నేను జగత్పితామహుండను - నీకు ప్రభుండనని తెలిసికొను మనెను.

అంత నారాయణుం డాతనిని జూచి ఓ వత్సా! నీవు నా నాభి కమలమందుండి యుదయించితివి - కావున నీవు నా పుత్రుండవు. ఈ పరిదృశ్యమానంబగు జగంబంతయును నా యందే యిమిడి యున్నది. నీవు తస్కరునింబోలి పరసంపదను నీయదిగా భావించుచున్నావు. ఇది తగ దనెను.

ఈ విధముగ నయ్యిరువురకును మోహావశంబున సర్వ శ్రేష్ఠత్వ మును గూర్చి పరస్పర వాగ్వాదము జరిగెను. అదియే మహా యుద్ధ ముగ పరిణమించెను. ఇరువురు నసంఖ్యాకంబులును దుస్సహంబులు నగు నస్త్రంబుల బ్రయోగించుకొనిరి. చివరకు నారాయణుండు క్రోధోజ్వలుండై భయంకర మహేశ్వరాస్త్రంబును ధనస్సున సంధించి విడువగా - కమలాసనుడు నిరతిశయ రోషావేశంబున విశ్వమండల మును ప్రకంపింపజేయు ఘోరతరంబగు పాశుపతాస్త్రమును బ్రయో గించెను. ఆ దివ్యాస్త్రంబులు రెండును గగన తలంబున కెగసి యతి భయంకర రూపంబులచే బ్రతీయమానంబు లయ్యెను.

అది గాంచి దేవతలందఱును భయభ్రాంతులై యెవ్వనిచే సృష్టి స్థితి ప్రళయ తిరోభావాను గ్రహంబులు ప్రవర్తితంబులగు చున్నవో, యా మహాదేవుని మనంబున ధ్యానించుచు కైలాస శిఖరం బున కేగి - పార్వతీ దేవితో గలసి రత్న సింహాసనారూఢుడైయున్న పరమేశ్వరుని సందర్శించి దండప్రణామంబు లాచరించిరి. వారి యా గమన వృత్తాంత మంతయు సర్వజ్ఞుండగు సర్వేశ్వరుండు మున్నే తెలిసి కొన్న వాడు గాన వారి కభయ హస్తమిచ్చి పంపి తాను యుద్ధభూమి కరుదెంచి యయ్యుభయ యోధుల మధ్యస్థలంబున నగ్ని స్తంభాకృతి నావిర్భూతుండయ్యెను. అంత త్రిలోక సంహార సమర్థంబులయిన యా యుభయుల భీమాస్త్రంబు లా యనల స్తంభంబున నిపతితంబులై ప్రశాంతంబు లయ్యెను. అయ్యద్భుత సంఘటనముంగాంచి యంద ఱాశ్చర్యాన్విత చిత్తులై పోయిరి. బ్రహ్మా విష్ణువులుగూడ నివ్వెఱపడి

యా యగ్ని స్తంభా విర్భావమునకు గారణంబు తెలియక - దాని యౌన్నత్యమునకు నాశ్చర్యముచెంది దాని యాద్యంతముల గను గొనుట కిరువురు నుద్యుక్తులైరి.

విష్ణువు వరాహ రూపంబునను - బ్రహ్మదేవుండు హంసా కృతినిదాల్చి బయలుదేరిరి. వరాహరూపియగు విష్ణుండు పాతాళంబు ఛేదించుకొని బహుదూరంబు పోయి నా స్తంభ మూలమును గను గొన నేరక నిరతిశయ పరిశ్రాంతుండై తిరిగివచ్చి యథాస్థానంబున గూడుచుండెను. విధాతయు హంసరూపంబున బహుదూరమేగి శిరో భాగంబును దెలిసికొనంజాలక విచారగ్రస్థుడైయుండి పైనుండి పడు చున్న కేతకీ పుష్పమునుజూచి తన యుద్దేశమునుదెల్పి "నీ వెచటి నుండి యరుదెంచుచుంటివని యడిగెను". అదియు నతనింగాంచి నే నీ స్తంభ మధ్య స్థలమునుండియే చిరకాలంబునుండి పడుచున్నాను. దీని మూలంబు నింతవఱకును గాంచలేకున్నాను. కాన నీ స్తంభాగ్రమును దర్శించు నాశను మీరు వీడుడు. ఈ మాటల విని విధాత నిరాశను చెంది చూచుచుండ నొక కామధేనువు పైనుండి వచ్చుచుండుట గాంచి - దానిని గూడ యనల స్తంభ వృత్తాంతమునుగూర్చి యడిగి తెలిసికొని తాను శిరోభాగంబును గాంచలేనని భావించి - చూచి వచ్చినటుల చెప్పుట కా రెంటిని సాక్ష్యముగా గ్రహించి యథా స్థాన మున కరుదెంచెను.

విష్ణువు తా నధోభాగమును గాంచలేదని యథార్థమును జెప్పెను. కాని కమలాసనుడు తా నూర్ధ్వభాగమును జూచివచ్చినట్లు యా యిరువురిచే సాక్ష్యము నిప్పించెను. కేతకీ పుష్పము, బ్రహ్మ చూచినటుల యసత్యమునే చెప్పగా కామధేనువు ముఖముతో చూచి నటుల యసత్యమును జెప్పి తోకతో జూడలేదని సత్యము చెప్పెను.

ఆ సమయంబున నా యగ్నిస్తంభమునుండి మహాదేవుడు ప్రాదుర్భవించి - సత్యమును జెప్పిన శ్రీ మహావిష్ణువు ననుగ్రహించి

యింతటినుండి నీ మూర్తులను బ్రతిష్ఠించి జనులందఱును బూజించుచుండెదరు గాత యని వరం బొసంగెను.

మహాదేవు డంత బ్రహ్మ గర్వభంజనము కొఱకు దన భ్రూమధ్యంబునుండి భైరవుని సృజించగా నాతండు తండ్రి యాజ్ఞగొని యసత్యము పల్కిన విధాత పంచమ శిరస్సును ఖండించి వేసెను. అప్పటినుండి బ్రహ్మ చతుర్ముఖుం డయ్యెను. మహాదేవుడు బ్రహ్మను జూచి నీ కీభువన మధ్యంబున బూజా మహోత్సవంబులు లేకుండుగాక యని శపించెను. కేతకీ పుష్పమునుజూచి శివపూజకు నీ కర్హత లేకుండు గాక యని శపించెను. కామధేనువును గాంచి నీ ముఖమును జూచిన పాపంబును-సత్యము చెప్పిన పృష్ఠభాగమును గాంచ పుణ్యంబును గలుగుగాత యని వరంబొసంగెను. తన యపరాధంబును క్షమింప వేడుకొనిన బ్రహ్మనుజూచి యనుగ్రహదృష్టితో నిటుల బల్కెను. "ఓ విధాతా నీ వింతటినుండి యగ్నిహోత్రాది కార్యంబులకును - స్మృత్యుక్త కార్యంబులకును -యజ్ఞంబులకును గురుండ వయ్యెదవు గాక" యని వరంబొసంగెను.

అంత కమలాక్షుండును - కమలాసనుండును మహాదేవుని నుత్తమ సింహాసనాసీనుం గాంచి భక్తిశ్రద్ధలతో ననేక విధముల బూజించిరి. మహాదేవు డత్యంత ప్రీతుండై వారలజూచి యిట్లనెను. "ఓ వత్సలారా! మీ పూజనుగాంచి తృప్తుండనైతిని. ఈ పవిత్ర దినము చిరకాలంబువఱకు శ్రేష్ఠతమ దివసంబుగా నాదరింపబడు గాక. మత్ప్రియకరంబగు యీ శుభ తిథి శివరాత్రి నామంబున జగంబున బ్రఖ్యాతంబగు గాక. ఎవ్వడీ దివ్యదివసంబున నన్ను బూజించునో - యొక వత్సరంబు నిరంతరంబు నన్ను బూజించినవానికి గల్గు ఫలంబు నిశ్చయముగ గల్గును." అని యీ విధముగ జెప్పి మహాదేవు డంతర్హితుం డయ్యెను.

అప్పటినుండియు పరశివుండు లింగరూపంబున సర్వజనులచే బూజింపబడుచున్నాడు. శివరాత్రిరోజున పుణ్యప్రదేశముల సందర్శించుటకై వేలమంది వివిధ ప్రాంతములకు జనుచుందురు. మన యాంధ్రప్రదేశములో శ్రీశైలము చాల ప్రసిద్ధివడసి యున్నది. "శ్రీశైల శిఖరందృష్ట్వా పునర్జన్మన విద్యతే" యని శిఖర దర్శనమాత్రముననే సర్వపాపములు హరించుటయే గాక శ్రీశైలము ముక్తిప్రదమని క్షేత్రమాహాత్మ్యము దెల్పుచున్నది.

శ్రీశైలము వెళ్ళుటకు మార్కాపురమునుండి బస్సు లేర్పాటు చేయబడినవి. ముఖ్యమంత్రివర్యులగు శ్రీ సంజీవరెడ్డిగారును-నిజలింగప్ప గారును బూనుకొని తగు సౌకర్యముల నట నేర్పాటు చేయించిరి. కాన శైవు లందఱు భ్రమరాంబా సమేత మల్లిఖార్జునస్వామిని సందర్శించి భక్తిముక్తులు పడయుదురు గాత. శ్రీశైలమందున నుత్తర గోపురద్వారంబున నుండెడి శ్రీపతి పండితారాధ్య పీఠమును బునరుద్ధరించి శైవులకు దగిన వసతులు గలిగించుదురు గాత!

---

## శ్రీ శైవమహాపీఠ విరాళములు

| | |
|---|---|
| నిల్వ | 15-8-0 |
| బొల్లం గౌరయ్యగారు | 1-0-0 |
| బవిరిశెట్టి లింగమూర్తిగారు | 6-0-0 |
| నిల్వ 31-1-58 వరకు | 22-8-0 |

★

# నిత్య పితృతర్పణం

| | |
|---|---|
| ఆచమ్య<br>ప్రాణానాయమ్య | ఆచమనము – ప్రాణాయామము<br>చేసి |

సంకల్పః

ఏవంగుణ విశిష్టేశుభే౽భ్యుదయ ముహూర్తే శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం అస్మత్పితౄనుద్దిశ్య అస్మత్పితృ ప్రీత్యర్థం అస్మత్పితృతర్పణం కరిష్యే॥

| | |
|---|---|
| ఇతి సంకల్ప్య<br>త్రిస్తర్పయేత్ | అని సంకల్పముచేసి పురుషులకు ముమ్మారును, స్త్రీలకు నొక్కొక్క తర్పణము చేయవలయు. |

౧. అస్మత్ పితరం...గోత్రం...శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమస్తర్పయామి॥

౨. అస్మత్ పితామహం...గోత్రం...శర్మాణం సదాశివ రూపం స్వధానమస్తర్పయామి॥

3. అస్మత్ ప్రపితామహం...గోత్రం...శర్మాణం శివరూపం స్వధానమస్తర్పయామి॥

౪. అస్మత్ మాతరం...గోత్రాం...దేవీం మహేశ్వరరూపాం స్వధానమస్తర్పయామి॥

౫. అస్మత్ పితామహీం...గోత్రం...దేవీం సదాశివరూపాం స్వధానమస్తర్పయామి॥

౬. అస్మత్ ప్రపితామహీం...గోత్రాం...దేవీం శివరూపాం స్వధానమస్తర్పయామి॥

౭. అస్మత్ సాపత్నీమాతరం...గోత్రాం...దేవీం మహేశ్వరరూపాం స్వధానమస్తర్పయామి॥

మాతామహాది తర్పణం

౮. అస్మత్ మాతామహం...గోత్రం...శర్మాణం మహేశ్వరరూపం స్వధా నమ స్తర్పయామి॥

౯. అస్మత్ మాతుః పితామహం...గోత్రం... శర్మాణం సదాశివరూపం స్వధా నమ స్తర్పయామి॥

౧౦. అస్మత్ మాతుః ప్రపితామహం...గోత్రం...శర్మాణం స్వధా నమ స్తర్పయామి॥

మాతామహ్యాది తర్పణం

౧౧. అస్మత్ మాతామహీం...గోత్రాం... దేవీం మహేశ్వర రూపాం స్వధా నమ స్తర్పయామి॥

౧౨. అస్మత్ మాతుః పితామహీం...గోత్రాం... దేవీం సదాశివరూపాం స్వధానమ స్తర్పయామి॥

౧౩. అస్మత్ మాతుః ప్రపితామహీం...గోత్రాం... దేవీం శివరూపాం స్వధా నమ స్తర్పయామి॥

| అనంతరం కారుణ్య తర్పణం కుర్యాత్ | తరువాత కారుణ్య తర్పణము చేయవలయును. |
|---|---|

౧. అస్మత్ ఆత్మపత్నీం ... గోత్రాం ... దేవీం మహేశ్వర రూపాం స్వధా నమ స్తర్పయామి॥

౨. అస్మత్ సుతం...గోత్రం...శర్మాణం మహేశ్వరరూపం స్వధా నమ స్తర్పయామి॥

౩. అస్మత్ భ్రాతరం ... గోత్రం ... శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమ స్తర్పయామి॥

౪. అస్మత్ పితృవ్యం ... గోత్రం ... శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమ స్తర్పయామి॥

౫. అస్మత్ మాతులం....గోత్రం....శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమ_స్తర్పయామి॥

౬. అస్మత్ దుహితరం ... గోత్రాం ... దేవీం మహేశ్వర రూపాం స్వధా నమ_స్తర్పయామి॥

౭. అస్మత్ భగినీం...గోత్రాం...దేవీం మహేశ్వర రూపాం స్వధా నమ_స్తర్పయామి॥

౮. అస్మత్ దౌహిత్రం...గోత్రం...శర్మాణం మహేశ్వర రూపం స్వధానమ_స్తర్పయామి॥

౯. అస్మత్ భాగినేయకం...గోత్రం...శర్మాణం మహేశ్వర రూపం స్వధానమ_స్తర్పయామి।

౧౦. అస్మత్ పితృష్వసారం...గోత్రాం...దేవీం మహేశ్వర రూపాం స్వదానమ_స్తర్పయామి॥

౧౧. అస్మత్ మాతృష్వసారం...గోత్రాం....దేవీం మహేశ్వరరూపాం స్వధానమ_స్తర్పయామి॥

౧౨. అస్మత్ జామాతరం...గోత్రం...శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమ_స్తర్పయామి॥

౧౩. అస్మత్ భావుకం ... గోత్రం ... శర్మాణం మహేశ్వర రూపం స్వధానమ_స్తర్పయామి॥

౧౪. అస్మత్ స్నుషాం...గోత్రాం...దేవీం మహేశ్వరరూపాం స్వధా నమ స్తర్పయామి॥

౧౫. అస్మత్ శ్వశురం ... గోత్రం ... శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమ_స్తర్పయామి॥

౧౬. అస్మత్ శ్వశ్రూం... గోత్రాం ... దేవీం మహేశ్వర రూపాం స్వధానమ స్తర్పయామి॥

౧౭. అస్మత్ స్యాలకం...గోత్రం...శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమ స్తర్పయామి॥

౧౮. అస్మత్ స్వామినం తర్పయామి॥

౧౯. అస్మత్ గురుం ... గోత్రం ... శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమ స్తర్పయామి॥

౨౦. అస్మత్ రిక్థినం...గోత్రం...శర్మాణం మహేశ్వరరూపం స్వధానమ స్తర్పయామి॥

శ్లో॥ యేకే చాస్మత్కులే జాతా అపుత్రాగోత్రిణోమృతాః।
తే గృహ్ణన్తుమయాదత్తం సూత్రనిష్పీడ నోదకం॥

| | |
|---|---|
| అనేన సూత్రనిష్పీడ నోదకం దద్యాత్ | ఈ శ్లోకము చదువుచు యజ్ఞోపవీతము తడిపి పిండిన యుదకము విడువవలయును. |



# శాంభవవ్రతము

ముదిగొండ రామలింగశాస్త్రిగారు (ఈమని)

శిష్యుడు : ఈ శాంభవ వ్రతము (లింగధారణదీక్ష) స్త్రీలు గూడా గ్రహింపవలయునా ?

గురువు : ఈ వ్రతమును స్త్రీలును తప్పక గ్రహింపవలయును.

శిష్యుడు : ఈ వ్రతమును స్త్రీలు వివాహముకంటె ముందు గ్రహింప వలయునా ? లేక తరువాత గ్రహింపవలయునా ?

గురువు : స్త్రీ లీ వ్రతమును వివాహమైన తరువాతనే గ్రహింప వల యును. కావున నే, "సూ॥ స్త్రీణా ముపనయన స్థానే వివాహః॥" పురుషుల కుపనయనమున జరుగు కొన్ని సంస్కారములు స్త్రీలక వివాహమునందు జరుగు చుండు నుగాన ఉపనయనమునకు బదు

౫. అస్మత్ మాతులం....గోత్రం....శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమస్తర్పయామి॥

౬. అస్మత్ దుహితరం ... గోత్రాం ... దేవీం మహేశ్వర రూపాం స్వధా నమస్తర్పయామి॥

౭. అస్మత్ భగినీం...గోత్రాం...దేవీం మహేశ్వర రూపాం స్వధా నమస్తర్పయామి॥

౮. అస్మత్ దౌహిత్రం...గోత్రం...శర్మాణం మహేశ్వర రూపం స్వధానమస్తర్పయామి॥

౯. అస్మత్ భాగినేయకం.. గోత్రం...శర్మాణం మహేశ్వర రూపం స్వధానమస్తర్పయామి।

౧౦. అస్మత్ పితృష్వసారం...గోత్రాం...దేవీం మహేశ్వర రూపాం స్వదానమస్తర్పయామి॥

౧౧. అస్మత్ మాతృష్వసారం...గోత్రాం....దేవీం మహేశ్వరరూపాం స్వధానమస్తర్పయామి॥

౧౨. అస్మత్ జామాతరం...గోత్రం...శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమస్తర్పయామి॥

౧౩. అస్మత్ భావుకం ... గోత్రం ... శర్మాణం మహేశ్వర రూపం స్వధానమస్తర్పయామి॥

౧౪. అస్మత్ స్నుసాం...గోత్రాం...దేవీం మహేశ్వరరూపాం స్వధా నమస్తర్పయామి॥

౧౫. అస్మత్ శ్వశురం ... గోత్రం ... శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమస్తర్పయామి॥

౧౬. అస్మత్ శ్వశ్రూం... గోత్రాం ... దేవీం మహేశ్వర రూపాం స్వధానమ స్తర్పయామి॥

౧౭. అస్మత్ స్యాలకం...గోత్రం...శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమ స్తర్పయామి॥

౧౮. అస్మత్ స్వామినం తర్పయామి॥

౧౯. అస్మత్ గురుం ... గోత్రం ... శర్మాణం మహేశ్వర రూపం స్వధా నమ స్తర్పయామి॥

౨౦. అస్మత్ రిక్థినం...గోత్రం...శర్మాణం మహేశ్వరరూపం స్వధానమ స్తర్పయామి॥

శ్లో॥ యేకే చాస్మత్కులే జాతా అపుత్రాగోత్రిణోమృతాః।
తే గృహ్ణన్తుమయాదత్తం సూత్రనిష్పీడ నోదకం॥

| | |
|---|---|
| అనేన సూత్రనిష్పీడ నోదకం దద్యాత్ | ఈ శ్లోకము చదువుచు యజ్ఞోపవీతము తడిపి పిండిన యుదకము విడువవలయును. |



# శాంభవవ్రతము

ముదిగొండ రామలింగశాస్త్రిగారు (ఈమని)

శిష్యుడు : ఈ శాంభవ వ్రతము (లింగధారణదీక్ష) స్త్రీలు గూడా గ్రహింపవలయునా?

గురువు : ఈ వ్రతమును స్త్రీలును తప్పక గ్రహింపవలయును.

శిష్యుడు : ఈ వ్రతమును స్త్రీలు వివాహముకంటె ముందు గ్రహింపవలయునా? లేక తరువాత గ్రహింపవలయునా?

గురువు : స్త్రీ లీ వ్రతమును వివాహమైన తరువాతనే గ్రహింపవలయును. కావుననే, "సూ॥ స్త్రీణా ముపనయన స్థానే వివాహః॥" పురుషుల కుపనయనమున జరుగు కొన్ని సంస్కారములు స్త్రీలకు వివాహమునందు జరుగు చుండునుగాన ఉపనయనమునకు బదు

లుగా స్త్రీలకు వివాహసంస్కారము విధింపబడియె నని కల్ప సూత్రకారులు వచించియున్నారు. పురుషులు ఉపనయనానంతరం యీ వ్రతమును గ్రహించినటుల స్త్రీలు వివాహానంతరం యీ దీక్షను తప్పక గ్రహింపవలయును.

శిష్యుడు : ఈ వ్రతమును స్త్రీ వివాహానంతరం గ్రహించినచో భర్త వలన గ్రహింపవలయునా ? ఇతరుల వలన గ్రహింపవలయునా ?

గురువు : బ్రాహ్మణ స్త్రీలు భర్తవలన దీక్షనొందుటయే యుక్తము. వీలుగానిచో నితరుల వలనను దీక్ష గ్రహింపవచ్చును. బ్రాహ్మణే తరులకు ఉపదేశాధి కారము లేదు గాన అబ్రాహ్మణ స్త్రీలు భర్త వలన దీక్షను గ్రహింప గూడదు.

శిష్యుడు : ఈ వ్రతమును స్త్రీ భర్త వలననే గ్రహించినచో భర్తయే గురువయ్యెగదా ! గురువే తండ్రియని వ్యవహారముగలదు గాన అప్పురుషున కీమె పత్నియై యెట్లు వ్యవహరించును ?

గురువు : తన భర్తవలన దీక్ష గ్రహించినప్పుడు స్త్రీకి బాధకము లేదు. గురువే తండ్రియనుట ఔపచారికముగాని ముఖ్యముగాదు. లోకమున భర్తయే తల్లియు – తండ్రియు – దేవుడు నని ప్రశం సింపబడును. అంత మాత్రమున భార్యా భర్తలకుగల సంబంధము బాధింపబడదు.

శిష్యుడు : స్త్రీ యితరుని వలన నీ వ్రతమును గ్రహించినచో నామె భర్త వాక్యమున నుండవలయునా ? గురుని వాక్యమున నుండ వలయునా ?

గురువు : భర్త యొక్క గురునియందు భార్యయు – భార్యయొక్క గురునియందు భర్తయు గురు భావమునే యుంచవలయును. లేనిచో పతితులగుదురు. కాబట్టి భార్య గురు వితరుడై నప్పుడు ఆమె భర్త వాక్యము వినవలయునా ? లేక గురు వాక్యము విన

వలయునా? అను శంక పరిహరింప బడినది. ఏలయనగా భార్య యొక్క గురునాజ్ఞ భర్తయు పాలింపవలయును గాన నిందు బాధకము లేదుగదా!

శిష్యుడు : స్త్రీకి సంకల్పాధికారమే లేదంట్రు గదా? ఈ దీక్షయం దధికార మెట్లుండును?

గురువు : స్వర్గప్రాప్తి సాధనములగు కర్మము లాచరించుటకై స్త్రీలకు సంకల్పాధికారము లేదుగాని మోక్ష విషయమై యధికారము గలదు గాన దానిని నిరోధింప వలను పడదు. కాన నీ వ్రత విషయమై సంకల్పాధికారము తప్పక యుండును.

శిష్యుడు : స్త్రీలకు భర్తయే దైవత మగుగదా? అట్లైన స్త్రీకి దేవతోపాసన యెట్లు యుక్త మగును?

గురువు : "శ్రు॥ పితృదేవోభవ - ఆచార్య దేవోభవ" తండ్రియే దైవముగా గల వాడ వగుము. ఆచార్యుడే దైవముగా గలవాడ వగుము. అను శ్రుతి వాక్యములు తండ్రియందు నాచార్యునందును దేవభావ ముంచు మని విధించునవియే గాని యింతకన్న వేరే దైవము లేదని నిషేధింపనేరవు. అట్లే భర్తయే దైవమని చెప్పువాక్యములును భర్తయందు దేవభావము నుంచుమని బోధించునేగాని వేరేదైవము లేదని నిషేధింపజాలవు. కావున పురుషులకువలె స్త్రీలకు నీశ్వరోపాసన నిషిద్ధముకాదు. భర్తృభార్యా సంబంధము కల్పితముగాని నిత్యముకానేరదు. స్త్రీత్వపుంస్త్వాదికంబును ఈ జన్మమున గలిగినదే. జీవుడు స్త్రీగాని పురుషుడుగాని నపుంసకుడుగాని కాడు. తాను ధరించిన శరీరమును బట్టి స్త్రీ యనియు పురుషుడనియు మొదలుగా వ్యవహరింపబడు చున్నాడు. కావున స్త్రీత్వ మీ జన్మమున వచ్చినదే. ఇందును భార్యాత్వము నడుమ కల్పితమైనది. ఇట్టి రెండును స్త్రీ యొక్క మోక్షమార్గము నెట్లు నిరోధించును? నిరోధింపజాలవు. స్త్రీ తన

భర్తను దేవునిగా భావించినను గురునిగా సేవించినను — సంసార మహారణ్యమున తిరుగుచు దుఃఖసముద్రమున మునుంగుచు నిట్లు తాను తరింపనేరని మూర్ఖుడగు భర్త — శివోపాసనచే నట్టి భార్య నెట్లు తరింపజేయును ? తరింప జేయజాలడు గదా ! కాబట్టి స్త్రీ లీ వ్రతము నవశ్యముగా ననుష్ఠింపవలయును.

శిష్యుడు : దీక్షా సంస్కారముచేసి కాంత తన భర్తకు పరిచర్య చేయవచ్చునా ?

గురువు : దీక్షా సంస్కారములేని కాంత తన భర్తకు పరిచర్య చేయ నర్హురాలుకాదు. అదియును గాక దీక్షా సంస్కారములేని కాంత చేయు పాకము శివలింగమునకు నివేదింప నర్హముగాదు. అట్టి కాంత స్పృశించిన జలము శివలింగమునకు నభిషేకము చేయుట మొదలగు పనులకును యోగ్యముకాదు. కాన స్త్రీలకును తప్పక దీక్ష యొసంగ వలయును.

శిష్యుడు : స్త్రీకి దీక్షయం దధికారమున్నను ఎడతెగని గృహ కృత్యములతో నెంతమాత్రము విశ్రాంతి లేనిదగు భర్తగల కామినికి జ్ఞానవిషయమున కవకాశ మెట్లు దొరకును ? వనిత లింగ నిష్ఠా పరురాలై యుండునెడ అత్తమామల సేవించు టెట్లు ? భర్తను గౌరవించు టెట్లు ? పుత్రాదుల పోషించు టెట్లు ?

గురువు : దీక్షా సంస్కారముగల కాంత లింగనిష్ఠకు బాధకము లేకుండా గృహ కృత్యములను చేసికొనుచుండవలయును. వనిత భర్తకు నుపచారముచేయుచున్నను — అత్తమామల పోషించుచున్నను — పుత్రాదుల పాలించుచున్నను — లింగనిష్ఠను మరువ కూడదు. లోకమున శిశువుగల కాంత గృహకృత్యముల జేసికొనుచున్నను నామె చిత్తము శిశువునంద యుండునట్లు దీక్షితురాలి చిత్తంబును సర్వావస్థలయందు నీశ్వరాయత్తమైయుండ వలయును. కావున గృహ కృత్యములు శివోపాసనను బాధింప

నేరవు. దీక్షనొందిన కాంతకు నొకవేళ లింగనిష్ఠాదులు సంభవింప కున్నను లింగనిష్ఠగల భర్తను సేవించుటవలన నా కాంత భర్తతో గూడ శివసాయుజ్యమును పొందగలదు.

శిష్యుడు: రజస్సుచేతను - ప్రసవాదులచేతను నపవిత్రురాలగుకాంత లింగస్పర్శను - లింగపూజను ఎట్లు చేయనగును ?

గురువు: సంసారధర్మమున నున్న స్త్రీలు అవసరార్చనమునే చేయ వలయును. పూజాదులయందు తాంత్రిక మంత్రముల నుపయో గించు కొనవలయును గాని వైదిక మంత్రముల నుపయోగింప గూడదు. స్త్రీలు దీక్షచే పవిత్రమగు శరీరము గలవారు గాన లింగస్పర్శము వారలకు దోషప్రదము కానేరదు. కావున దీక్ష నొందిన స్త్రీలకు రజోదర్శనాది సమయముల యందును పూజ విషిద్ధము కాదు. ప్రసవాదులయందు పూజాభంగము సంభవించి నను దోషములేదు.

శిష్యుడు: స్త్రీలకు వైదికదీక్ష యొసగవలయునా? లేక తాంత్రిక దీక్షయొసగవలయునా ? వైదికదీక్ష యొసగబడునెడ వారు పూజా ర్థమై తాంత్రిక మంత్రముల నేల వాడుకొనవలయును? అట్లుగాక స్త్రీలకు తాంత్రికదీక్షయే యియ్యవలయు నందురేని భర్తకు వైదికదీక్షయు, భార్యకు తాంత్రికదీక్షయు సంభవించును గాన దంపతులకు దీక్షాభేదము సంభవించును. పరస్పరము దీక్షాభేదము గల దంపతులకు సర్వకృత్యముల యందు సాంగత్య మెట్లు సంభ వించును ? ఈ సంశయము నివారింపుడు.

గురువు: ద్విజస్త్రీల కీ రెండు దీక్షలలో నేదైన యుక్తమే యగును. తాంత్రికదీక్ష స్వాతంత్ర్యముతో గ్రహించుటకు స్త్రీల కధికారము గలదు. వైదికదీక్ష నైనచో పురుషుడు గ్రహించునపుడు గ్రహింప వలయును. కాబట్టి వైదిక దీక్షయందు పారతంత్ర్యమే గాని స్త్రీ లకు స్వాతంత్ర్యము లేదు. ఇక దంపతులకు గల దీక్షాభేదము

సత్స్వకర్మ సాంగత్యమును బాధించునది కానేరదు. ఏలన స్త్రీ పురుషులకు గల యధికార భేదమునుబట్టి యితర ధర్మములు భేదించునట్లు దీక్షాభేదంబును ప్రాప్తించును.

శిష్యుడు : లింగధారులకు జాతాశౌచ మృతాశౌచములు గలవా ? ఉన్నచో శివపూజ నాచరించు టెట్లు ?

గురువు : నిర్ణయసింధు-మున్నగు ధర్మశాస్త్రములందు శ్లో॥ "జాత కే మృత కేచైవ నత్యాజ్యం శివపూజనం" అని యున్నందున శివ పూజ నిత్యవిధియనియు, జాతాశౌచ మృతాశేషములయందును శివపూజను వదిలిపెట్టగూడదనియు స్పష్టముగా గలదు. దీనివలన జాతా శౌచ మృతా శౌచములు లింగధారులకున్ను గలవనికూడ యీపై శ్లోకమే నిరూపించుచున్నది.

ఈపై విషయములు కారణోత్తరమందును, ధర్మశాస్త్రముల యందును నిరూపింపబడినవి.

---

శ్రీ శివాభ్యాం నమః

## శ్రీ ఆచార్య ప్రకాశవః

( ఒక భక్తుడు )

శ్లో॥ షడ్భిరంగై రుపేతాయ । వివిధై రవ్యయై రపి
శాశ్వతాయ నమస్కుర్మో । వేదాయచ భవాయ చ॥

వీరమహేశ్వర మహాశయులారా !

న గురో రధికం । న గురో రధికం ।
న గురో రధికం । న గురో రధికం ।

శివశాసనతః । శివశాసనతః ।

శివశాసనతః । శివశాసనతః ॥

ఈ యార్యోక్తి శ్రీ గురునికంటె నధికమైన తత్త్వము లేదని చెప్పును. "గురుం ప్రకాశయేత్ ధీమాన్" అను అభియుక్త వచనము సచ్ఛిష్యుడగు వాడు గురువును చక్కగా వెల్లడింపవలెనని చెప్పును. అనగా అతని కీర్తిని లోకమున ప్రఖ్యాపనచేసి పదుగురికిని అతనియెడ నద్వేషాఽభిముఖ్యముల గలిగింపవలెననుట ప్రకృతము. మన వీరశైవాచార్యులలో నత్యంతమును మనకు సన్నికృష్టులును, మహాత్మ్యశ్రేష్టులును అయిన భూతపూర్వయోగి శ్రీనాగలింగ శివారాధ్యుల వారిని గురించి యొకింత నీ దిగువ స్మరింపబడుచున్నది.

శ్రీ శివారాధ్యులవారు మనకు కాలతః, దేశతః, జాతితః, వ్యక్తితఃగూడ సన్నికృష్టులై యున్నారు గదా! శ్లో॥ యే రుద్రలోకాదవతీర్య రుద్రా । మానుష్య మాశ్రిత్య జగద్ధితాయ । చరంతి నానావిధ చారుచేష్టా, స్తేభ్యో నమ స్త్ర్యంబకపూజకేభ్యః॥ అని చెప్పబడిన రీత్యా వీరు కేవలము లోకసంగ్రహామునకై శ్రీ శివాజ్ఞయా భూమిపై నవతరించిన ముక్తపురుషులనుట సమంజసము. మన ప్రాచీనాచార్యులగు సిద్ధత్రయ, ఆరాధ్యత్రయ, పండితత్రయ, ఆచార్యత్రయములవలె వీరును ఇటీవల మన శివాద్వైత సిద్ధాంత ప్రచారమునకై కడుంగడు కృషి సల్పియుండిరి గదా! శతాధిక గ్రంథములను రచించి, తమ అధీతిబోధాఽఽచరణ ప్రచారణములవలన వీరు అన్వర్థమైన యాచార్యత్వమును నిర్వహించిరనుటలో నావంతయేని యతిశయోక్తి లేదనుట మన మాహేశ్వర బృందమునకేగాక, విమతస్థులగు స్మార్తులకును, వైష్ణవాదులకునుగూడ సువిదిత విషయమే.

శ్రీ శివారాధ్యుల యవతారము "యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి అభ్యుత్థాన మధర్మస్య చ" అని చెప్పబడిన ప్రకారము అత్యంతావశ్యకమైన తరుణముననే ఘటిల్లినది. ఏలయన – పండిత

త్రయానంతరము మన శ్రౌత వీరశైవ సిద్ధాంత ప్రచారము చాల వరకు తగ్గిపోయియుండెను. శ్రీమల్లికార్జున పండితారాధ్యులవారు క్రీ. శ. 12 వ శతాబ్దమున అద్భుతమైన శ్రౌతశైవ ప్రచారమును గావించి యుండిరి. వీరికి పిమ్మట దాక్షిణాత్యులైన శ్రీమదప్పయ దీక్షితకాలమువరకును మన శివాద్వైత ప్రచారము విరళమాయెను.

శ్రీ దీక్షితేంద్రులు 16 వ శతాబ్దమున నవతరించి క్రీ. శ. 1585 – 1614 వరకును శ్రీశివాఽద్వైత ప్రచారమును నిరవగ్రహై శ్వర్యముతో సాగించిరని ఐతిహ్యము తెలుపుచున్నది. "వైకుంఠే శుంఠకోలాహలమయ కలహోల్లుంఠనే కంఠశక్తి । శ్రీ కంఠాచార్య కంఠోది తనయ సరణివ్యాకృతౌ కుంఠితో౽సి" అనెడి శ్రీఅహోబల పండితా చార్య సూక్తివలన ఈ దీక్షితేంద్రులు శ్రీ మన్నీలకంఠ మత ప్రచారము నెంతటి సాహసముతో సాగించినదియు విదిత మగును. ఈ మహానుభావుడు శ్రీకంఠభాష్య వ్యాఖ్యానమైన శివార్కమణి దీపికను రచించినపుడు, చోళప్రభువులవలన కనకాభిషేకమును బడసెనట. "అప్పయ్య దీక్షితమణే రసవర్య విద్యాకల్ప ద్రుమస్యకురుతే కనకాల వాలమ్" అనెడి శ్రీ పరమపుంగవ యజ్వవచనము వలన తెలియును. నీలకంఠ సంప్రదాయ ప్రఖ్యాపనకై శ్రీ దీక్షితులవారు శివతత్త్వ వివేకము, రత్నత్రయపరీక్ష, శివకర్ణామృతము, బ్రహ్మతర్కస్తవము, మున్నగు ముప్పదిమూడు గ్రంథములను రచించిరట. కాని వీరు స్మార్తశైవులై యుండినందున మన వీరశైవ ప్రమేయములగు లింగ ధారణాదులను గురించియు, నిర్విశేషాఽత్యంత ప్రతి యోగిత్వేన కేవల సవిశేష బ్రహ్మతత్త్వమును గురించియు ప్రబోధింపరైరి. వీరు ప్రతిపాదించిన శివాఽద్వైతము అను భవాఽద్వైత పర్యవసాయిగా యుండెను. ఇదే "సత్యపిభేదాఽపగమే నాథ తవాహం న మామకీ నస్త్వమ్" అని శ్రీశంకరాచార్యులు నిరూపించిన స్మార్త విశిష్టాఽ ద్వైతము. శివార్కమణి దీపికాయుతమైన నీలకంఠభాష్యమునే మన

వీరశైవ సమాజము పఠించుచూ, ఇదియే సాంప్రదాయిక శివాఽద్వైతమని విశ్వసించుచుండిరి. మనలో కొందరు ప్రభులింగలీలాది గ్రంథముల ననుసరించి కేవల శివాఽద్వైత పరులైరి. కావ్య నాటకాలంకార సాహిత్యపండితులును, ఆగమ కలాపజ్ఞులును, పౌరాణికులును మనలో ఏర్పడి యుండినను, మన సంప్రదాయవిజ్ఞానానుష్ఠానాది అనూచానత లోపించి అభాసులై యుండిరి. మన సంప్రదాయ శివాఽద్వైతమేదో మనకు తెలియదాయెను. మనది భేదవాదమో, అభేదవాదమో, భేదాఽభేద వాదమో, భేదాఽభేదకల్పమైన విశిష్ట సిద్ధాంతమో, ఏతత్సమ్యగ్దర్శన విషయకాఽ నవబోధమునకు గురియై యుంటిమి. వైంగదీక్షాశీలములు మనయందు మృగ్యములుకాసాగెను. శాంభవ వర్ణాశ్రమ ధర్మవిధానములు, ఔర్ధ్వదైహిక కల్పమును విపర్యస్తము లగుచుండెను. ఏతాదృశకృపణస్థితిలో మన సమాజము పతితమైయుండ, కరుణాకరుండగు శంకరుడు అస్మత్పూర్వ మాహేశ్వర లోకసంగ్రహామునకై యోగిశ్రీ శివారాధ్యులవారిని అవతరింపజేసెను. కనుక కేవలము ఆవశ్యకమైన తరుణమునవే వీరి యవతారము ఘటిల్లినదని పైన సూచింప బడినది.

శ్రీవారు శ్రీమద్వీరేశ్వరారాధ్య కళ్యాణగురువులను సేవించి, శ్రౌతవీరశైవ దీక్షాదికమును బడసిరి. పిమ్మట దాక్షిణాత్యులగు నిరుక్త శ్రీమదప్పయ శివదీక్షితుల ప్రప్రపౌత్రులగు శ్రీ శ్రీనివాస శివదీక్షితుల వలన వేదాంత విద్య నభ్యసించి, సుశిక్షితులై శివాఽద్వైత విద్యారహస్యములను గ్రహించిరి. ఒకనాడు శ్రీ గురువులు వీరి నిట్లుద్బోధించిరట – వత్సా! మీ సంప్రదాయ వేదాంత భాష్యము మీలో చాలమందికి ప్రస్తుతము విస్మృతమైనది. శాంకర భాష్యమని పలువురు తలంచుచున్నారు. కాని మీది నీలకంఠభాష్యము సుడీ! ఏతత్సంబంధి వాఙ్మయము శ్రీ దీక్షితేంద్రుల కాలమునుండియు మా వంశములందు ప్రగుప్తమై యున్నది. దీని నంతను మీకు సమర్పించు

చున్నాను. దీని యాధారముచే మీరు మీ స్వసంప్రదాయమును ఉచితవిధమున ప్రబోధించుకొనుడు అని సెలవిచ్చి, ఆ వాఙ్మయ మును మన శ్రీ శివయోగులకు అందించిరట.

శివాఽద్వైత విజ్ఞాన భాండారమును శ్రీగురువులవలన నందు కొని, మన శ్రీ శివారాధ్యులు పరమేష్ఠి గురువులనదగిన శ్రీమదప్పయ శివదీక్షితులతో సర్వవిధములను తుల్యులైరి. శ్రీ దీక్షితుల స్మార్త శివ విశిష్టాఽద్వైతమును సంస్కరించి కేవల సవిశేషశివాఽద్వైత మును ప్రాచీన వీరశైవ దృక్పథము ననుసరించి వ్యవస్థాపనచేసిరి. "అద్వైత మాగమ శిరోభి రుపాసనాయా। ముక్తం తదేవ పర మార్థతయా న వాచ్యం। భేద స్ఫుటో గరుడ మాంత్రికయోః కిమైక్యం। తాదాత్మ్యభావన మథాపి విషం ప్రమార్ష్టి॥" అని శ్రీసుద ర్శనాచార్యులవారు తాత్పర్య సంగ్రహమున సెలవిచ్చిన రీత్యానే మన శ్రీ శివయోగులు విశిష్టాఽద్వైతము ననుసంధించిరి. ఏతద్వి లక్షణాఽను సంధానానుసారము శివార్కమణిదీపికను యథాతథ ముగ సంస్కరించి శ్రీ శివచింతామణిప్రభ యను నేడి నామకరణముతో వెలయించిరి. ఈ విషయము శ్రీ శివయోగులు స్వయముగనే ఇట్లు సెలవిచ్చిరి. "యద్యప్యప్పయదీక్షితై ర్విరచితా సంలభ్యతే దీపికా। పృథ్వీభాతి తథాపితైర్హి విమతై ర్వ్యత్యాసితం భూరిశః॥" "తదుక్తి సారం సంగృహ్ణా త త్త్యక్తం పూరయన్నపి। సంక్షేపా దేవ వచ్మ్యత్ర విస్తరోఽన్యత్ర దృశ్యతామ్॥" అని.

సర్వవిధములను శ్రీ శివారాధ్యులవారు శ్రీమదప్పయదీక్షిత సదృశులే. శ్రీ దీక్షిత సార్వభౌములవలెనే వీరును శతాధిక గ్రంథ ముల రచియించి, సంప్రదాయ పరిపాలనమునకై అఖండకృషి సల్పి యుండిరి. శ్రీ దీక్షితేంద్రు లెంతటి శివనిష్ఠా ధురంధరులో, శివదర్శన స్థాపనకై విమతస్థులగు వీరవైష్ణవులతో మహోత్కంఠముగ నెట్లు వివరించి విజయముల గాంచియుండిరో, మఱియు పూర్వోత్తర

మీమాంసాది వైదిక విద్యాస్థానములందు విద్వన్మండలి నంతను జయించి, విశ్వజిద్యాగమును సైతమాచరించియుండిరో, అట్లే మన శ్రీ నాగలింగశివదీక్షితులుగూడ అసాధారణ శివనిష్ఠాపరులై, శివ మారి ప్రతిష్ఠాపనకై విమస్థు—లగు వైష్ణవులతో వివరించి విజయులై, బ్రహ్మాపథ తార—హాగాది వాదగ్రంథముల మూలమున దక్షిణోత్తర భారతము—లందలి మఖమందలిని చకితులంజేసి విశ్వజిద్యాజి—కల్పులై, సాక్షాత్పరశివకలావతార మహాపురుషులుగ విరాజిల్లిరి గదా !

అపిచ, అస్మదారాధ్యులవారు ఈ మధ్యకాలమున మతాంతర సంఘర్షణములచే విపరిలుప్తములైనట్టియు, దీర్ఘకాలగర్భమున వినష్టములైనట్టియు మన వీరశైవ సాంప్రదాయికాఽఽ చరణాంశములను బహుళతరకృషితో పునరుద్ధరించి, గ్రంథముఖమున నుద్ఘాటించియుండిరి. స్వపర సంప్రదాయ పండితులు కొందఱు వీరికి ప్రతిభటులై వితండవాదములతో మన వీరమాహేశ్వర వృద్ధ సంప్రదాయా చరణములయెడ విప్లవకారకు లగుచుండినను, తమ వీరమాహేశ్వర దీక్షను విడువక అనాద్యవిగీత శిష్టమాహేశ్వర పరంపరా ప్రాప్త సదాచారములను నానాగ్రంథ ముఖముగ వెలయించి యుండిరి. శ్రీ పాకయాజి పండిత స్వామ్యాదులగు స్వసంప్రదాయ విద్వాంసులే విమతులును, కుమతులునునై, విపర్యస్త విజ్ఞానాచరణములను ప్రబోధించుచుండ శాంభవ వర్ణాశ్రమ ధర్మ వివేకము, అంత్యేష్టి కల్పము, ఆరాధన పద్ధతి, ఆహ్నికపద్ధతి మొదలగు ఆచరణ గ్రంథములను వృద్ధ సంప్రదాయానుసారముగ ఉద్ఘాటనచేసిరి. మతచర్చ మొదలగు పలువిమర్శ గ్రంథములను వెలయించిరి. ఈ మతచర్చ నామక విమర్శ గ్రంథము నొక్కదానిని శ్రద్ధతో మనము పఠింపగలుగుదుమేని, మన శివాఽద్వైత విజ్ఞాన రహస్యములన్నియు 'శతాధిక గ్రంథభావమెల్ల తేట తెల్లంబుగ నొక్కమాటలోన' అనినట్లు కరతలామలకములు కాగల

వనుటలో నా వంతయును సందేహము లేదని శ్రీశివయోగులే నాతో స్వయముగ నొకనాటి సల్లాప మధ్యమున నానతిచ్చి యుండిరి. కర్ణాటక లింగాయతులు కొందఱు అదాంతులై 'బసవధ్వాంతదివాకర' మనెడి యసద్గ్రంథము నొకదానిని ఆవిష్కరించి, యనుచిత మార్గగాములై యుండ, మన శివయోగులు 'బసవవిభూషణ' మనెడి సద్గ్రంథము నావిష్కరించి, యవైదిక వీరశైవముయొక్క సామంజస్యమును సైతము అధికారిభేదము ననుసరించి నిరూపించి యుండిరి కదా యని, భక్తిమీఁది వలపుతో బ్రాహ్మ్యధర్మములను మానిన వారు గారు.

ఇట్టి మన శ్రీ నాగలింగ శివారాధ్యులవారిని మన వీరమాహేశ్వర సమాజము చక్కఁగా గుర్తించి, శ్రీవారి బ్రహ్మ పదాద్యాధ్యాత్మిక సారస్వతమును, మాహేశ్వర వర్ణాశ్రమ పద్ధతి, మాహేశ్వార ఆరాధన కుండము మొదలగు ఆచరణ గ్రంథములను, లెస్సగ సేవించి, ప్రచారించినగాని ప్రసుప్తమైయున్న మన సమాజమునకు సుప్రభాతము కానేరదు. ఈ శివయోగియొక్క సద్గ్రంథ ప్రబోధమువలనగాక మనలో నెవ్వారికేగాని, సాహిత్య పండితుల మగుదుము గాక, ఆగమజ్ఞుల మగుదుముగాక, పౌరాణికుల మగుదుముగాక, అహమపి పండితః అనెడి ఔద్ధత్యముతో స్వప్రతిభచే స్వతంత్ర రీతిని మత కృషిచేయువారమగుచో మనకు అనూచాన శిష్ట వీరమాహేశ్వర పరంపరాఽఽగతమైన విజ్ఞానాఽనుష్ఠాన వివేకము ఉదయింప నేరదనుట యతిశయోక్తి కాదు. శ్రీ చరణులయెడ నీకుటిలమైనభక్తి యుండినగాని మనకు శ్రీవారి గ్రంథములు యథావస్థితార్థముగ సమన్వయింపవు. "యస్యదేవే పరాభక్తిః, యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః" అను శ్రుతి వచనము శ్రీ గురుభక్తియొక్క యావశ్యకతను సద్గ్రంథ నిసేవణము పట్ల వెల్లడించు చున్నది గదా! నేటికిని మనలో కొందఱు పండితులు అహమపి పండితః

అనెడి పాండిత్య దర్పముచే నీ మహామహుని యతిశయమును గుర్తింపక, స్వేచ్ఛమెయి మన మతప్రచారమును చాతుర్వర్ణ్య గురుస్థానము నలంకరించిన మనము సాగించుచుండుట అంధపరంపరా న్యాయసిద్ధమైన యనిష్టములకే కాగలదు కాని, శ్రేయస్సున కెంతమాత్రమును కాజాలదని విశ్వసించు చున్నాను.

శివం భూయాత్

★

శ్రీ శివాభ్యాంనమః

# గీతా ప్రశంస

సీతా వియోగంబున శోకమోహ పరవశంబై దుఃఖించుచున్న శ్రీరాముని గూర్చి త్రేతాయుగంబున శ్రీ సాక్షాత్పరబ్రహ్మయగు సదాశివునిచే యుపదేశింపఁబడిన జ్ఞానమునకును, ద్వాపరయుగమందు కృష్ణావతారమున నర్జునుని నిమిత్తముగా చేసికొని శోకమోహ పరవశులగు జీవులనుద్ధరించుటకై వైయ్యాసిక భారతమందలి భీష్మ పర్వమున శ్రీకృష్ణభగవానునిచే నుపదేశింపఁబడిన వ్యాఖ్యాన రూపంబగు గీతకును సూత్రప్రాయంబైయ్యు నలరారు "శ్రీశివమహాగీత"ను, మోక్షేచ్ఛువు లెవరు కోరక యుందురు ? కృష్ణబోధితమగు భగవద్గీతకు సూత్రరూపంబయి యుండునదియే శ్రీ శివ మహాగీత.

"వెలస్వల్పము ఫలమధిక" మన్నట్లు వ్యాఖ్యానములను వేల మారులు చదవటమునకన్న మూలము నొకసారి పారాయణముగా చదివినను, ఇతరులకుచెప్పినను యెంతయో ఫలమధికమని ప్రతివారును గ్రహింతురు.

అట్టి మూలగ్రంథము నాంధ్రమున లేక సంస్కృతజ్ఞానము లేని వారికి చదువుటకు చెప్పటమునకును వీలులేనందున సులభమగు పదము

లతో నాంధ్రీకరింపుడని నన్ను కొందఱు కోరినందున తెనిగించితిని. పాఠకుల కిది యిష్టమయినట్లు తెలిపిన మిగత గ్రంథమును గూర్చి ప్రయత్నింతును.

ఇట్లు
గ్రంథకర్త

# శ్రీ సదాంధ్ర శివమహాగీత

గ్రంథకర్త — కామప్ప చంద్రమౌళిశాస్త్రి (లచ్చుపేట)

శా॥ శ్రీ శంభుఁ బరమేశు శంకరుహరుఁ । శీతాంశురే ఖోజ్వలుఁ
శ్రీ శాంభోజజసన్నుతాంఘ్రి యుగళుఁ । శీతాద్రిజాధాంగునిఁ
యాశాపాశ వినాశకాది గురునిఁ । నా చంద్రతారార్కముఁ
యాశింతుఁ వరమంగళ ప్రదుడుగా । నారాధ్యవంశమ్మునఁ.

శివ గీతా ప్రారంభము భక్తి నిరూపణ యోగము
సూతుడు శౌనకాది ఋషులను గూర్చి తెలుపుట

గీ॥ శివుని కృపచేతనే యిక । చెప్పగలను
భవసముద్రము దాట ను । పాయమగుట
శివుని సారూప్య ముక్తి సం । సిద్ధిదమును
భవ మహా ద్దుఃఖ భేష జం । బగుటచేత. ౧

కం॥ కర్మాఽనన్వితజ్ఞానియు
కర్మానుష్ఠుండు దాన । కారి తపసియుఁ
నిర్మల ముక్తిని పొందడు
కర్మాన్విత జ్ఞాన భక్తి । కలితుడు గాకఁ. ౨

కం॥ మిక్కిలి గుహ్యాతమంబును
చక్కని శివగీత యనెడి । సారంబునుముఁ

దొక్కొడ దండక వనమున
ముక్కంటియు భక్త రామ । మూర్తికి దెలిపెన్. 3

గీ॥ దేని శ్రవణమ్ము చేతనే । మానవుడును
ముక్తి కరతలామలకుడై । మురియు ధృవము
దాని మునువినె శివునిచే । దాశరథియు
విధిసుత సనత్కుమారుండు । వినియె గుహుచె. ౪

కం॥ ఋషివర్యుడు వ్యాసుడు నా
ఋషిమాన్య సనత్కుమార । ఋషివర్యునిచేన్
ఋషులార పొందె నే నా
ఋషి ఋషభు కృపాతిరేక । బుద్ధిన్ గంటిన్. ౫

కం॥ చెప్పెను వ్యాసుడు దీనిని
చెప్పకు మిక నెవరిముందు । చెప్పితి వేనిన్
ముప్పవు సూతుడ ? విను, మది
దప్పని శపియింత్రు సురలు । తామసులగుచున్. ౬

చం॥ అది విని బాదరాయణుని । యడ్డితి దేవులు క్షోభ నొందుచున్
మదిలో కలంగి తిట్టుట క । మర్త్యుల కెయ్యది హానియంచు నా
మదిగల సందియమ్ము నిక । మాన్పగ పూజ్యుడు నన్ను గాంచియు
న్నదగల ప్రేమనెల్ల ద్విగు । ణించి పరాశర సూను డిట్లనెన్. ౭

కం॥ గృహమేధినులగు విప్రులు
నహరహమును యగ్నియందు । హవనము సేయన్
బహు ఫలద కామధేనువు
లిహలోకమునందు వార । లే దేవులకున్. ౮

కం॥ పేయము భోజ్యము భక్ష్యము
నేయయ్యది దేవతలకు । నిష్టంబగునో

వేయగ వాటిని వహ్నిలో
నాయయ్యది దివిజులకును । హావిస్సై చేరున్. ౯

గీ॥ క్రతుభుజుల కిష్టసిద్ధిద । కర్మ లేదు
క్రతువులను మించి యవిలేని । కాలమందు
దొంగిలింపగ దోగ్ధ్రిని । దుఃఖములను
పొందు సంసారివలెనే వా । రుందురంత. ౧౦

కం॥ కావున శైవ జ్ఞానయి
భావింపడు కర్మతతుల । బ్రాహ్మణు డని తా
మీ విధము దలచి విఘ్నము
గావింతురు శైవభక్తి గలుగక యుండన్. ౧౧

గీ॥ అందుచేతనె శివభక్తి । నంద డెవడు
పండితుడుగాక భవభక్తి । పట్టుబడదు
కష్టతరముగ హరభక్తి । కలిగెనేని
నమ్మకము లేక విచ్ఛేద । నమును కలుగు. ౧౨

గీ॥ దేవతా విఘ్నతతులెల్ల । దీరుటకును
పౌరుషంబుండునా ? ముక్తి । బడయుటకును
సత్యమవు మార్గ సరణిని । సత్యముగను
నూతదెలియ నుపాయమ్ము । చూపుమయ్య. ౧౩

గీ॥ కోటి జన్మంబులందున । కూడుకొనిన
పుణ్యబలమున శివభక్తి । పుట్టుచుండు
నట్టి శివభక్తి గలవాడె । యవనియందు
యాగ కూపతటాకాదు । లన్ని చేయు. ౧౪

# శైవగ్రంథమాల

| | | | |
|---|---|---|---|
| 1. | సంధ్యావందనము | ... | 0—8—0 |
| 2. | ఆంజనేయ స్వరూపనిరూపణము | ... | 0—8—0 |
| 3. | భగవద్గీత | ... | 6—0—0 |
| 4. | శైవాహ్నికము | ... | 1—0—0 |

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు ఉత్తరము వ్రాయవలెను.

Saivamataprakasika Regd. No. A 227

# శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అడ్రస్ :— 1

## ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వ రం గ ల్

అడ్రస్ :— 2

## ముదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కా[illegible]

ఈమని (వయా) [illegible]

సూచన :— వ్యాసములు - ఉత్తరములు - [illegible] ఈ పై అడ్రస్సులలో నొకదానికి పంపించవలె[illegible]

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమున ప్రచురింపబడు
పవిత్ర మాసపత్రిక


| సంపుటము | హేవళంబి సంవత్సరము | సంచిక |
| --- | --- | --- |
| ౧ | 15—3—1958 | ౧౧ |



సంపాదకులు :

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.

*Principal Ayurvedic college & Superintendent*
*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు :

ముదిగొండ రామలింగశాస్త్రి

శాస్త్రప్రవీణ.


శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థతతిప్రభాసికా
సందేహసందోహమహానిరాసికా ।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా
జయత్వియం శైవమతప్రకాశికా ॥


శ్రీ శైవ మహా పీఠము

స్టేషనురోడ్డు, శ్రీ విశ్వేశ్వర దేవాలయము

వరంగల్

# విషయసూచిక

# శైవమతప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమునఁ బ్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవళంబినామ సంవత్సరము | సంచిక |
| --- | --- | --- |
| ౮ | 15—3—1958 | ౧౧ |


## సంపాదకీయము

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథంచ శ్రీశైలే మల్లికార్జునం
ఉజ్జయిన్యాం మహాకాల మోంకార మమలేశ్వరం॥
ప్రజ్వల్యాం వైద్యనాథంచడాకిన్యాం భీమశంకరం
సేతుబంధేతు రామేశం నాగేశం దారుకావనే॥
వారాణస్యాంతు విశ్వేశం త్ర్యంబకం గౌతమీతటే
హిమాలయేతు కేదారం ఘృష్ణేశంచ విశాలకే॥

మన భారతదేశమందు ద్వాదశ లింగములు ప్రసిద్ధికెక్కి-యున్నవి. అందులో నొకటి సౌరాష్ట్రదేశ మందలి సోమనాథలింగము. రెండవది శ్రీశైలమందలి మల్లికార్జున లింగము. మూడవది ఉజ్జయిని యందలి మహాకాల లింగము. నాల్గవది అమరేశ్వర మందలి ఓంకార లింగము. ఐదవది ప్రజ్వలిక యందలి వైద్యనాథ లింగము. ఆరవది డాకినియందలి భీమశంకర లింగము. ఏడవది సేతువందుండెడి రామేశ లింగము. ఎనిమిదవది దారుకావనమందలి నాగేశలింగము. తొమ్మిద వది కాశీయందలి విశ్వేశ్వరలింగము. పదవది గౌతమీతీరమందలి త్ర్యంబకలింగము. పదకొండవది హిమాలయ మందలి కేదారలింగము. పన్నెండవది విశాలకయందలి ఘృష్ణేశలింగము.

ఈ పన్నెండు లింగములలో మన ఆంధ్రప్రదేశమందు మిగుల ప్రఖ్యాతిగాంచినది శ్రీశైలమందలి మల్లికార్జున లింగము. పూర్వము శ్రీశైలము వెళ్ళుటకు సరియైన మార్గము లేదు. వ్యయప్రయాసలకు లోనుగావలసి వచ్చుచుండుట యందఱికి విశదమైన విషయమే. అట్లయ్యును "శ్రీశైలం శిఖరందృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అను శాస్త్రోక్తిని గమనించి మహాశివరాత్రి రోజున లక్షలమంది శిఖరదర్శనము చేసికొని మల్లికార్జునస్వామిని దర్శించి వెడలు చుండెడివారు.

పూర్వము శ్రీశైలము మహారణ్య ప్రాంతమయ్యు మహానగరముగ విరాజిల్లియున్నటుల చరిత్రాధారములు గన్పించుచున్నవి. నేడు శ్రీశైలము వెళ్ళవలెనన్న ప్రయాణీకులకు బస్సులు నేర్పాటుచేయబడినవి. సర్వదా సర్వకాలములయందు నిర్భయముగా శ్రీశైలము వెళ్ళవచ్చును.

శ్రీశైలమందనేకులు ప్రస్తుతము వసతిగృహముల నేర్పాటుచేసికొనుచున్నారు. శైవుల తరపున నొకభవన నిర్మాణ మందు నేర్పాటు గావించిన వచ్చిన మాహేశ్వరులు-భక్తాదులు నిరాటంకముగ శివపూజ నానందముతో జేసికొనుట కవకాశము లభించును.

ఈసంవత్సరము శివరాత్రి రోజున ఇవటూరి సానందారాధ్యుల వారు శ్రీశైలం వెళ్ళి యచటయున్న కమీషనరును విచారించగా నచట స్థలము నుచితముగా నిచ్చుట కంగీకరించిరట. శైవులలో నొకరచట వసతిగృహ నిర్మాణమునకై అయిదువేల రూప్యము లిచ్చిరట. అడబ్బు మీ శైవులు నిర్మించుకొనే భవనమునకు కావలెనన్న నిచ్చుదుమని కమీషనరువారితో చెప్పిరట. ఈవిషయము శైవులలో నొకరికి జెప్పగా వారును భవననిర్మాణమునకు నైదువేల రూపాయలు విరాళముగా నిచ్చెదుమని వచించిరట. ఇరవైవేల రూపాయలొక భవనమునకు గావలెనని చెప్పినారట. కాన, ఉదారస్వభావులు ఇహపరసాధనములకు మూలహేతువగు నొకభవనమును శ్రీశైలమందు నిర్మించి జన్మసాఫల్యత గాంచుదురుగాక.

# ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రం

శ్లో॥ సౌరాష్ట్ర దేశే విశదేతిరమ్యే
జ్యోతిర్మయం చంద్రకళావతంసం
భక్తి ప్రదానాయ కృపావతీర్ణం
తం సోమనాథం శరణం ప్రపద్యే. ౧

శ్లో॥ శ్రీశైల సంగే విబుధాతిసంగే
తులాద్రి తుంగేపి ముదావసంతం
తమర్జునం మల్లిక పూర్వమేకం
నమామి సంసార సముద్రసేతుం. ౨

శ్లో॥ అవంతికాయాం విహితా వతారం
ముక్తి ప్రదానాయచ సజ్జనానాం
అకాల మృత్యోః పరిరక్షణార్థం
వందే మహాకాళ మహాసురేశం. ౩

శ్లో॥ కావేరికా నర్మదయోః పవిత్రే
సమాగమే సజ్జన తారణాయ
సదైవ మాంధాతృపురే వసంత
మోంకార మీశం శివమేకమీడే. ౪

శ్లో॥ పూర్వోత్తరే ప్రజ్వలికా నిధానే
సదా వసంతం గిరిజా సమేతం
సురాసురా రాధిత పాదపద్మం
శ్రీ వైద్యనాథం తమహం నమామి. ౫

శ్లో॥ యం డాకినీ శాకినీ కాసమాజైః
నిషేవ్యమాణం పిశితాశనైశ్చ

సద్దైవ భీమాది పద ప్రసిద్ధం
తం శంకరం భక్తహితం నమామి. ౬

శ్లో॥ సుతామ్రపర్ణీ జలరాశి యోగే
ని బధ్యసేతుం విశిఖైర సంఖ్యైః
శ్రీరామచంద్రేణ సమర్పితం తం
రామేశ్వరాఖ్యం నియతం నమామి. ౭

శ్లో॥ యామ్యేసదంగే నగరేతి రమ్యే
విభూషితాంగం వివిధైశ్చ భోగైః
సద్భక్తి ముక్తి ప్రద మీశమేకం
శ్రీనాగనాథం శరణం ప్రపద్యే. ౮

శ్లో॥ సానంద మానంద వనేవసంత
మానందకందం హతపాప బృందం
వారాణసీనాథ మనాథనాథం
శ్రీ విశ్వనాథం శరణం ప్రపద్యే ॥ ౯

శ్లో॥ సహ్యాద్రిశీర్షే విమలేవసంతం
గోదావరీ తీర పవిత్రదేశే
యద్దర్శనాత్పాతక మాశునాశం
ప్రయాతి తం త్ర్యంబక మీశమీడే ॥ ౧౦

శ్లో॥ మహాద్రి పార్శ్వేచ తటేరమంతం
సంపూజ్యమానం సతతం మునీంద్రైః
సురాసురైర్యక్ష మహోరగాద్యైః
కేదారమీశం శివమేక మీడే ॥ ౧౧

శ్లో॥ ఇళాపురే రమ్యవిశాలకేస్మి
న్సముల్లసం తం చ జగద్వరేణ్యాం

వందే మహోదార తరస్వభావం
ఘృష్ణేశ్వరాఖ్యం శరణం ప్రపద్యే ॥ ౧౨

శ్లో॥ జ్యోతిర్మయ ద్వాదశలింగకానాం
శివాత్మనాం ప్రోక్త మిదం క్రమేణ
స్తోత్రం పఠిత్వా మనుజోతి భక్త్యా
ఫలంత దాలోక్య నిజంభజేచ్ఛ ॥

★

# శైవ ధ్వజము

పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు

ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ
ధీ మహి తన్నో రుద్రః ప్రచోదయాత్॥
తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్॥

ఓం నమశ్శివాయ

ఇదం శైవ - మిదం బ్రాహ్మ్యం

1. జగద్గురుత్వాధికృతమును నిగమాగమ సమ్మతమగుట శిష్టా దృతమైన శైవమతము ఈ ధ్వజ జ్యోత్స్నల సకల కళానిల యమును ఐహికాముష్మిక సాధనమై భారతీయాధ్యాత్మిక పథములందు అగ్రపీఠ మలంకరించినది.

2. మతాచార్యులైన ఉద్భటారాధ్య - పండితారాధ్య మల్లికార్జున పండిత - మంచన పండిత - విశ్వారాధ్య - వేమారాధ్యాది మహోదయులు భిన్నాభి ప్రాయులుగాక శ్రౌతార్థ సంపన్న సంస్కృతి మూలమై శైవ జాతీయ చిహ్నమగు నీ ధ్వజాశ్రయ

మునవే విజయపరంపరల అవిచ్ఛిన్నముగ సాధింపుచు లోక కళ్యాణమునకు తోడ్పడి కృతకృత్యులైరి.

3. శైవ జాతీయ గౌరవ చిహ్నమైన యీ పతాకము శ్రౌత శైవ పథక ప్రతిష్ఠితము. ప్రణవ వాచ్యమై లింగరూపమైన పంచాక్షరీ మహావచనము పతాకమునకు ప్రాణము. విశ్వరూప మును – విరూపమునైన రుద్రదేవతాకము విశిష్ట శక్త్యాత్మక గాయత్రీవల్లభత్వము నమ (జీవ) శివ – అయ (ఐక్య) ఇట్టి శివ జీవైక్య బోధక ధ్యానముక్తి సిద్ధము. కర్మ జ్ఞాన సముచ్చయో పాసక నిత్యజీవన వికాస పరమావధుల ఐక పారమార్థిక సుఖ మార్గద్యోతకమునై యున్నది.

4. ఇది వైదికము ఇది శైవము ఇది వేదాంత ప్రతిపాదక పర మార్థ దర్శక సుజ్యోతి. ఆశ్రిత జనానీక విశిష్ట వికాసానేక ప్రభాదర్శము.

5. ప్రభుత్వములు – పీఠములు – సంస్థలు – మతములు సంఘాదులు తదభ్యుదయ విజయ సూచితములగు వివిధ పతాక ప్రభల యందు సుసంపన్నమైన ఉనికికి నిలయము లగుచున్నవి.

6. ప్రాణములేని శరీరమువోలె ప్రకటిత పతాకముగాని వీరుని వీరత్వముగాని ప్రభువుల ప్రభుశక్తిగాని గురువుల గౌరవము గాని ఆరాధ్య దైవముల దైవిక జ్యోతిగాని ప్రకాశింప జాలదు.

7. పరమోత్కృష్ట సంస్కృతి కిది జ్యోతి రూపము – మానవుని కాయిక వాచిక మానసిక బలప్రదర్శనమునకు మెరుగు పెట్టెడి పరుసవేది. సమాజ విశిష్ట ధర్మాచరణాదిక క్రియాకౌశలము నకు పూర్ణదోహదము.

8. తన జీవితాదర్శమునకు గీటురాయి యైన స్వీయపతాకమును సముచిత రూపమున నలంకరించి తన కది బహిః ప్రాణముగ తలంచి సాధకుడు కృతకృత్యుడు కావలెను.

9. కృతాంజలియు పతాకోన్ముఖుడునయి జయ జయ నాదముల పతాకార్థ ప్రతిపాదితమైన గీతాగేయముల గానము చేయుచు స్వధర్మరతిని పెంపొందించుకొని తన సమాజ సాంఘిక సోదరోద్ధరణమునకు తదభ్యుదయమునకును వ్యక్తి దీక్షాబద్ధు డగుచు గురుం శరణం గచ్ఛామి. సంఘం శరణం గచ్ఛామి శివం శరణం గచ్ఛామి యనీ గురుచరేశ్వరారాధనమూలకమైన శైవ ధర్మమును స్మరింపుచు తనను నిజమైన సంఘసేవకునిగ భావింపవలెను.

* *
*

# శైవుల గోత్రాదులు

| ఇంటిపేరు | గోత్రము | శాఖ |
|---|---|---|
| వెలువనివారు | కౌండిన్యస గోత్రము | యజుర్వేదము |
| కొండపాటూరివారు | ,, ,, | ,, |
| కాశీనాథం వారు | కౌశికస గోత్రము | ,, |
| మెలకుర్తివారు | ,, ,, | ,, |
| పాంకోళ్ళవారు | భారద్వాజస గోత్రము | ,, |
| నిడమర్తివారు | ,, ,, | ,, |
| కొండగుడివారు | ,, ,, | ,, |
| కోలిమల్లివారు | గౌతమస గోత్రము | ,, |
| గండ్రంవారు | ,, ,, | ,, |
| కామర్సువారు | వశిష్టస గోత్రము | ఋగ్వేదము |
| పెరిసేపల్లివారు | గౌతమస గోత్రము | ,, |

# శివాపచారము

## చిన్నకథ

మీరీ పూలు కోయటానికి వీలులేదు. "నేను ఈ దేశానికి రాణిని" ఎవరినో తెలియకుండా మాట్లాడుతున్నావు.

చిత్తము తమరు రాణియని మాకు తెలుసు. కాబట్టే చెప్పుతున్నాం. ఈతోట శివాలయంలోనిది. శివుని పూజకొఱకు పూలచెట్లు నాటినాము. ఆపూలు శివపూజ కొఱకు వినియోగించ వలసినదేగాని స్త్రీలు తలలో పెట్టుకోటానికి వినియోగింప గూడదు. ఇది రాజాజ్ఞ.

చిరంజీవివి నీవు. నాలుగు కాలాలపాటు ప్రపంచంలో బ్రతకాలని వుంటే వెంటనే త్రోవయిచ్చి వెడలిపొమ్ము లేకుంటే నెట్టివైచి లోనికివెళ్ళి పూలు కోసుకుంటాము. అంటూ గద్దించి పలికింది రాణి.

అది వసంత ఋతువు. చెట్లన్నియు చిగిర్చి పూలుపూసి కమ్మటి వాసనలు విరజిమ్ముతూన్నవి. సాయంకాలం సధ్యాసమయంలో మహారాణి వూరి బయటికి వాహ్యాళి వెడలింది. అంతకు కొద్దిదూరంలో వున్న దేవాలయ ప్రాంగణంనుంచి విరిబూసిన పూలసుగంధవాసనలు మందమంద వాయువులలో మిళితమై మహారాణి నాసాపుటములలో దూరి ఒక్కసారి ముంచెత్తివైచినవి. అసలే స్త్రీలకు పూలంటే వలపు. ఆపైని మహారాణి, ఇక చెప్పవలసిన దేమున్నది. ఆపూలు కోసుకరమ్మని చెలికత్తెను బంపినది. ఆశివాలయ పూజారి సింహద్వార ప్రాంగణముననే నిలచి యున్నాడు. గుర్లురిమి చూచాడు. చెలికత్తె గడగడలాడుతూ పరగెత్తింది. రాణి వద్దకు జేరింది. ఆపూజారి మీద యెన్నో పితూరీలు చెప్పింది. "మహారాణిగారు వచ్చారు ఫూలు కోసుకోనివ్వమని" అడిగితే యెగిరిపడి నానాదుర్భాషలాడి నను కొట్ట వచ్చాడు. నేను వెంటనే కాలికి బుద్ధిచెప్పినాను. 'రాణిట రాణి! రాణిఅయితే మాత్రం యెవరికి లెక్క అన్నాడు" అంటూ ఏవేవో

పూజారిమీద ఎక్కువలు చెప్పింది. రాణి అపరభద్రకాళిలాగా మారింది. పదికానులకు మాదగ్గర జీతానికి పడిఉండే పూజారి అంత లేసి మాటలన్నాడని రాణి ఉగ్రరూపం దాల్చిందీ అంటే ఆశ్చర్యమేమీ లేదు. వెంటనే తనే స్వయంగా బయలుదేరింది. అప్పుడే దీపాలు ముట్టించారు. దేవాలయంలో భక్తకోటి పరమేశ్వరారాధనకు వస్తున్నారు. "జయ మహాదేవ శంభో", యనే శివనామ స్మరణము మిన్నుముట్టింది. విభూతి త్రిపుండ్ర రేఖలు తీర్చి రుద్రాక్ష మాలలు మెడలో వైచుకొని, చేతులు పైకెత్తి సమస్కరించుచూ, "వందే శంభు ముమాపతిం" అంటూ, శివనామస్మరణ చేసే ఆ భక్త గణమును చూస్తే మానవులకు ఒళ్ళు పులకరించి పరవశలగుతారనే మాట అలాఉంచి, పశుపక్ష్యాదులు సహితము ముచ్చుచేసిన లక్కబొమ్మల వలె నిలచిపోయునవీ అంటే సత్యదూరము మాత్రము కానేరదు.

అయితే ఒక్క రాణి మాత్రము రాతిహృదయమేమోగాని, భగవంతుని మీద ఆమెచూపు ప్రసరించలేదు సరిగదా భక్తగణముపై గూడా ఆమెకు కోపమొచ్చింది. ఈ దేవాలయాల్లో భక్తులు పూజచేయటం తనను పూలు పెట్టుకోనీయకుండా చేసేపన్నుగడని భావించింది. పైత్యరోగికి ప్రపంచమంతా పచ్చగా ఉంటుందిగదా! అంతకంతకు రాణికి ఉక్రోషం ప్రబలజొచ్చింది.

మంచి చెడులును గమనించి నడచుకోదు కోపము. విశ్వనాధుని పూజకు వేసిన పూలతోటలోని పూవులు తను కోసికొని కొప్పున తురుముకొనుట గొప్పయని భావించినదిగాని పాపమని భావించలేదు. పైగా ఆపూజారిపై అమితమైన కోపము రాణి హృదయంలో తాండవించింది. పూజారిని లెక్క చేయలేదు. "మన కెందులకు కోటలోనికి పోవుదాము రమ్మని చెప్పిన చెలికత్తెల మాటలు వినిపించుకోలేదు. "రాణిగారు! తమరు తోటలోనికి పోగూడదు. ఆగండి అక్కడే" అంటూ పూజారి కేకలను పెడచెవిని పెట్టింది రాణి. విశ్వనాధ దేవా

లయములోని పూలతోటలోనికి చరచరా సాగివెళ్ళి పోయింది. వారి వెనువెంట పూజారి వెళ్ళినాడు. పరిచారకులు వెంటబడ్డారు. భక్త గణము సంభ్రమాశ్చర్యములతో చూస్తూ నడుస్తున్నారు.

రాణి వెళ్ళి ఒక మందార పూలమొక్క దగ్గర నిలచింది. ఆ మందారలత విరియబూచిన పూలతో కమ్మని వాసనలు విరజిమ్ము తూన్నది. అబ్బ! అంటూ రాణి ఆవాసలను ఆఘ్రాణిస్తున్నది. ఇది వీర మాహేశ్వర వ్రతము. ఈపూలను ఈశ్వరపూజకు వినా కోసిన వారికి దండన తప్పదు. అంటూ కత్తి ఝుళిపించాడు పూజారి. రాణి చిరునవ్వు నవ్వింది. ఉడత ఊపులకు చెట్టు బెదరదయ్యా పూజారి. ఈరాజ్యానికి రాణిని నన్నేధిక్కరిస్తున్నావు జాగ్రత.

అజాగ్రతగా మెలగవలదనే తమను హెచ్చరిస్తున్నాను.

అల్పుడవు, మావద్ద సేవకుడవు, మితిమీరి మాట్లాడుతున్నావు ముందు నీసంగతి తెలుసుకో.

ఎవరిగతి యెట్లో తెల్పదగినవాడు పరమేశ్వరుడు. వారి పూజకై వినియోగపరచే పుష్పాలను అపవిత్రం చేస్తున్నావు. అది దుర్గతికి దారితీస్తుంది.

నీ వెవడివిరా నన్నాపుటకు తుచ్ఛుడా అంటూ తటాలున పూవు తెంపింది రాణి.

శివశివా అపచారము అపచారము అంటూ చెవులు మూసు కున్నారు భక్తులు. అంతటితో వూరుకోనక రాణి ఆపూవును విలా సంగా త్రిప్పుతూ ముక్కుదగ్గర పెట్టుకొని వాసనచూస్తూ చిరు నవ్వులు నవ్వుతూ విలాసంగా నిలబడ్డది. వెంటనే పూజారి ఉగ్ర మైన కోపంతో శివార్పితము కావలసిన పూలను నీవు వాసన చూస్తు

న్నావు తుచ్ఛురాలా! అంటూ తనచేతనున్న కత్తితో ఆ మహారాణి ముక్కును కోసివేశాడు. అరుస్తూ తిట్టుకుంటూ ఆ రాణి నేలమీద పడిపోయింది. నేలనెత్తురు మయమయింది. చెలికత్తెలు గోలపెట్టటం మొదలు పెట్టినారు. రాణిగారి ముక్కు కోశాడట పూజారి. అని ఊరంతా గోలపుట్టింది. ప్రజలంతా భయభ్రాంతు లయినారు. రాణిని మేనామీద రాణివాసము చేర్చారు. రాజవైద్యులు గాయమునకు మందువేసి కట్టుగట్టినారు. రాజభటులు పూజారిని ఖైదు చేశారు.

మరునాడు పూజారిని రాజుగారి యెదుట హంతకుడని నిలువబెట్టినారు. రాజసభ కిటకిటలాడి పోతూన్నది. అష్టమంత్రులు వారి వారి స్థానములయందు కూర్చుని యున్నారు. ప్రాగ్వివాకులు, హత్యానేరమును పరికిస్తున్నారు. న్యాయమూర్తులు ధర్మదండమును ధరించి సుస్థిరులై యున్నారు. గ్రామపెద్దలు కోపుల తలపాగలతో ప్రేక్షక స్థానములలో రెడ్డిగములువేసి కూర్చుని యున్నారు. ఇంతలో హర హర మహాదేవ" అనే నాదముతో వేత్రహస్తులు ప్రవేశించారు. మహారాజు వస్తున్నాడని అందరూ లేచారు. జయనాదములతో ప్రవేశించి సింహాసనముమీద కూరుచున్నాడు మహారాజు. 'ఈమె నా రాణియని ఇతడు పూజారియను భేదభావము లేకుండా న్యాయము కొఱకు అన్వేషిస్తున్నాడు మహారాజు. ఇరువురి వాదనలను విన్నాడు. "పుజారి చేసినది తప్పు. మహాదేవుని పూజకొఱకు నియమింపబడిన పూలతోటలోని పుష్పములు కోసినది, రాణిహస్తములుగాని ముక్కులుగావు కాబట్టి శివాపచారము చేసిన రాణికి కరచ్ఛేదనము శిక్షగా విధించుచున్నానని తీర్పుచెప్పినాడు. భక్తహృదయములు పరవశమై పంచాక్షరీమంత్ర జపము చేసినవి. రాణి చెలికత్తెలు దాసీలు రోదన మొనర్చిరి. దండధారులు రాణిగారిని వధ్యశిలవద్ద చేతులు ఖండించిరి. ఆ మొండి చేతులతో రాణి రాజదర్శనము చేసినది.

శివాపచారము చేసిన నీవు పవిత్రమైన గంగాస్నానము చేయనిదే నీ ముఖము చూడనన్నాడు రాజు. గంగానదిలో మూడు మునుకలు వేసి లేచుసరికి యథాప్రకారముగా చేతులు వచ్చినవి. ప్రజాహృదయములు సంతసించినవి.

*

## వేమనారాధ్యుల కాలములో శైవుల మహిమలు

సీ. వారాహి వారింటి, వాకిలి కసవూడ్చు
 శ్యామలాదేవి తా, జలముజల్లు
నార్ద్రిపదేశ్వరి, యలకి ముగ్గులుపెట్టు
 బగళా మహాదేవి పాకమేర్చు
త్రిపుర సుందరి యిష్ట తృప్తుల దనియించు
 ప్రత్యంగిరంబు తల్పముల బరచు,
శరభ కాళిక యీను, జల్లార్చు పత్నితో
 నెనయించు లలిత యిట్లనుదినంబు,

తే. శక్తి జాతంబు బడి పనుల్ సలుప బాహ్య
కార్యముల భైరవాదు లవార్య సరణి
దక్షులై యుండ విభవైక శిక్షణమున
దరలు మంచన పండిత వంశగురుడు.

సీ. తన పేరు దలచినంతన మహాతంత్రముల్
 పంచబంగాళమై పారి పోవ
శబర తంత్రంబులు, జక్కాడి కామినీ
 మోహినీజాలమ్ము మోసపుచ్చి,
పైశాచక వ్యథావర్వ్రత వజ్రమై
 కూష్మాండ గణకోటి గూలద్రోచి

భూతభేతాళ విస్ఫూర్తి బంది బిగించి
యక్షరక్షో భ్రాంతు, లగడుపరచి

తే. "భూతియినుమంతయిడిన భూభువనభవన
దుష్టశిక్షణ హేతిమైదురగలింప
విమతభంజనవిద్యా ప్రవీణుడగుచు,
జెలగు నాశంభులింగయ్య జెప్పదరమె.

వేమనారాధ్య చరిత్రనుండి

---

# శ్రీ మ దాం ధ్ర శి వ మ హా గీ త

గ్రంథకర్త - కామర్సు చంద్రమౌళిశాస్త్రి (లచ్చుపేట)

(గత సంచిక తరువాయి)

గీ॥ విధి విధానమ్ముగా కర్మ వితతిఫలము
శివుని కర్పించుచుండ నా శివుని దయతో
దృఢముగా భక్తి గలుగునా దివిజులంత
పారుదురు విఘ్నములవీడి భయమునంది. ౧౫

కం॥ సురలయి పారిన పురహరు
వరశుశ్రూషయు ఘటింప వారటుపైనన్
పరమేశు కథల వినగను
స్మరహర జ్ఞానమ్ముదాన సాయుజ్యమ్మున్. ౧౬

గీ॥ పెక్కు మాటలికేలను నొక్కి నొక్కి
చెప్పెదను భక్తి దృఢమైన శివునియందు
కోటిపాప మహా పాప కోటికోటి
సంఘయుత నరుడైన నిస్సంగు జేరు. ౧౭

సీ॥ శరముచేతను పరిహాస చయముచేత
నాదరా భావమున నసూయమునగాని
భవ సుభక్తిరతుండయి వరలెనేని
మాల వాడైన ముక్త సమ్మాన్యుడౌను. ౧౮

కం॥ శివభక్తి సర్వతోముఖ
శివభక్తియె సర్వదంబు క్షితిజాదులకున్
భవబంధ వినిర్ముక్తత
నవ్వుదానిచె మూఢనరుడు నదిలేకుండున్. ౧౯

సీ॥ భక్తియో లేక ద్రోహమ్మొ ప్రతిదినమును
వ్యక్తి నియమంబుచేతను యాచరింప
శక్తి సహితున కదియును సంతసంబె
ముక్తి భుక్తులనిచ్చు నా వ్యక్తికతడు. ౨౦

సీ॥ కొంచముగ పత్రములతో పూజించెనేని
కించిదుదకమ్ము శివునిపై నుంచెనేని
నియమమింతయు దప్పక నెవడుగాని
ఘనుడతనికిచ్చు శివుడు జగత్త్రయమును. ౨౧

సీ॥ అంతకును శక్తి లేకున్న హరుడుమెచ్చు
త్రిప్రదక్షిణముల జేయ దినదినమును
అందుకును శక్తి రహితుండు వందనమును
యిందు ధరునకుచేయ నా నందమందు. ౨౨

కం॥ దేవునిగాంచి నమస్కృతి
నేవిప్రుడు చేయలేడొ హృదయమున శివున్
భావింపవలయు నాతడు
పోవుచు తిర్గుచునునైన పొందును సిద్ధిన్. ౨౩

గీ॥ బిల్వకాష్టపు గంధమ్ము ప్రీతికరము
వన్య ఫల పుష్ప బిల్వముల్ వామదేవు
కెంతో సంతసమును గూర్చు నిట్లగుటచె
యీశసేవకు దుష్కరం బేది జగతి. ౨౪

గీ॥ అట్టి దేవుని విడనాడి యన్యమైన
దేవులను గొల్చు నరుఁడును తెలివిలేక
పూతభాగీరధీజల ములనువీడి
మరుమరీచికలనుగోరు మనుజుడట్లు. ౨౫

కం॥ మరికోటి జన్మ సంచిత
దురితంబులు కలిగినట్టి దుష్టాత్మునకున్
గిరిశజ్ఞాన ప్రకాశము
చేరదిక మోహాంధమాన సోభితు డగుటన్. ౨౬

గీత మాలికా॥ దేశకాలస్థలాదుల దీనికొఱకు
చూడవలసిన పనిలేదు శూలిపైన
చిత్త మెప్పుడు నెచ్చట స్థిరత నొందో
యచట శివు జీవులొకటియై యలరినట్లు
యెంచి ధ్యానమ్ముచే యుపాసించెనేని
భవవిముక్తుడై సాయుజ్య పదవినొందు. ౨౭

కం॥ భూ తేశాంశాధిపుడన
భీతుడ 'రాజాహ' మని బిభీషలగొట్టే
పాతకి యీ యుగ్రశ్శికుల
ఘాతం బొనరించు నా మఖాంతకుడెపుడున్. ౨౮

గీ॥ సృష్టికర్తని శ్రీనాథుఁడేనికాని
శంకరోహామటంచును స్మరణచేయ

నెవనినైనను సరియె తానెంచకుండ
స్వాత్మతోడను తాదాత్మ్య మందజేయు. ౨౯

గీ॥ ఏ వ్రతమ్ము నపరమ మునీంద్రులెల్ల
ధర్మమర్థము కామామృతముల గనిరొ
దాని వినుడి కనుడివె దతథ్యముగను
పాశుపతమను వ్రతమునై వరలుచుండు. 30

గీ॥ విలసయను దీక్ష నొందియు వేడ్క మీర
భూతి రుద్రాక్షమాలికా భూషితులయి
వేదసారాఖ్య శివనామ వితతిచదువ
వదలి మర్త్యత్వ మవుదురు భవతనువులు. 3౧

కం॥ లోక సుఖం కరుడగునా
పాకారి ప్రముఖ వినుత పాదుడు నిక మీ
యీకన్నుల కగపడియును
లోకేశుడు ముక్తిసుఖము లొందగజేయుః. 3౨

గీ॥ రాముగూర్చియు. దండకారణ్య మందు
ఘటభవుండిచ్చినట్టియా ఘనసుదీక్ష
భక్తి యుక్తులుగాన తప్పకను వినుడి
దాని మీ కంతయును చెప్ప బూనికొంటి. 33

ఇట్లు ఆశ్వలాయన సూత్ర వశిష్ఠగోత్ర కామర్సువంశ పవిత్ర రత్నాంబా సుంద
రారాధ్యపుత్ర విద్వజ్జనమిత్ర చంద్రమౌళిశాస్త్రి కృతాంధ్ర శివ
గీతయందలి భక్తి నిరూపణ యోగమను

ప్రథమాధ్యాయము

భూయాచ్ఛివమ్



శ్రీ శివాయ గురవేనమః

# నటరాజశతకము

(నుండి మఱికొన్ని పద్యములు)

సానందారాధ్యకృత

సీ॥ మన్మథాంతకుడంచు మహిమీద బేరొంది
నెత్తిపై గంగమ్మ నిలిపితీవు
పుష్పధన్వునిగాంచి బూది జేసిన నీవు
పార్వతి కర్ధాంగ భాగమిడితి
వంగజారివటంచు నందఱు గీర్తింప
నలతిలోత్తమ వేగ వలచితీవు
మదనసంహారుడంచు మఱి గొప్ప పేర్గాంచి
మునిసతీ కామివై తనిసితీవు

గీ॥ ఇంత మోహంబునీకేల స్వాంతమందు
నంతవాడవు నీ విట్టులలరుచుండ
మనుజులనుగూర్చి యింకేమి యనగ వలయు
మౌళిధృతరాజ, నటరాజ మహితతేజ॥ 1

సీ॥ అభ్రవాహినిగంగ యగరాజపుత్రిక
సంసారమున నీకు సతులుగాగ
విఘ్ననాథుడునుగ్ర వీరభద్రాదులు
శూరులౌ నీ ముద్దు సుతులుగాగ
భృంగీశముఖదివ్య భృత్యులెల్లరునీకు
పటుభక్తి రక్షులౌ భటులుగాగ
రజతాద్రి కైలాస రమ్యభూధరములు
నీకు జెన్నారెడు నిలయములుగ

గీ॥ నందివాహన సంసార మందు మమత
నంటియుంటక దిరుగుచు నుంటనీకె
తగునుగాకెట్టులోరులకు తగును దేవ
మూళిధృతరాజ, నటరాట మహిత తేజ॥ 2

సీ॥ పరతత్వరూపమై భాసించు నీ కెట్లు
కైలాసవాసంబు గలిగె దొలుత
గైలాసవాసంబు ఘనతరంబైనచో
రజితాద్రి కేలనీ రాకపిదప
రజితాద్రియేమనో రంజకంబైనచో
వలిమలయోగివై వఱలు టేల ?
వలిమలవాసంబు లలితమై యున్నచో
శ్రీ శైలమునకీవు జేరుటేల ?

గీ॥ అంతలో బోక జగతియం దన్నిచోట్ల
లింగరూపంబుతోడ వెలుంగు టేల ?
సందియము మాన్ప, సత్యంబు ముందుజెపుమ
మూళిధృతరాజ, నటరాజ, మహిత తేజ॥ 3

సీ॥ లోకపావనియైన లోలాక్షి గంగను
ధరియించి శిరముపై దనరినావు
సురుచిరఘనజటాజూటభూషణమట్లు
నెలమణి దీపింప గలిగినావు
యజ్ఞోపవీతమై యలరారునట్లుగ
ధవళసర్పము మేన దాల్చినావు
అంగవస్త్రమురీతి నలరునట్లుగజేసి
కటి చుట్టు పులితోలు గట్టినావు

గీ॥ నవ్యులైనట్టి యీకాల నరులకిట్టి
వేసమందున నెట్లు సంతోసముండు
గాలగతివచ్చుమార్పుల గాంచవలదె
మాళిధృతరాజ, నటరాజ మహితతేజ॥ 4

సీ॥ పరమాత్మతత్వాన్నామ పఠనాగ్ని కాల్పదే
పాపనామకమహా వనచయంబు
పశుపతి చిద్రూప పవనంబు కొట్టదే
దుఃఖనామకసర్వ తోయదతతి
మృత్యుంజయధ్యాన మృగరాజు లంఘించి
యణచదే పరితాప హస్తివితతి
భవదివ్యపాద సద్భక్తి భాస్వంతుండు
చమరడే యజ్ఞాన తిమిరసమితి

గీ॥ నవ్య శివమంత్రపాఠ సన్నౌకఘోర
జటిల సంసార నామక జలధి తరణ
మొనరజేయదె నీ భక్త జనులకెల్ల
మాళి ధృతరాజ, నటరాజ, మహితతేజ॥ 5

సీ॥ ఋగ్వేదమంత్రముల్ దిగ్వేధులందున
నీ దివ్య మహిమంబు నింపుచుండు
వరయజుర్మంత్ర సద్వాకంబులెల్లను
పరతత్వమీవని పల్కుచుండు
సామగానోక్తులు సర్వదేవాళికి
సంపూజ్యుడీవని సన్నుతించు
కనదథర్వణ మంత్ర కాండంబు నీదగు
ఘనతేజమునుజూపి వినుతిసేయు

గీ॥ ననుచు హారదత్తుడాదిగా ననఘమతులు
సప్రమాణోక్తి సద్గ్రంథ సమితివ్రాయ
గాంచగా వేరుమాత్సర్య కలితమతులు
వ్రాలి ధృతరాజ, నటరాజ మహిత తేజ॥ 6

సీ॥ వేదార్థమును దెల్ప విదితవిద్యారణ్య
భాష్యసూక్తులశుద్ధ భాష్యులైన
నుపనిషత్తులగల్గు విపులార్థ వేదులై
మాటలాడెడు జగ న్మాన్యులైన
బ్రహ్మసూత్రరహస్య భావాంతరంగులై
పలుక నేర్చినయట్టి వలతులైన
సర్వగీతాతత్వ సారసంస్కారులై
భాషించు పండిత ప్రవరులైన

గీ॥ భక్తి భావంబు మనసున బట్టదేని
పరశివానంద భాగ్యంబు బడయజాల
రనుచుననుభవశాలు లిట్లని వచింత్రు
వ్రాలి ధృతరాజ, నటరాజ మహిత తేజ॥ 7

సీ॥ ముఖములేకయె బహు ముఖముల జెన్నారి
నిఖిల ప్రపంచాళి నిండినావు
కనులులేకయును ముక్కన్నుల నీవొప్పి
బహు సహస్రాక్షుడై ప్రబలినావు
కరములేమియులేక కరకోటులనుగల్గి
కార్యంబులనుచేయ గల్గినావు
పాదహీనుడవౌచు బహుపాదములనొప్పి
నఖిలగామివియౌచు నలరినావు

గీ॥ అవయవంబులు లేకయనాంగివైన
యభవుడగునీకు నెట్లు దేహంబుగలిగె
గలిగె దానికి నింద్రియ క్రమము జెపుమ
మహాళి ధృతరాజ, నటరాజ మహితతేజ॥ 8

సీ॥ నిష్కళత్వముచేత నెగడుచుండెడినీవు
విలసత్కళాలీల వెల్గినావు
నిర్గుణుండవటంచు నిర్ణయింపగ శ్రుతుల్
పలుగుణంబులతోడ వెలసినావు
నీ వచింత్యుడవంచు నిగమముల్ వచియింప
జింత్యుండవై యెల్ల జెలగినావు
నిరుపమానుండవై వరలుచుండెడినీవు
నుపమానములకు రూపొసగినావు

గీ॥ ఎన్నగాజాల నీ విట్టు లెన్నిగతుల
సంచరింతువో కామ సంచారివగుచు
మహితగుణపూర్ణ నిన్ను నే మనగవచ్చు
మహాళి ధృతరాజ, నటరాజ మహితతేజ॥ 9

సీ॥ సర్వాత్మ! చిన్మయ! సచ్చిదానందాత్మ!
సర్వజ్ఞ! కేవల! సత్స్వరూప!
నిరుపమానదయాబ్ధి! నిష్కల! నిర్లిప్త!
నిర్మూఖ నిర్నేత్ర! నిష్కరాజ్ఞ
ఆనందఘనరస! యభవ! ముక్తిప్రద!
యాదిమధ్యవిహీన! యమితతేజ!
ప్రజ్ఞానఘన! సర్వ పరిపూర్ణ! పరమాత్మ!
పరమప్రసిద్ధ! నిష్పాపనిచయ!

గీ॥ అవ్యయానంద యనుచు సమాహ్వయముల
నిన్ను బిల్చెడు భక్తుల నెమ్మిఁబ్రోవ
నెట్టి రూపంబుతోఁడ గన్పింతొ చెపుమ
మౌళి ధృతరాజ, నటరాజ మహితతేజ॥ 10

సీ॥ ఆమ్నాయములనాల్గు ననువొంద బఠియించి
యందునర్థజ్ఞాన మరసి తెలిసి
మీమాంసలను రెంటి మేలుగా బఠియించి
యందులోఁగల తెల్వి చందమరసి
న్యాయశాస్త్రజ్ఞాన మార్జించి యార్జించి
సత్పురాణంబుల జదివి చదివి
ధర్మశాస్త్రజ్ఞాన మర్మముల్ గ్రహియించి
ఘనపండితుడనని గర్వమొంది

గీ॥ భక్తిహీనతదత్కాళా సక్తుడౌచు
బ్రొద్దులు బుచ్చెడు వానికేప్రొద్దునైన
ముక్తికాంతావిహారంబు బొందనగునె!
మౌళి ధృతరాజ, నటరాజ మహితతేజ॥ 11

సీ॥ నీవరూపుండవై నిండు రూపంబుతోఁ
గనుపించునటువంటి కామశక్తి
నీవనేత్రుండవై నెదదుఁచుండినజూడ
నర్హమై నటువంటి యమితశక్తి
నీవహస్తుండవై నిశ్చలంబుగనున్న
సర్వకార్యంబులు సలుపుశక్తి
నీవపాదుండవై నేర్పుమై నుండిన
నన్నిచోటుల నడ యాడుశక్తి

గీ॥ మొదలుగాగల్గుశక్తుల బూనుకతన
శక్తిమంతుడవై దిశా సమితియందు
వెల్లుచున్నావు శక్తితో వేల్పుఱేడ!
మౌళి ధృతరాజ, నటరాజ మహిత తేజ॥ 12



# ఓంకారము - శివలింగము

ముదిగొండ మల్లికార్జునరావుగారు - తాడికొండ

(8 వ సంచిక తరువాయి)

## 'శివ' శబ్దార్థము

ముక్కుమీద ఈగలు ముసురుచున్నవని ముక్కును తెగకోసు కొనునట్లు తనకు తెలియనంత మాత్రమున గంభీర సత్యసిద్ధాంతము లను పరిహాసించుట అవివేకుల పనియే యగును. మిస్ మేయో వంటి పాపిష్ఠి హృదయ దూషించినంత మాత్రమున 'శివలింగ తత్త్వమునకు కలుగు కొరత యేమియునులేదు'.

'శేతే అసౌ శివః' అనునది శివశబ్దనిర్వచనమై యున్నది. అనగా శయనించువాడు శివుడని యర్థము. మహాప్రళయానంతరము ప్రకృతియొక్క సమస్తక్రియలును ఆగిపోయినపుడు నిశ్చేష్ట,నిష్క్రియ, శాంత, చేతన క్రియావిశిష్టమగు బ్రహ్మమునకు శివుడని పేరు. వేదము నందు—

నమ శ్శంభవేచ మయోభవేచ నమశ్శంకరాయచ
మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ॥

(యజుర్వేద 16—41)

ఈ మంత్రమునందు స్పష్టముగా శంభు, శంకర, శివ శబ్దముల ద్వారా శివుడు స్తుతింపబడియున్నాడు.

ఇటులనే మాండూక్యోపనిషత్తునందుకూడ—

అదృష్ట మవ్యవహార్యమగ్రాహ్యామలక్షణ మచింత్యమవ్యప దేశ్య మైకాత్మ్య ప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థమన్యతే స ఆత్మా విజ్ఞేయః॥

అనగా, ఇంద్రియములకు గోచరింపనివాడును, వ్యవహరించుటకు వీలుగానివాడును, గ్రహించుటకు వీలులేనివాడును, లక్షణములు లేనివాడును చింతించుటకును చెప్పుటకును వీలులేనివాడును, మాయాకృత ప్రపంచాతీతుడును, సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యుడును, అద్వైతమును తురీయావస్థారూపమునగు శివుడే ఆత్మయై యున్నాడు. వానినే తెలుసుకొనవలయును.

వేదప్రతిపాదితమగు శివుని మాహాత్మ్యము శివపురాణమునందు 24000 శ్లోకములలో వివరింపబడినది. అంతియేగాక స్కాంద, లింగ పురాణములయందు సహితము లక్షల కొలది శ్లోకములతో విశదీకరింపబడి యున్నది. ఉపర్యుక్త వేదప్రమాణములయందు ఏ పరబ్రహ్మము శివనామముతో స్మరింపబడినదో ఆ శివరూప బ్రహ్మమును గూర్చియే పురాణములయందు వర్ణింపబడియున్నది.

నారదీయ వాయుపురాణ అనుక్రమణయందు

శ్లో॥ యో దేవ స్సర్వ దేవానాం దుర్విజ్ఞేయ స్సనాతనః
సంహితేయం మహాపుణ్యా శివస్యపరమాత్మనః॥

అనగా, ఎవడు సర్వ దేవాధిష్ఠాతయో, ఎవడు దుర్విజ్ఞేయుడును, సనాతన బ్రహ్మమునై యున్నాడో, అట్టి పరమాత్మయగు శివునియొక్క మహాపవిత్రమగు శివసంహితయై యున్నది.

—సకేసను

# శైవ గ్రంథమాల

| | | |
|---|---|---|
| 1. సంధ్యావందనము | ... | 0—8—0 |
| 2. ఆంజనేయ స్వరూపనిరూపణము | ... | 0—8—0 |
| 3. భగవద్గీత | ... | 6—0—0 |
| 4. శైవాహ్నికము | ... | 1—0—0 |

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు ఉత్తరము వ్రాయవలెను.

# శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |




అడ్రస్ :— 1

## ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వ రం గ ల్

అడ్రస్:— 2

## ముదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) ధుగ్గిరాల


సూచన :— వ్యాసములు - ఉత్తరములు - బ్లాకులు - చందాధనము ఈ పై అడ్రస్సులలో నొకదానికి పంపించవలెను.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# శైవమతప్రకాశిక

శ్రీ శైవమహాపీఠ పక్షమున ప్రచురింపఁబడు
పవిత్ర మాసపత్రిక


| సంపుటము | హేవళంబి సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౮ | 15—4—1958 | ౧౨ |



సంపాదకులు :

డాక్టర్ ముదిగొండ మల్లికార్జునరావు, H. P. I. M.

*Principal Ayurvedic college & Superintendent*
*Ayurveda Hospital,* **HYDERABAD.**

సహాయ సంపాదకులు :

ముదిగొండ రామలింగశాస్త్రి

భాషాప్రవీణ.


శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థతతిప్రభాసికా
సందేహసందోహమహానిరాసికా ।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా
జయత్వియం శైవమతప్రకాశికా ॥


## శ్రీ శైవ మహా పీఠము,

స్టేషన్‌రోడ్డు, శ్రీ విశ్వేశ్వర దేవాలయము

వరంగల్

# విషయసూచిక

# శైవమత ప్రకాశిక

శ్రీశైవమహాపీఠ పక్షమునఁ బ్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక

| సంపుటము | హేవిళంబినామ సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౧ | 15—4—1958 | ౧౨ |


## సంపాదకీయము

ఈనాడు చరిత్రల పరిశోధించిన కొలది శైవమొకతరి దేశమంతయు వ్యాపించి మహోన్నత దశను చెంది ఆరాధ్య పదసార్థక్యమును జెంది యున్నదని తోచకమానదు. ఇప్పుడు గాంచినను, మన ఆంధ్ర భాష తెలియని కన్నడదేశమందును-మహారాష్ట్ర దేశమందును ఆరాధ్యుల కనేక మంది శిష్యులున్నారు. చాతుర్వర్ణ్య గురుత్వము నేటికిని గలదు.

ఇట్టి మతము నుద్ధరింప నొకానొక కాలమందు నీలకంఠాచార్యు లవతరించి బ్రహ్మసూత్ర భాష్యమును రచించి శైవమత ప్రచార మొనరించి యుండిరి. హరదత్తాచార్యులు మున్నగు వారెందఱో వారికి శిష్యులై శైవగ్రంథము లనేకము రచించిరి. నీలకంఠుడను నొక శైవాగ్రేసరుడు ఆ భాష్యమునకు కారికారూపమున క్రియాసారమను పేరుతో నొక వ్యాఖ్యానము రచించెను. అప్పయ్య దీక్షితులవారు - శివార్కమణిదీపిక యను పేర నాభాష్యమునకే వ్యాఖ్యానము రచించిరి. హాలాస్యనాథశాస్త్రియను దాక్షిణాత్యపండితు డద్దానిని ముద్రించుచు "శివాద్వైత మిదంభాష్యం" అని శివాద్వైతమును బోధించుభాష్య

మిది యనియు-శంకరాచార్యుల వారికంటె నీభాష్యకర్త ప్రాచీను డనియు నుడివియుండిరి. అట్టి భాష్యమునకు మహోపాధ్యాయ ముది గొండ నాగలింగశాస్త్రిగారు శివచింతామణి ప్రభయను పేర లఘుటీక రచించిరి. అద్దానిని ఆకారపు నరసింగం గుప్తగారు ముద్రించి శైవు లకు మహోపకారము చేసియుండిరి.

నీలకంఠారాధ్య కృతభగవద్గీతా భాష్యమును వరంగల్లు వాస్త వ్యులగు కొమరవెల్లి బాలరాజగుప్తగారు ముద్రించి పండితులందఱికి నుచితముగ బంపుచుండిరి. వీరిఔదార్య మెంతయు శ్లాఘనీయము.

ఇట్టి గ్రంథముల ముద్రించుటకు దగిన ప్రోత్సాహమునిచ్చి-శ్రమచేసి టీకాదుల రచించి గ్రంథములు వెలువడునటులచేసిన పీఠాధి పతులగు ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారి యవిరళకృషి యెంతయు ప్రశంసనీయము.

చారిత్రిక పరిశోధకులును శైవమతమందు సరియైన దృక్పథ ముతో పరిశీలించి నటుల గన్పింపదు. ఏలననగా మతాచార్యులలో శంకర-రామానుజ-మధ్వాచార్యులను మాత్రము గ్రహించి వారి చరిత్రల సంగ్రహముగ దేశచరిత్రలయందు ముద్రించుచుండిరేగాని-వీరందఱికి బూర్వులైన నీలకంఠాచార్యుల (ఆరాధ్యుల) చరిత్రను వ్రాయబూనుకొనలేదు. చారిత్రిక దృష్టితో వ్రాయబూనిన వారు మతపక్షపాత మవలంబించ గూడదు. ఉద్భటారాధ్యాది ఆలంకారిక శాస్త్రపారంగతులు-మల్లికార్జున పండిత-సోమనారాధ్యాది పండిత ప్రకాండులు మున్నగు వారెందఱో పూర్వుల చరిత్రలలో నగ్రస్థానము వహించ వలసియుండగా-పరిశోధకు లీనాడు వారల గుర్తించియు చరిత్రలలో ప్రధానస్థాన మివ్వకుండుట విచారణీయాంశము.

పూర్వము శ్రీశైలక్షేత్రము శైవులకు ప్రధానతీర్థయాత్రగా పేరెన్నికగాంచి యుండెను. శ్రీపతి పండితారాధ్యులవారు శ్రీశైల

మందే పీఠమును స్థాపించియుండిరి. మల్లికార్జున పండితులు మున్నగు వారు శ్రీశైలప్రదక్షిణము లెన్నో పర్యాయములు చేసియుండినటుల సోమనారాధ్యుని గ్రంథముల వలన దెలియుచున్నది. శ్రీశైలములో కళ్యాణోత్సవమును నేటికిని ఆరాధ్యులే చేయించుచు ఆచార్యస్థానము వహించి యున్నారు.

శ్రీశైలమునకు మహాశివరాత్రికి వెళ్లిన ఆరాధ్యులందఱు ఉత్తరగోపురద్వారమున నివాసముగా నుండుచు మల్లికార్జునస్వామి వారిని ప్రత్యేకరుసుము ఏమియు లేకుండా దర్శించుచుండువారు. మధ్య కాలములో నాపద్ధతి తొలగింపబడి యుండెను. ఆవిషయము తెలిసిన మీాదట 1936 సం॥నందు ఆంధ్రపత్రికా సంపాదకులైన శ్రీ శివలెంక శంభుప్రసాదుగారి యధ్యక్షతక్రింద జరిగిన 19వ శైవ మహాజనసభలో యీవిషయము పరిశీలించి యీక్రిందితీర్మానము చేయబడినది.

తీర్మానము—శ్రీశైలక్షేత్రమునందు ఉత్తరగోపురద్వారము వద్దగల ప్రదేశములలో శైవులయొక్క ప్రత్యేక నివాసమునకుగల హక్కును రుసుముచెల్లింపకయే దేవదర్శనము చేయుహక్కును ప్రస్తుతము శైవులకు నిరాకరింపబడుచున్నటుల తెలియవచ్చినందున అట్టి హక్కుల యొక్కయు ఇతర హక్కుల యొక్కయు పోషణనిమిత్తమై తగుచర్యను కార్యనిర్వాహక సంఘమువారు తీసికొనవలయునని యీ సంఘము వారు తీర్మానించుచున్నారు.

తీర్మానమైతే చేయబడినదిగాని యది యమలు జరిగియుండలేదు.

ప్రస్తుతం శ్రీశైలం వెళ్ళుటకు నచట నివాసముగా నుండుటకు ననేకసదుపాయములు ప్రభుత్వము తరఫున ప్రజల తరఫున నేర్పాటు చేయబడుచున్నవిగాన శైవులకు ప్రధానస్థానమైన శ్రీశైలమందు శైవులకు ప్రత్యేకముగా నొక వసతిగృహము నిర్మించు టావశ్యకము. అందు విషయమై కొందఱు విరాళముగా కొంత వాగ్దానము చేసి యుండిరి. శ్రీ. లో. సానందారాధ్యుల వారావిషయమై తగు శ్రద్ధ

పూని కార్య సాఫల్య మగువఱకు శ్రమయొనర్చుదు మని తెలుపు చున్నారు.

కాన మత సాంఘిక విషయములన్నియు బూర్తిగా పరిశీలించుట కును—మతప్రచారమునకున్ను తణుకుతాలూకా కొత్తపల్లెలో శైవ మహాజనసభ ఏప్రిల్ 28, 29, 30 తేదీలయందు నేర్పాటు చేయబడి నది. కాన భక్తమాహేశ్వరు లందఱాసభకు విచ్చేసి సభను దిగ్విజయము చేయుదురుగాక!

## శైవమహాపీఠవిరాళములు

| | |
|---|---|
| నిల్వ | 22-8-0 |
| భూపతి సోమలింగంగారు | 5-8-0 |
| కొండూరి రామలింగంగారు<br>కొండూరి బుచ్చిరాజలింగంగారు<br>కొండూరి వెంకయలింగంగారు | 6-0-6 |
| కంభంపాటి రామనాధంగారు | 1-0-0 |
| గుండా శంభయ్యగారు | 0-8-0 |
| ముదిగొండ రాజలింగంగారు | 2-0-0 |
| ది 25-2-58 వఱకు నిల్వ | 37-8-6 |

## శైవమహాజనసభ ఆహ్వానము

### శైవమహాపీఠము 49 వ వర్థంతి

స్వస్తిశ్రీ విళంబినామ సం॥ వైశాఖ శు ౧౦ సోమవారము మొదలుకొని మూడురోజులు అనగా 1958 సం॥ ఏప్రిల్ 28, 29, 30

తేదీలలో శైవమహాపీఠ 49 వ వర్ధంతి తణుకు తాలూకా కొత్తపల్లి గ్రామములో జరుపుటకు నిశ్చయించ బడినదిగాన, శైవమహాజను లెల్లను తప్పక దయచేసి సమావేశ కార్యక్రమములందు పాల్గొని సభను జయప్రద మొనర్ప ప్రార్థన.

ఇట్లు, ఆహ్వానసంఘము

1. ఇవటూరి వీరభద్రయ్యగారు, రిటైర్డు గ్రామమున్సబ్
2. ఇవటూరి సుబ్రహ్మణ్యంగారు, రిటైర్డు హెడ్‌మాష్టర్
3. చాగంటి ఉద్దండశాస్త్రుగారు, గ్రామకరణం
4. చాగంటి వీరభద్రరావుగారు, పంచాయతీబోర్డు ప్రెసిడెంట్
5. మల్లంపల్లి బంగారం అనే సుబ్బారావుగారు,

చైర్మన్ ఆఫ్ ట్రస్టీ బోర్డు

---

# శ్రీశైవ మహాపీఠము - 49 వ వర్ధంత్యుత్సవము

## ఆహ్వాన పత్రిక

స్వస్తిశ్రీ విళంబి సం॥ర వైశాఖ శు ౧౦-౧౧-౧౨ లకు సరియగు 1958 సం॥ ఏప్రిల్ 28-29-30 తేదీలయందు తణుకు తాలూకా కొత్తపల్లి అగ్రహారములో పీఠాధిపతుల అధ్యక్షత క్రింద 49 వ వర్ధంత్యుత్సవము జరుపుటకు నిశ్చయింపబడినది గనుక శైవ మహాజనులెల్లరు విచ్చేసి సభయందు పాల్గొని వర్ధంత్యుత్సవమును విజయవంతముగ నొనర్ప ప్రార్థన.

ఇట్లు

శివపురం రామలింగం
శైవ మహాపీఠ కార్యదర్శి

## కార్యక్రమము

### 28-4-58

ఉదయము 7-30 పీఠాధిపతుల ఊరేగింపు
,, 8-30 స్వాగతోపన్యాసము
,, 9-30 పీఠకార్యనివేదిక 1957-58 మార్చి 1 తేదీవరకు
,, 10- 0 పీఠాధిపతులసందేశము
సాయంకాలం 4-30 శివలింగధారణ - శివపూజ ముక్తిసాధనములు - ఇవటూరి సానందారాధ్యులవారు
,, 5-30 పంచాక్షరీమహిమ - శివలెంక బుచ్చయ్య అయ్యవారు
,, 6-30 శైవసంఘము - ప్రస్తుతము నిర్వర్తించదగిన విధులు - ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు

### 29-4-58

ఉదయము 7-30 శివోత్కర్ష-ముదిగొండ ముక్తిలింగశాస్త్రిగారు
,, 8-30 పీఠపురోభివృద్ధి-కందుకూరి వటుక భైరవమూర్తి గారు
,, 9-30 శైవపీఠమున శార్థిక సమృద్ధిని గలిగించు టెట్లు? అత్తలూరి వెంకటసుబ్బారావుగారు
సాయంకాలం 4-30 శైవ వేదాంతము - శతావధాని ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారు
,, 5-30 శైవసంఘము - ముదిగొండ కోటీశ్వరరావుగారు
,, 6-30 శివపూజా విశేషములు - ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు

### 30-4-58

ఉదయము 7-30 శివపురాణ ప్రతిభ - చాగంటి భాస్కరలింగ శాస్త్రిగారు

8-30 ఆచార్య ప్రకాశము - మున్నంగి పున్నయ్యగారు
9-30 శివభక్తి విశేషములు-పులిపాక కేదారలింగంగారు
సాయంకాలం 4-30 శైవగ్రంథములు - రెంటాల వీరభద్రశాస్త్రిగారు
5-30 శైవులు - సంధ్యావందనము -ముదిగొండ రామ లింగశాస్త్రిగారు (ఈమని)
6-30 ఇతర ఉపన్యాసములు

N. B ఈ పై కార్యక్రమము అచటికి వచ్చిన పండితుల అభిప్రాయాను సారము మార్పు చేయవలసియున్న మార్పుకొన వచ్చును. కొత్తపల్లి వచ్చువారు నిడదవోలుదగ్గర దిగి పెరవలీ లాకు దగ్గరకు మోటారుమీద వెళ్ళవలెను. అక్కడికి 1 మైలుదూరములో కొత్తపల్లి గ్రామము గలదు.



# కోటి పంచాక్షరీ మహాయాగము

అష్టోత్తర శత ౧౦౮ కుండీవిధానము

భక్తులకు దెలియజేయుట మేమనగా సప్తమోక్షపురులలో శ్రేష్ఠమైన శివక్షేత్ర మనంబడు మాయాపురి-అనగా హరిద్వారమందు జగత్ కళ్యాణార్థముగా యీ విళంబినామ సం॥ జ్యేష్ఠ శు ౫ నుండి ౧౧ రోజుల వరకు యీ మహాక్రతువు జేయుటకై సంకల్పించబడినది.

దీనిలో నాల్గువేదములు ౧౮ పురాణములు భాష్యత్రయము లను ప్రతిరోజు పారాయణముల జేయబడును. సాయంత్రం ౪ గంటల నుండి గీతా ప్రవచనము.

దశకోటి శివనామ గ్రంథములను వెంటనుంచుకొని ప్రతిక్షేత్ర మందు తీర్థోదకములచే సంప్రోక్షించి నిత్యపూజా నివేదన పంచాక్షరీ ప్రార్థనాదికమున జరుపుచు 45 క్షేత్రముల దర్శించి నిజామాబాద చేరి

విళంబి నిజశ్రావణ మాసమందు పంచాక్షరీ భవనారంభమునకై శంకుస్థాపన జేసి దానిలో గురుకులమును స్థాపించబడును.

ఇట్టి సత్కార్యమునకు సద్భక్తులందరు యథాశక్తి ధన సహాయ్యమొనర్చి యీ పంచవర్ష ప్రణాలికలోగా శతకోటి శివనామ లేఖనము-దశకోటితర్పణము కోటిపంచాక్షరీహోమము పూర్తి జేయ గలందులకై కోరుచున్నాము.

ముందు శివనామ ప్రచారమునకై ౧౧ కేంద్రములు ౧౧ ఉప కేంద్రములును స్థాపించబడును.

ఇట్లు,

శ్రౌతశైవ ప్రచారక్ సభ్యులు
ప్రస్తుత శ్రీ శివకోటి కార్యాలయము
శ్రీ కంఠేశ్వరమందిరము నిజామాబాద్ (ఆంధ్రప్రదేశ్)

★

నీలకంఠేశ్వరాయనమః

# శ్రీ శివపంచాక్షరీ యజ్ఞ సమారంభము

## ౩౬వ వార్షికోత్సవము

1. సద్భక్తులకు దెలియజేయుట మేమనగా శ్రీనందన సంవత్సరం నుండి పంచాక్షరీ మంత్రానుష్ఠాన కార్యక్రమము ప్రారంభించి అక్షర కోటి మంత్రజపము అనేకభక్తుల సహాయ్యముచే పూర్తిజేసి విజయ సంవత్సరాదిగా ప్రతిసంవత్సరము ఒకొొకపుణ్యక్షేత్రములయందు జప యజ్ఞముల జరిపి హేవిళంబినామ సంవత్సరమున శ్రీకంఠేశ్వర క్షేత్ర మందు శతకోటి శివనామ సముల్లేనారంభము గావించి అనేక భక్తులచే శివనామములను వ్రాయించుచున్నందులకు దశకోటి పూర్తిగావచ్చు చున్నది. దశకోటి కొొకసారి కోటిహోమాత్మకమైన పంచాక్షరీ యాగము జేయవలసియుండును.

2. అందులకై యీవిళంబినామ సం॥ జ్యేష్ఠమాసమున జగత్ కల్యాణార్థముగా పంచాక్షరీ మహాక్రతువును జేయుటకై సంకల్పించ బడినది.

3. దీనిలో చతుర్వేదపారాయణములు అష్టాదశ మహాపురాణేతిహాస పఠనము, ప్రస్థానత్రయ భాష్య ప్రవచనములను జేయ బడును.

4. హేవిళంబి శ్రావణ శు॥ ౫ నుండి లక్షబిల్వ లక్షకుంకు మార్చనకార్య క్రమము ప్రారంభించనైనది.

5. మాఘమాసమున మహాశివరాత్రికి సూర్య సింహాసన మహోత్సవము లక్షదీపమాలికా సహితముగా శ్రీకంఠేశ్వరాలయ మందు శివకోటి సామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవమును జరిపి పంచాక్షరీ పురశ్చరణారంభము జేయబడును.

6. విళంబి వైశాఖ శు ౧౦ నుండి యజ్ఞనిర్విఘ్న పరిసమాప్తికై శ్రీ గణేశగ్ర యజ్ఞముల జరిపి ఈశ్వరప్రీతికై బీదసాదలకు అన్నదానముజేసి జయజయధ్వనులతో బైలుదేరి శివకోటి గ్రంథ ముల నూరేగించి బదరీయాత్రా స్పెషల్ భోగిలో నుంచబడును.

7. ప్రతిరోజు శివకోటి పంచాక్షరీ శ్రీ యంత్రములకు లలితా సహస్రనామములచే కుంకుమార్చనా (శిరా) భోగముజేసి యాత్రీకు లందరితో ప్రార్థనజేయించి తీర్థప్రసాదముల నొసగ బడును.

8. శివకోటి అలంకారపూజా నివేదనములకై అర్చక పరిచార కుల నియమించి యాత్రలను సేవించబడును.

9. నలుబదైదు క్షేత్రములను దర్శించి నిజామాబాదచేరి విళంబి నిజశ్రావణమాసమందు పంచాక్షరీభవన నిర్మాణమునకై శంకుస్థాపనజేయబడును.

## పంచాక్షరీభవన నిర్మాణ వివరము

10. చుట్టు ప్రాకారము నిర్మించి మధ్యన శివకోటి పంచాక్షరీ శ్రీ యంత్రముల ప్రతిష్ఠించుటకై చిన్న ఆలయ మొకటి నిర్మించి చుట్టు బాలురకు వసతిగృహముల నేర్పరచి విశాలమైనహాలును వొకటి నిర్మించి అందులో గురుకులమును స్థాపించబడును.

11. ఇట్టి శాశ్వతకార్యము జేయదలంచినందులకు సర్వేశ్వరుడు సద్భక్తుల హృదయమందు ప్రవేశించి వొకరొకరు వొకొకగదిని తమ పేరకట్టించి శాశ్వత కీర్తిని పొందగోరుచున్నాము.

12. పంచాక్షరీ భవననిర్మాణమునకు దాదాపు (50000)ఏబది రూపాయిలధనము పంచాక్షరీ మహాయాగమునకు (54000)ఏబదినాల్గు వేల ధనమవసరము. అన్నదానముకు ౫౦౦ బస్తాల బియ్యము కావలసి యుండును.

13. వీలుననుసరించి గ్రంథమూలా పత్రికా ప్రకటన ముద్రణాలయముల స్థాపించబడును.

14. పంచకేంద్రములయందు పంచాక్షరీపీఠ నిలయముల నిర్మించవలెను.

15. అందుచే ధీరోదార స్వభావముఃగల భక్తవరులందరు యీ మహాయాగమునకు వొకొకకుండమునకు నియమించ ఐదు వందల ధనమొసగి తమ తమ గోత్రనామములచే సంకల్పించి కంకణ బద్ధులై స్వహస్తములచే హోమముచేసినను సరే, లేక ఋత్విజుల ద్వారా చేయించినను పుణ్యక్షేత్రమందు వొక రుద్రయాగముచేసిన ఫలము ద్రవ్య మొసగిన వారికే వచ్చును. కనుక యేలాటి సందేహములేక సంకల్పించగలరు.

16. ఈ కార్యములన్ని పంచాక్షరీకోటి ఆహుతులపై అవలంబించియున్నందున ప్రతిభక్తుడు యీ పంచవర్ష ప్రణాళికవరకు అభీష్టా

హుతులకై సరిపడు ధనమొసగి యీ కోటిహోమసంకల్పము పూర్తి జేయగలరు.

17. శ్రీ నీలకంఠేశ్వరానుగ్రహమువలన యీ కార్యము లన్ని జయప్రదముగా కాగలవని నిశ్చయాత్మకబుద్ధిచే సంకల్పించి ప్రయత్నింపుచున్నందులకు భక్తాదులందరు యథాశక్తి ధనరూపముగానైన లేక వస్తురూపముగానైన స్వహస్త పరహస్తములచే సహాయ్యమొనర్చి ఈశ్వర ప్రీతికి పాత్రులై ఆయురారోగ్య ఐశ్వర్యములబడసి ఇహపరసుఖము పొందగోరుచున్నాము.

కార్యనిర్వాహకులు :

బ్ర. శ్రీ. నిర్మల అంబయ్య సిద్ధాంతిగారు
శ్రీ కంఠేశ్వర మందిరము, నిజామాబాద్.

---

# శైవమతము - దాని ఘనత

కామర్సు శ్రీ రామారావుగారు

శివుడే దైవమని, శివుడే ఐశ్వర్య మిచ్చువాడని భావించి, లింగమును శరీరమందు ప్రతిష్ఠ చేసికొని కరపీఠార్చన చేయు వాడే శైవుడు. మానవునకును, సృష్టించిన పరమాత్మకునుగల సంబంధమే మతమనంబడును. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల త్రయమే లింగస్వరూపంబని ఘనమతులు వక్కాణించుచున్నారు.

అనాదినుండియు మన ఉపనిషత్తులు వేదములు, మన పురాణములు శైవమత ఘనతను స్పష్టముగా చాటుచున్నవి. ఋగ్వేదమందు "కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే వోచేమ శతమగ్ంహృదే" అని రుద్రుని గురించి వెల్లడిచేసియున్నారు. అది

యనుగాక శ్రీమదప్పయ్యదీక్షితులువారు 1604 వ సంవత్సరములోని వారు. వారు శైవమునుగూర్చి యీ క్రింది విధముగ చెప్పియున్నారు.

శ్లో॥ ధ్యేయత్వే తవ సాక్షిణో మునిగణాః జ్ఞానప్రద త్వేశుకో
వంద్యత్వేనిగమాః స్వభక్తి విమతక్లాంతౌ కృతాంతాదయః
నిత్యత్వే భవతః పితమహా శిర స్స్రగ్బృంద మాద్యంతయో
శ్శూన్యత్వేతు వరాహ హంస వపుషౌ పద్మాక్ష పద్మాసనౌ॥

తా॥ ఈశ్వరుని ధ్యానయోగమునకు మునిగణములు సాక్షులు. నీలకంఠడు జ్ఞానప్రదుడనుటయందు శుకుడుసాక్షి. నమస్కారార్హుడనుటయందు వేదములు సాక్ష్యములు. నిజభక్త ద్వేషుల నడచు విషయమున యమధర్మరాజాదులు సాక్షులు. నిత్యత్వ విషయమున బ్రహ్మకపాల మాలికాబృందము సాక్షి. నీయాద్యంత శూన్యత్వ విషయమున వరాహ హంసాకృతులు దాల్చిన హరి బ్రహ్మలు సాక్షులు.

శ్లో॥ గాయత్రీ వల్లభత్వాత్ దశరథ తనయ స్థాపితారాధితత్వాద్
శౌరేః కైలాసయాత్రా వ్రతముది తతయాభీష్ట సంతాన
దానాత్
నేత్రేణ స్వేన సాకందళ శతకమలై ర్విష్ణునారాధి తత్వాత్
తస్మై స్మచక్ర ప్రదానదపిచ పశుపతి స్సర్వదేవ ప్రకృష్టః॥

తా॥ గాయత్రికి భర్త యగుటచేతను శ్రీరామునిచే ప్రతిష్ఠింపబడి. పూజింపబడుటచేతను, కైలాస యాత్రావ్రతమునకు సంతసించి శ్రీకృష్ణున కభీష్టమగు సంతానము నిచ్చుట చేతను, తన నేత్రముతో కూడ వేయికమలములచేత విష్ణువుచే పూజింపబడుటవల్లను ఆ విష్ణువు కొఱకు చక్రమిచ్చుటవల్లనుకూడ పశుపతి సర్వదేవతలలో నుత్కృష్టుడని అప్పయదీక్షితులవారు నొక్కి వక్కాణించి యున్నారు. ఈ విధముగ శివుని ఘనతను చాటుటకు పై యుదంతములు చాలును.

భారతదేశమునందేగాక యితర దేశములందు గూడ శివలింగ ములు కానవచ్చుచున్నవని నేటి వార్తాపత్రికలు చాటుచున్నవి. పూర్వకాలమందు ఖండఖండాంతరములందుకూడ శైవమతవ్యాప్తిగల దని తెలియుటకు పై విషయమే తార్కాణము.

మన దేశమున పల్లవుల కాలమందు శైవమతము వృద్ధి పొంది నది. వారి కాలమున శైవులు అణిమాదిసిద్ధులు, అష్టైశ్వర్యము గల వారనియు, రాజులు శైవమతస్థులనియు చరిత్రకారులు చాటు చున్నారు. ఎల్లోరా కొండయందు శివసంబంధమైన బొమ్మలచే నింపి యున్నారు. నేటికిని ఆ చిత్రములు కానవచ్చుచున్నవి. చోళ రాజులుకూడ శైవము నుద్ధరించిరని తెలియుచున్నది. తర్వాత ఈ మతము నధికముగ నావరించిన వారే లేకుండిరని చెప్పవచ్చును.

పూర్వము నుండియు భారతదేశము అనేక మతకర్తలకును, దేశక్షేమార్థము పాటుపడు మహావ్యక్తులకు స్థానమైనది. శైవము క్షీణించు సమయమున అవతార పురుషులగు పండితత్రయము (మల్లి కార్జున పండితుడు, శ్రీపతి పండితుడు, మంచన పండితుడు.) అను మువ్వురుదయించి, శైవమునకు పునర్జన్మను చేకూర్చిరి. వారి విష యములనుగూర్చి శైవులకు యావన్మందికి తెలిసియే యుండునని తల చెదను. వారి మతవ్యాప్తియే నేటివఱకు నిలిచియున్నది. సుమారు కొన్నివందలమంది శైవులు మాత్రము హిందూదేశములో నున్నారని తెలియుచున్నది.

ప్రస్తుతకాలము : "కలౌ శైవ మరోచకం" అని పూర్వ కాలముననే వచించియున్నారు. ఆ విధముగనే శైవులు కొంతమంది లింగధారణ మానివేయుచున్నారు. శివపూజ చేయుటకూడ మానివేయుచున్నారు. కొందరు నాస్తికులగుచున్నారు. ఇట్టి సమయ మందు తిరిగి శైవపునరుద్ధారణార్థమై బయల్దేరిన పత్రికయే "శైవ మత ప్రకాశిక" శైవులు దీనికి సహాయము చేకూర్చెదరని

నా తలంపు. పరమేశ్వరుడు శైవమహాజనమునుగూర్చి సకల విషయములు ఈ పత్రికలో వ్రాయుట నా కానందదాయకము. శైవమతాభివృద్ధి చూపు యీ పత్రిక నడపుటకు పరమేశ్వరుడు అను గ్రహించును గాత!

నేటివఱకు అనేక మహనీయులగు పురుషుల మాత్రమే యిట్టి శివకోటి వ్రాసియున్నారు. స్త్రీలలో వ్రాసినవారు అరుదు. పూజ్యురాలును, నాకు అక్కగారున్నూ, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల వీరభద్రయ్యగారి సతీమణియు, తెణుకుతాలూకా దువ్వ గ్రామ కాపరస్తులున్ను, నిత్యము స్నానానంతరము శివునారాధించుచున్న శ్రీమతి మల్లికాంబగారు శివకోటివ్రాసి శ్రీశైల భ్రమరాంబ, మల్లికార్జునుల సన్నిధిని వప్ప చెప్పి వచ్చినారు. "శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అనునట్లు వారిని పరమేశ్వరుడు ఇహపరసౌఖ్యములలో నీదులాడించుగాక!

---

# శ్రీనీలకంఠభాష్యము

(సంపుటము ౮, సంచిక ౯, తరువాయి)

(ఆంధ్రీకర్త - నిర్మల శంకరశాస్త్రిగారు (శ్రీకంఠ విద్యాభూషణ - సంస్కృత సాహిత్యరత్న.)

జిజ్ఞాసాధి కరణము.

వేదము కర్మపరమనియు బ్రహ్మపరమనియు రెండు భాగములు కలిగియుండును. ఇట్టి వేదములోని యుపనిషదముల యేకార్థమును నిర్ణయించుటకు వలయు న్యాయములను సూత్రములు వెలిబఱచునవి. ఇట్టి సూత్రముల సముదాయము మీమాంసా (విచార) శాస్త్రమనం బడుచున్నయది. వేదాంతములన్నిటిని వివరింప శక్యము కాదు గావున సూత్రములకు విషయములగు నుపనిషద్వాక్యములం జెంది యుండు సంశయములు తొలగుటకై యీ మీమాంసాశాస్త్రము ఉపయోగించునట్టిది; అన్యోన్య విరుద్ధములగు నర్థములను పోనాడి సద్వివరణ

మును తెలుపు బ్రహ్మసూత్రములన్నియు ముముక్షువుల (మోక్షాపేక్షగలవారు) కు అత్యంతావశ్యకములగుచున్నవి. అన్యమతములందభి నివేశముగలవారికి నీ సూత్రవివరణ రుచించకుండును. తటస్థులగు బుద్ధిమంతులకు మాత్రము తప్పక నవగతము కాగలదు.

ఉదాహరణ : "శబ్దాదేవ ప్రమితః" సూత్రము.

"ఈశానో భూతభవ్యస్య" విషయవాక్యము.

విషయవాక్యమందలి ఈశాన శబ్దముఁబట్టి సూత్రగతమైన "శబ్దాదేవ" అను దానికి "ఈశాన - శబ్దము వలననే" యని యర్థము సంగతమగునది. అభిధాన శ్రుతి ననుసరించి ఈశానశబ్దము శివపరము కావలసినదే; అంగుష్ఠపరిమాణముగల పురుషుఁడు శివ పరమాత్మయని నిర్ధారణ చేయఁబడెను. "భూతభ వ్యమునకు ప్రభువు" అను నర్థముఁబట్టి నారాయణ పరత్వమును సాధింపరాదు. సూత్రములో ఏ వకారముండుటవలన ఈశానశబ్దమువలననే యని యేర్పడుటచే శివపరత్వము సునాధ్యమగుచున్నయది.

"పరిణామాత్" అను సూత్రముఁ దగు నధికరణమునందు వివర్తవాదమును నిరూపింపవీలులేదు. ఇట పరిణామశబ్దము కంఠరవేణ చెప్పఁబడినందున పరిణామవాదము సులభమగునది. మరియు "కర్తా శాస్త్రార్థ వత్త్వాత్" అను సూత్రవివరణయందు జీవాత్మ కర్తకాడని చెప్పరాదు. శాస్త్రార్థమంతయు జీవునియందే నుపయోగముఁ జెందున దగుటఁజేశి జీవుఁడు కర్తయు భోక్తయు నగుచున్నవాఁడు.

ఇట్లు కొన్ని భాష్యములు సూత్రకర్త యాశయమునకు విరుద్ధములగునవి కావున నుపనిషద్గత సందేహములు దూరమగుటకు సూత్రకర్త యాశయము ననుసరించి మీమాంస (విచారము) యావశ్యక మగుటఁజేసి శ్రీ నీలకంఠాచార్యులవారి కీ భాష్యము అని వార్యముగా కర్తవ్యమైనది.

ఇట్టితఱి కొన్ని ప్రశ్నలు మనసునం దుదయించును.

(౧) మీమాంసాశాస్త్ర ప్రారంభమునకు ఫలితము ఎట్టిది ?
(ఫలితమనగా – ఎట్టి ఆశ్రయములేని ప్రేమగల సుఖము ప్రాపించుట, (అథవా) ద్వేషమూలమైన దుఃఖము బొత్తిగా తొలగుట;)

(౨) ఈ శాస్త్రమునకు పఠించుటకు నధికారి యెట్టివాడు కావలెను?
(ఆర్థిత్వాదిగుణములు కలవాడు అధికారియగును.)

(౩) మీమాంసకు విషయము ఎద్ది ?
(విషయమనగా – కొద్దిగా తెలిసినట్టియు, పూర్తిగా తెలియనట్టియు సంశయముల చేరికఁ జెందియుండునది.)

(౪) ఎద్దాని తరువాత నీ మీమాంసాశాస్త్రము నారంభించవలెను ?
(ప్రారంభమునకు సమీపముగానుండు నిశ్చిత సాధనము సిద్ధించిన తరువాత యని చెప్పవలసియుండును.)

ఇట్టి సందిగ్ధ ప్రశ్నలకు సమాధానముగా – సర్వజ్ఞులలో శ్రేష్ఠులైన వేదవ్యాస భగవానుడు మొదటిదగు జిజ్ఞాసాసూత్రము నవతరింపఁ జేశినవారు.

ప్రతిశాస్త్రమునకు – ప్రయోజనము (ఫలితము) అధికారి, విషయము, సంబంధము, అనఁబడు అనుబంధచతుష్టయము అవసరము.

సంసార సుఖము లభించుట సంసారము తొలగుటయు యీ శాస్త్రమునకు ప్రయోజనములు కాజాలవు. సంసారము అనాదియగుటచే నెప్పుడును తొలుగునదికాదు.

అధికారిగుణములు : ధర్మానుష్ఠానముతో నేర్పడు చిత్తశుద్ధి
వేదశాస్త్ర విజ్ఞానము,

## వేదశాస్త్రములచే నిషేధింపఁబడకుండుట మోక్షాపేక్షయు

సూ. "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా"

అథ – ధర్మవిచారము తరువాత, అతః – ఎందువలన ధర్మ-విచారమును చేసియున్నవాఁడో ఇందువలన, బ్రహ్మణః – పరమాత్మ యగు సదాశివుని జిజ్ఞాసా – తెలుసుకొనఁగోరుట, యనగా నుపనిషదములందలి విషయమునంతయు విచారించి యవగాహనము చేసుకొనుటయని నిష్కర్షితమైన సూత్రార్థము.

అధికరణమనగా : విషయము, సంశయము, పూర్వపక్షము, సిద్ధాంతము, నిర్ణయము, సంగతి యనువాని కాధారమగునది ;

ఈ సూత్రములో నుండు అథశబ్దమునకు – ప్రారంభము, మంగళము, అను నర్థములు పొసగఁజాలవు. బ్రహ్మవిచారము ప్రారంభింపఁబడునది కాకుండుటను, జిజ్ఞాసకు మంగళార్థమునకు నన్వయము కుదురకుండుటను "అనంతరము" అను నర్థమే పొసగునది ; బ్రహ్మవిచారముఁ జేయువానిఁ జెందియుండునది, బ్రహ్మవిచారమునకు సాధనమైనట్టిదియు బ్రహ్మవిచారమునకుముందు నియతమై యుండునది ;

ఇఁట సిద్ధాంతము, నిర్ణయము అని నిర్ణయముయొక్క చివరి భాగము సిద్ధాంతమగు నను నుద్దేశముతో వేరు వేరు చెప్పఁబడినవి. నిర్ణయశబ్దమునకు మిక్కిలి పొందఁబడునది యను వ్యుత్పత్తివలన ప్రయోజన మను నర్థంబు గ్రాహ్యమగును. ఈసూత్రమునందు "అథ" యని మొదటనుండుటచే అథ యను నుచ్చారణవలననే మంగళము ధ్వనించుచున్నయది.

కూర్చుండుటకు ముందు భోజనము నడచు అనువానిలో నెద్దియు నియతము కానట్లు బ్రహ్మవిచారమునకుముందు ఏదే నొకటి

యుంచుసనని చెప్పరాదు కావున "నియతముగానుండు – దాని పిమ్మట యని అథశబ్దార్థమును నిర్వచించుట సమంజసము."

పూర్వపక్షము:– బ్రహ్మ విచారమునకు ముందు వేదాధ్యయనము నియతముగా నుండవలెను. ఎట్లనగా – ఎనిమిది వత్సరములు మొదలగు ప్రాయముగల బ్రాహ్మణాదివర్ణస్థులకు విహితమైన ఉపనయనము తరువాత వేదములను తప్పనిసరిగా చదువవలసి యుండును. ఆచార్యుని సేవించుచు వారి ముఖమునుండి వెలువడు నక్షరములఁ గ్రహించి యవ్వాని యర్థమును తెలుసుకొనుట వేదాధ్యయనమునకు ఫలమగుచున్నది. ధర్మమువలె బ్రహ్మము వేదమునందు ప్రతిపాదింపఁ బడునదగుటచే వేదములఁ జదువనివానికి బ్రహ్మవిచారముఁ జేయ వలనుపడదు గావున కేవల వేదాధ్యయనానంతరము బ్రహ్మవిచారము మును గావింపనగును. అధ్యయనము నిత్యమగుటచేత నధ్యయనాంగమగు నుపనయనంబు నిత్యమగునది; వేదములఁ జదువక నితరవాఙ్మయము నధిగమింప పరిశ్రమించువాడు ఈజన్మయందే తన వంశముతో సహా శూద్రత్వమును పొందునని ప్రమాణములు నిరూపించుటచే వేదాధ్యయనము. తదంగమైన నుపనయనంబు తప్పనిసరి (నిత్యములు) యగుచున్నవి. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను వాక్యములోని స్వశబ్దముఁబట్టి స్వశాఖకుచెందిన వేదమును తప్పక చదువ వలసి యుండును. శుశ్రూషాది నియమములతోడ నాచార్యుని చెంత గావించు వేదాధ్యయనము. ఆచార్యుని అధ్యాపనంబు (చదివించుటయు) వేదార్థ పరిజ్ఞానమను నభ్యుదయమునకై యుపయోగించునట్టిది: బాలుడైన వటువు – వేదార్థపరిజ్ఞానము నపేక్షింపకున్నను "వ్యాధిగ్రస్తునకు సామ దానాద్యుపాయములతో నౌషధమును సేవింపఁజేయునట్లు" పెద్దవారు ప్రేరేపింతురు గావున బాలుడగు వటువే వేదాధ్యయనమున కధికారి యగుచున్నవాడు.

ఇట్లు వేదాధ్యయనము తప్పనిసరిదై బ్రహ్మవిచారమునకు ముందు నియతమగుచున్నయది.

---

# గ్రంథపరిచయము

## కృష్ణవేణి

ఇది యొక ఖండకావ్యము. ఈకావ్యకర్త "మాదల" నివాసి యగు ముదిగొండ సుబ్రహ్మణ్యకవిగారు. ఈభావకవి ద్రాక్షాపాకమున తొలిపాయ - మలిపాయ - తుదిపాయ - యని క్రొంగ్రొత్త పోకడల చల్లని పిల్లతెమ్మెరలతో కృష్ణవేణీ తీరాన రసికహృదయంబుల ప్రకృతి వర్ణనాస్రవంతితో మజ్జన మాచరింపజేసినాడు.

సీ॥ ఎంత పుణ్యముజేసె, నేమొ యీతలమెల్ల
బుద్ధవాఙ్మయ వీణె, మ్రోగె నచట
ఏమినోములు నోచినేమొకో యీధాత్రి
బుద్ధపాదస్పర్శ, పొందగలిగె
ఏతపం బొనరించె, నేమొకో భూదేవి
సిద్ధార్థ స్తూపముల్, చెలగెనిచట
ఏవ్రతంబుజేసె, నేమొకో యీనేల
విశ్వవిఖ్యాతిగ, వెలయగలిగె

గీ॥ ధర్మపదసారమెల్లను, తరచి తరచి
సూత్రపంక్తులబోసి సచ్ఛాత్రులకును
పంచిపెట్టిరిటను మున్ను, వత్సలతను
సిద్ధనాగార్జునాచార్యు, చేతిచలువ ॥

# శివపురాణము

ఏతత్పురాణము సాంధ్రీకరించి శివమహిమామృతమును నెల్లరకు పంచిపెట్టిన మహాకవులు ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు. ప్రజలందరు చదువుకొని అర్థముచేసుకొన తగినంత సులభశైలిలో యీపురాణము వ్రాసిన శాస్త్రిగారి ప్రజ్ఞావిశేషమంతయు శ్లాఘనీయము. వీరి కవిత్వము తిక్కన మహాకవి కవిత్వమువలె చక్కని జాను తెనుగు పదముల పాఠకుల 30 పు. నింపుచున్నది, పరశివచరిత్ర జిజ్ఞాసువులకును – ముముక్షువులకును నీ పురాణము కొంగుబంగారము సర్వాంగ సుందరముగ తృతీయముద్రణ మిపుడే వెలువడినది. ఆధునిక పౌరాణిక కవులలోను – ప్రబంధకవులలోను–అగ్రతాంబూలము శాస్త్రిగారికే యివ్వతగియున్నది. అష్టాదశ పురాణములలో నుత్తమమైన శివపురాణము ప్రతియింటను నుండిన సర్వశ్రేయములు గల్గునని మా తలంపు. శాస్త్రిగారికి మా హృదయపూర్వక నమోవాకములు.

—సంపాదకులు

* *
*

# షట్కాల శివపూజ

ముదిగొండ రామలింగశాస్త్రిగారు - ఈమని

శిష్యుడు : షట్కాల శివపూజ శైవులకు ముఖ్యమా ?

గురువు : ఇది పూర్వకాలమునుండి యనుక్రమతముగా వచ్చుచున్న వైదిక ధర్మము. కావుననే శైవులు "షట్కాల శివపూజా ధురంధరులైన" అను వక్కణము ధరించుచున్నారు.

శిష్యుడు : షట్కాలము లన నేవి ?

గురువు : అరుణోదయ - తపనోదయ - సంగవ - మధ్యాహ్న - సాయంకాల - అర్ధరాత్రములన నవి షట్కాలములు.

శిష్యుడు : అరుణోదయకాలమునకు ప్రాత స్సంధ్యా వందన కాలమున్ను ప్రాప్తించును గదా!

గురువు : చుక్కలుండగనే ప్రాత స్సంధ్య చేయవలయునని యుండుటచే శివపూజ - సంధ్యయు నొకేతడవ సంప్రాప్తమగును.

శిష్యుడు : రెండు నేకకాలమున ప్రాప్తించి నపుడు సంధ్యా వందనము చేసి అరుణోదయకాలపూజ చేయవలయునా? లేక ముందు శివపూజచేసి సంధ్యావందనము చేయవలయునా?

గురువు : రెండు నీశ్వరోపాసనములే గాన నెట్లు చేసినను దోషము లేదు.

శిష్యుడు : సంధ్యావందనముకంటె శివపూజ ముందుచేసిన సంధ్యా వందనకాల మతిక్రమింపదా?

గురువు : అరుణోదయకాలపూజ అవసరార్చనమేగాన స్వల్ప కాలముననే ముగియునుగాన సంధ్యావందనకాల మతిక్రమింపదు.

శిష్యుడు : సంధ్యావందనముచేసి యరుణోదయ కాలపూజ చేయవచ్చునా? అట్లు చేసిన నరుణోదయ పూజాకాల మతిక్రమింపదా?

గురువు : అతిక్రమింపదు.

శిష్యుడు : అర్ఘ్యము విడిచిన తరువాత సూర్యోదయమగువరకు గాయత్రీ మహా మంత్రమును జపించుచుండవలయునుగదా!

సూర్యోదయమైన తరువాత అరుణోదయ కాల మెట్లుం డును? అరుణోదయ పూజ చేయు టెట్లు?

గురువు : చుక్కలు కనబడునప్పుడే సంధ్యావందనము అర్ఘ్య ప్రదానాంతము చేసి తరువాత అరుణోదయ కాల పూజ చేసికొని పిమ్మట సూర్యోదయమగువఱకు గాయత్రీ మహా మంత్రమును జపింప వచ్చును.

శిష్యుడు : అర్ఘ్యము విడిచి గాయత్రీ జపించి సంధ్యావందనము పూర్తి చేసికొనకుండా మధ్యలో శివపూజ నెట్లు చేయ వచ్చును? ఒక కర్మ మొదలుపెట్టి యది పూర్తికాక ముందే మఱియొక కర్మ చేయరాదు గదా!

గురువు : వేదమునందు "ఉదితే జుహోతి - అను దితే జుహోతి" సూర్యు డుదయించిన తరువాత హోమము చేయవలయు నని యొక పక్షము - సూర్యు డు ద యిం ప క ముందే హోమము చేయవలయునని వేరొక పక్షంబును గలదు. ఇందు సూర్యోదయముకంటె ముందు హోమము చేయు పక్ష మవలంబించిన వారు సంధ్యావందన మెట్లు చేయుదురో తెలిసిన అరుణోదయ కాలపూజ బాధకముగా తోపదు.

శిష్యుడు : వారెట్లు చేయుదురు?

గురువు : చుక్కలు కనబడుచుండునప్పుడే సంధ్యావందన మారంభించి సూర్యోదయమగువఱకు గాయత్రి జపించుచుండు నెడల సూర్యోదయము కాక ముందు అగ్నిహోత్రము చేయుట సంభవింపదు. కావున వారు చుక్కలు కనబడు

తరువాత హోమ కర్మము తీర్చికొని సూర్యోదయము దనుక గాయత్రి జపింతురు. "సహి కర్మాణి కర్మాంత రారంభః" అను నిషేధ మిట్టి యెడల ప్రవర్తింపదు. కాన నిత్యే అరుణోదయకాలపూజ నొనరించువారు తొలుత నర్ఘ్య ప్రదానమువఱకు సంధ్య నాచరించి తరువాత యరుణోదయ కాలపూజచేసి సూర్యోదయము దనుక గాయత్రీ జపించిన నేమియు బాధకము లేదు.

(సశేషము)

* *
*

# భగవద్గీతా భాష్యము

కీర్తిశేషులైన బ్ర. శివయోగి, మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే వ్యాఖ్యానము వ్రాయబడి శ్రీ శ్రీకంఠ శివాచార్య కృత గీతాభాష్యము వెలువడినది.

నేటి వఱకును లోకమున గీతలు శైవమునుగూర్చి చెప్పలేదను అభిప్రాయముగాగలవారి సందేహము లన్నియు పూర్తిగా తీర్ప జాలియున్నది. తొలిదొల్త.

శ్లో॥ యః పాశుపత విజ్ఞానం దధౌ గీతామృతం మహాత్
కుర్వన్ పార్థాయ సారథ్యం తస్మై కృష్ణార్పణేనమః॥

అని ప్రార్థన చేయుటలో గీతాహృదయము స్పష్టముగా చెప్పబడుచున్నది. కృష్ణుడు పాశుపతవ్రత దీక్షితుడై వ్రతాచరణ మొనరించి జీవన్ముక్తుడై లీలామాత్రముగ పార్థుని కౌరవయుద్ధమందు నిమిత్తముగా చేసికొని పాశుపత విజ్ఞానమును లోకక్షేమమునుగూర్చి

సూర్యోదయమైన తరువాత అరుణోదయ కాల మెట్లుం డును? అరుణోదయ పూజ చేయు టెట్లు?

గురువు : చుక్కలు కనబడునప్పుడే సంధ్యావందనము అర్ఘ్య ప్రదానాంతముచేసి తరువాత అరుణోదయ కాల పూజ చేసికొని పిమ్మట సూర్యోదయమగువఱకు గాయత్రీ మహా మంత్రమును జపింప వచ్చును.

శిష్యుడు : అర్ఘ్యము విడిచి గాయత్రీ జపించి సంధ్యావందనము పూర్తి చేసికొనకుండా మధ్యలో శివపూజ నెట్లు చేయ వచ్చును? ఒక కర్మ మొదలుపెట్టి యది పూర్తికాక ముందే మఱియొక కర్మ చేయరాదు గదా!

గురువు : వేదమునందు "ఉదితే జుహోతి – అనుదితే జుహోతి" సూర్యు డుదయించిన తరువాత హోమము చేయవలయు నని యొక పక్షము – సూర్యుడుదయింపక ముందే హోమము చేయవలయునని వేరొక పక్షంబును గలదు. ఇందు సూర్యోదయముకంటె ముందు హోమము చేయు పక్ష మవలంబించిన వారు సంధ్యావందన మెట్లు చేయుదురో తెలిసిన అరుణోదయ కాలపూజ బాధకముగా తోపదు.

శిష్యుడు : వారెట్లు చేయుదురు?

గురువు : చుక్కలు కనబడుచుండునప్పుడే సంధ్యావందన మారం భించి సూర్యోదయమగువఱకు గాయత్రి జపించుచుండు నెడల సూర్యోదయము కాక ముందు అగ్నిహోత్రము చేయుట సంభవింపదు. కావున వారు చుక్కలు కనబడు నప్పుడే సంధ్యావందన మారంభించి అర్ఘ్య ప్రదానముచేసి

తరువాత హోమ కర్మము తీర్చికొని సూర్యోదయము దనుక గాయత్రి జపింతురు. "నహి కర్మణి కర్మాంత రారంభః" అను నిషేధ మిట్టి యెడల ప్రవర్తింపదు. కాన నిట్లే అరుణోదయకాలపూజ నొనరించువారు తొలుత నర్ఘ్య ప్రదానమువఱకు సంధ్య నాచరించి తరువాత యరుణోదయ కాలపూజచేసి సూర్యోదయము దనుక గాయత్రీ జపించిన నేమియు బాధకము లేదు.

(ప్రక్షేపము)

* *
*

# భగవద్గీతా భాష్యము

కీర్తిశేషులైన బ్ర. శివయోగి, మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే వ్యాఖ్యానము వ్రాయబడి శ్రీ శ్రీకంఠ శివాచార్య కృత గీతాభాష్యము వెలువడినది.

నేటి వఱకును లోకమున గీతలు శైవమునుగూర్చి చెప్పలేదను అభిప్రాయముగాగలవారి సందేహము లన్నియు పూర్తిగా తీర్ప జాలియున్నది. తొలిదొల్త.

శ్లో॥ యః పాశుపత విజ్ఞానం దధౌ గీతామృతం మహత్
కుర్వన్ పార్థాయ సారథ్యం తస్మై కృష్ణార్పణేనమః॥

అని ప్రార్థన చేయుటలో గీతాహృదయము స్పష్టముగా చెప్పబడుచున్నది. కృష్ణుడు పాశుపతవ్రత దీక్షితుడై వ్రతాచరణ మొనరించి జీవన్ముక్తుడై లీలామాత్రముగ పార్థుని కౌరవయుద్ధమందు నిమిత్తముగా చేసికొని పాశుపత విజ్ఞానమును లోకక్షేమమునుగూర్చి

ప్రబోధించెను. దాని చేతనే కృష్ణుడు యీశ్వర స్వరూపుడైనట్లు వ్యక్తమగుచున్నది. అట్టి కృష్ణపరమాత్మ శివజ్ఞానమునుగాక వేరొండుపదేశముచేసి యుండడనుట విశ్వసింపదగినది. ఇది గాక.

శ్లో॥ పార్థాయ ప్రతిబోధితాం భగవతానారాయణేయ స్వయం
యాసేనగ్రథితాం పురాణమునినామధ్యే మహాభారతం.
అద్వైతామృత వర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ.
మంబత్వా మను సందధామి భగవద్గీతే భవద్వేషిణీం.

అని చెప్పుటలో "అహం వివస్వతే యోగం" అని ప్రారంభించి చెప్పిన యే విషయముగలదో ఆ విషయమే తొలుత భగవంతునిచేత స్వయముగా చెప్పబడి తిరిగి శ్రీ మహానారాయణుడైన కృష్ణునిచే అర్జునునికొరకు చెప్ప బడినదని తెలియబడుచున్నది. కాన తొలుత జెప్పిన పరమేశ్వరుడు శివుడు. అట్టి శివునిగూర్చి తెలిసి కొనుటయే పాశుపతవిజ్ఞానము. అట్టి విజ్ఞానమును స్పష్టముగా యీ గ్రంథమందు తెలిసికొనవచ్చును. కాన పండితులును భక్తాగ్రేసరులును ఆమూలాగ్రముగా పఠింతురుగాక!

* *
*

# శైవగ్రంథమాల

| | | |
|---|---|---|
| 1. సంధ్యావందనము | ... | 0—8—0 |
| 2. ఆంజనేయ స్వరూపనిరూపణము | ... | 0—8—0 |
| 3. భగవద్గీత | ... | 6—0—0 |
| 4. శైవాహ్నికము | ... | 1—0—0 |

ఈ పై గ్రంథములు కావలసిన శ్రీ శైవమహాపీఠమునకు ఉత్తరము వ్రాయవలెను.

## శైవమత ప్రకాశిక చందా వివరము

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | ... | 116—0—0 |
| రాజ పోషకులు | ... | 50—0—0 |
| ప్రధాన పోషకులు | ... | 25—0—0 |
| పోషకులు | ... | 10—0—0 |
| అభిమానులు | ... | 5—0—0 |
| చందాదారులు | ... | 3—0—0 |



అడ్రస్ :— 1

మూదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

పీఠాధిపతి

ప్రిన్సిపాల్, శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి

వ రం గ ల్

అడ్రస్:— 2

మూదిగొండ రామలింగశాస్త్రిగారు

శైవమతప్రకాశికా కార్యాలయము

ఈమని (వయా) దుగ్గిరాల

సూచన :— వ్యాసములు - ఉత్తరములు - బ్లాకులు - చందాధనము ఈ పై అడ్రస్సులలో నొకదానికి పంపించవలెను.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి